దీని రాశ్యాది 10-12-27-17 ఈ విధిక్రమములను చక్కగ పాఠముచేసి యుంచుకొని యుండవలసినది.

## సామాన్య భిన్నములు పాఠము 11.

$\frac{1}{4}$, $\frac{1}{2}$ ఈ మొదలగు రూపములుగల సంఖ్యలు భిన్నాంశములగునని అంధరికినీ తెలసిన విషయమేను. అయితే దాని స్వరూపమెట్టిదనిన ఏదోనొకటిని భిన్నఛేద సంఖ్యచే భాగింపగా వచ్చు భాగములలో అంశ సంఖ్యయంతయో నన్ని భాగములుగల విలువనుసూచించును. అనగా $\frac{3}{4}$-ను 4-భాగములలో 3 భాగములనియూ $\frac{1}{2}$-ను రెండు భాగములలో నొకభాగమనియూ అదే విధమున $\frac{70}{179}$ అనగా 179 భాగములలో 70 భాగములనియూ నీమొదలుగా తెలియవలసినది.

అట్టి భిన్నములలో అంశముకంటెను ఛేదమెక్కువగ నుండునట్టి భిన్నములకు క్రమ భిన్నములనియూ, అంశఛేదములు రెండును సమముగగానీ లేక అంశమెక్కువగగానీ యుండునట్టి భిన్నములకు అపక్రమ భిన్నములనియూ, ఏదోనొక పూర్ణాంకముతో కలసియుండునట్టి భిన్నములకు మిశ్ర భిన్నములనియూ, చెప్పబడును.

ఉదా, క్రమ భిన్నములు, 2/3, 4/5, 70/91, 9/11, ఈమొదలగునవి.

అపక్రమ భిన్నములు, 17/9, 4/4, 5/3 2/2, 8/7, ఈమొదలగునవి.

మిశ్ర భిన్నములు, 4 2/3, 5 6/7, 21 3/12, ఈమొదలగునవి.

## భిన్నములమార్పు పాఠము 12.

1. అపక్రమభిన్నమును మిశ్రభిన్నముగ మార్చుట, అపక్రమ భిన్నముయొక్క లవమును హారముచే భాగింపగా వచ్చు లబ్ధమే పూర్ణాంకములగును. అందలి శేషమును పూర్ణాంకము ప్రక్కనచేర్పడు భిన్నమునకు లవముగవ్రాసి ఛేదమగు భాజకమునే నందులకు హారముగ వ్రాయగా మిశ్రభిన్నమగును.

---

నో॥ అంశమనగా గీతకు మీధి సంఖ్యయనియూ ఛేదమనగా గీతకు క్రింది సంఖ్యయనియూ సామాన్యముగ అంశము భాజ్యముగను ఛేదము భాజకముగనూ యుండుననియూ అంశ ఛేదములనుటకుమారుగా లవహారములనబడుననియూ తెలియవలసినది. $\frac{\text{అంశ} = \text{లవ} = \text{భాజ్యము}}{\text{ఛేద} = \text{హార} = \text{భాజకము}}$



ఉదా, 14/3 దీనిని మిశ్రము చేయుటకు లవమగు 14-ను హారమగు 3-చే భాగింపగా వచ్చిన పూర్ణాంకములు 4 శేషము 2 ఇదియే మిశ్రభిన్నమునందలి భిన్నాంశ సంఖ్యయగును గనుక 4 2/3 ఇదే జవాబు, అందు అంశఛేదములు రెండునూ, సమముగనుండునపుడు దానికి 1 మాత్రమేనుత్తరమగును. ఉదా, 4/4-ను 4-ను 4-చే భాగింపగా వచ్చిన పూర్ణాంకము 1 శేషము (0) గనుక 1 0/4 అని వ్రాయుటలేదు. దీనికి 1 మాత్రమే జవాబగును.

అదే విధముగనే 41/7-కు 5 6/7 వచ్చుననియూ, 255/12-కు 21 3/12 వచ్చుననియూ, 25/25-కు 1 వచ్చుననియూ, 19/6-కు 3 1/6 వచ్చుననియూ, 25/5-కు 5 వచ్చుననియూ, 42/6-కు 7 వచ్చుననియూ, మీదిక్రమముగనే లెక్కించి గనుకొనడు.

## మిశ్రభిన్నమును అపక్రమముగ జేయుట.

మిశ్రభిన్నమందలి ఛేదముచే పూర్ణసంఖ్యను గుణింపగా వచ్చుదానిలో నాభిన్నాంశమునుచేర్చి నయిన మొత్తమును అంశముగనూ, అందలి ఛేదమునేహారముగనూ వ్రాయగా అపక్రమభిన్నమగును. అందు పూర్ణాంకమును మాత్రమే నపక్రమమునకు మార్చవలసినపుడు అట్టిపూర్ణాంకమునే లవముగవ్రాసి దానికొకటిని ఛేదముగ వ్రాయగా భిన్నరూపమగును.

ఉదా, 4 2/3,-ను అపక్రమముగా జేయుటకు ఇందలి ఛేదమగు 3-చేత పూర్ణ సంఖ్యయగు 4-ను గుణింపగా వచ్చిన 12-లో అంశమగు 2-ను చేర్చగానైన అపక్రమ భిన్నమునందలి అంశసంఖ్య 14 గనుక 14/3 జవాబు 4-ను భిన్నము చేయుటకు ఇది పూర్ణాంకమగుటచే దీనికి 1 నిహారముగవ్రాయగా 4/1 ఉత్తరమగును.

అదేవిధముగనే 5 6/7-కు 41/7 వచ్చుననియూ, 21 3\12-కు 255/12 వచ్చునయూ, 8-కి 8/1 వచ్చుననియూ, 1-కి 1/1 వచ్చుననియూ, 3 1/6-కు 19/6 వచ్చుననియూ, నీమొదలుగా నెరుగవలసినది,

## పాఠము 13.

భిన్నసూత్రము, ఎట్టిభిన్నములలోనైననూగల అంశ ఛేదముల రెంటినీ నొకే సంఖ్యచే నిశ్శేషమగునట్లు భాగించిననూ లేక గుణించిననూ దానివెనుకటి వెలను మారక రూపము మాత్రము అధికాల్పములతో భేదపడియుండును, ఉదా, 6/12 దీనియందలి అంశఛేదముల రెంటినీ 3-చే భాగింపగా 2/4 దీనిని మరలనదే విధముగ రెంటచే భాగింపగా 1/2 దీనియందలి నంశఛేదముల రెంటినీ 5-చే గుణింపగా 5/10 దీననదే విధముగా 3-చే పెంచగా 15/30 దీనిని మరల రెంటిచే గుణింపగా 30/60, ఈ మీదవచ్చియుండు 6/12, 2/4. 1/2, 5/10, 15/30, 30/60, ఈభిన్నములన్నియూ నొకటికొకటి సరిసమానముగు విలువలనే చూపగల భిన్నాంశములుగానుండునని తెలియవలసినది. అందు 30/60-ని గణితక్రియలలో నుపయోగించుటకంటెను $\frac{1}{2}$-ను యుంచుకొనుట మంచి పద్ధతియగుటచే సమయోచితముగ నీమీద జూపియుండు క్రమముననుసరించి గొప్పగొప్ప సంఖ్యలుగల భిన్నములను సూక్ష్మీకరించి యుంచుకొనవలసినది.

```
          /                 /      /      /     /
        860     215        32     16      4     2    1
ఉదా,  ------   ----,    ------  ------  ------ -----------  ,,
      16(4చే)    4      800 (2) 400(4)  100 (2) 50 (2)25
          /                 /      /      /
```

ఇందు $\frac{32}{800}$కు $\frac{1}{25}$ వచ్చెను, ఈ మొదలుగా నూహింపవలెను.

### కనిష్ఠ సామాన్య గుణజము పాఠము 14. (క. సా. గు)

సూ॥ కనిష్ఠసామాన్య గుణజమును కనిపెట్టవలసిన సంఖ్యలన్నిటినీ వరుసగా వ్రాసుకొని వానిలోకొన్నిటిని నిశ్శేషముగా భాగించుటకు యోగ్యముగు సంఖ్యలలో నొకదానిచే వాటిని భాగించి కొట్టివేసి వాని భాగలబ్ధములనూ మిగిలిన సంఖ్యలనూ వరుసగా నదేవిధముగ వ్రాసిపెట్టవలసినది.

పిమ్మట ఆ నిలిచియుండు సంఖ్యలలో కొన్నిటిని నిశ్శేషముగ భాగించుటకు వీలగు సంఖ్యలలో నొకదానిచే వాటినంతటినీ భాగించికొట్టివేసి వానియందలి



భాగలబ్ధములనూ నిలిచిన సంఖ్యలనూ మీదిక్రమముగనే వరుసగా వ్రాసికొనవలయును.

ఈ క్రమముగనే మాటిమాటికినీ లబ్ధశేష సంఖ్యలను వరుసక్రమముగ కొట్టివేయుచూచివరకు లబ్ధశేషములలో 1 తప్పవేరుసంఖ్యలు నిలువకుండునట్లు లెక్కను పూర్తిచేయుగా నిలుచు భాజకములన్నిటినీ వరుసగ వ్రాసికొని వానిలో నొకదానిచే మఱియొకదానిని క్రమముగ గుణించుకొనగా వచ్చు గుణకలబ్ధమే కనిష్ఠసామాన్య గుణజమగును. (క. సా. గు.)

గమనింపు, 1 చే గుణించిననూ లేక భాగించిననూ ఫలము వ్యత్యాసమును పొందకుండుటచే నీ గణితమునందెపుడునూ 1-ని నుపయోగించుటలేదు.

ఉదా, 8, 6, 9, 12, 16, 15, వీనికి క. సా. గు. ఏమి,

```
      /   /   /        /
 3 | 8,  6,  9,  12,  16,  15
   ---------------------------
     /   /       /    /
 2 | 8,  2,  3,  4,  16,   5
   ---------------------------
         /            /
 2 |     4,  3,  2,   8,   5
   ---------------------------
 3 |         2,  3,   4,   5
   ---------------------------
                      /
 2 |             2,   4,   5
   ---------------------------
 2 |                  2,   5
   ---------------------------
                      /
 5 |                       5
   ---------------------------
```

ఇందులో నిలిచిన భాజకములు 3, 2, 2, 3, 2, 2, 5 గనుక వీనిలో నొకదానిని మఱియొకదానిచే వరుసక్రమముగ గుణింపగా వచ్చు గుణక లబ్ధమే క. సా. గు. మగును గనుక 720 జవాబు.

```
3 × 2
------
 6 × 2
 ------
  12 × 3
  -------
   36 × 2
   -------
    72 × 2
    -------
     144 × 5
     --------
         720   ఇదే ఉత్తరము.
```

*N. B.* (/) ఈ గురుగల సంఖ్య కొట్టబడినదని తెలియవలెను.

2-వ ఉదా, 3, 27, 21, 9, 15, 6, వీనికి కనిష్ఠసామాన్య గుణజమేమి ?

| | | |
|---|---|---|
| 3 | 3, 27, 21, 9, 15, 6 | 3 × 3 |
| 3 | 9, 7, 3, 5, 2 | 9 × 3 |
| 3 | 3, 7, 5, 2 | 27 × 7 |
| 7 | 7, 5, 2 | 189 × 5 |
| 5 | 5, 2 | 945 × 2 |
| 2 | 2 | 1890 ఇదే క. సా. గు. |

*N. B.*—ఈ మీది క్రమముగనే గణింపు చుండిన అందలి విశేషక్రమములు వారివారి శక్త్యానుసారముగ వారివారికే తేటపడును.

## భిన్నములను సమాన హారములుగ మార్చుట పాఠము 15.

సూ॥ సమాహారములుగ చేయవలసిన భిన్నములయందలి ఛేదములకు క. సా. గు. తెచ్చి దానిని ఆయాభిన్నములయందలి ఛేదములచే వరుసగ భాగింపగావచ్చు లబ్ధములను (ఇందెపుడునూ శేషమురాదు అట్లొచ్చినపుడు లెక్కలో తప్పుపడియుండును.) ఆయా భిన్నాంశములచే వేరువేరుగ గుణింపగా వచ్చు మొత్తములే నాయాభిన్నములకు సమాన హారములయందలి నంశ సంఖ్యలగును. అట్టిఅంశములకంతయూ క. సా. గుణజమే సమాహారకమగును.

ఉదా, $\frac{2}{3}$, $\frac{5}{9}$, $\frac{1}{2}$, $\frac{3}{4}$ వీనిని సమాహారములకు మార్చుడు.

ఈ భిన్నములలోగల ఛేదములగు 3, 9, 2, 4, ఈ సంఖ్యలకు కనిష్ఠ సామాన్య గుణజమును సాధింపగా 36 వచ్చును, దీనిని మొదటి భిన్నముయొక్క ఛేదమగు 3-చే భాగింపగా వచ్చిన 12-ను దానియంశమగు రెంటిచే గుణింపగా



నైన మొదటి భిన్నముయొక్క అంశము 24, అదేవిధముగనే 36-ను రెండవభిన్న హారమగు 9-చే భాగింపగా వచ్చిన 4-ను దాని అంశమగు 5-చే గుణింపగా వచ్చిన రెండవభిన్నాంశము 20, క. సా. గు. ను. మూడవభిన్నహారమగు 2-చే భాగింపగా వచ్చిన 18-ని అందలి అంశమగు 1-చే పెంచగానైన 3-వ భిన్నాంశము 18 ఇదే విధముగ గణితము చేయగా 4-వ భిన్నమునకు 27 అంశమగును వీనికంతయూ క. సా. గు. మేహారకమగుటచే పూర్వపు హారములను విడిచి $\frac{24}{36}$, $\frac{20}{36}$ $\frac{18}{36}$, $\frac{27}{36}$ అని ఒకటే హారములుగల భిన్నములగును.

## భిన్న సంకలనము పాఠము 16.

భిన్నములను కూడుటయందు ఒకటి దిగువనొకటిని వ్రాసికొనుటకు మారుగా + ప్లస్ ఈ గుర్తులనుపయోగించి వరుసగ వ్రాసుకొనెదరు. అందు + ఈ గుర్తున కుభయ పార్శ్వములయందలి సంఖ్యలనూ చేర్చి మొత్తము చేయవలసినదని తెలియవలెను.

సూ॥ మొత్తము చేయవలసిన భిన్నముల నంతయు మీదిక్రమముగనే సమాహారమునకు మార్చి పిమ్మట వానియందలి అంశములనంతయూ చేర్చి మొత్తము చేయగా నగుసంఖ్యయే సమాహారమునకు అంశ సంఖ్యయగును. గనుక దానికి సమాహారమునే ఛేదముగవ్రాయగ జవాబగును. అది అపక్రమముగనుండునపుడు దానిని మిశ్రీకరింపవలసినది.

గమనింపు:—సంకలనముచేయవలసిన భిన్నములలో మిశ్రపూర్ణాంకములు వచ్చియుండెనేని వానిని మొదటనే నపక్రమమునకు మార్చి యుంచుకొనియుండవలసినది.

1 ఉదా, $\frac{2}{3}+\frac{5}{9}+\frac{1}{2}+\frac{3}{4}=$ వీనిని చేర్చిమొత్తము చేయుటకు వెనుకటివలెనే వీనిని సమాహారములకు మార్చగా,

$\frac{24}{36}+\frac{20}{36}+\frac{18}{36}+\frac{27}{36}$ = ఇట్లు వ్రాసికొనుటకు మారుగా $\frac{24+20+18+27}{36}$ = అని వ్రాయుట గలదు. ఇపుడు వీని అంశములనంతయూ చేర్చగానైన మొత్తము 89 గనుక $\frac{89}{36}$ ఉత్తరమగును. ఇది అపక్రమముగ నుండుటచే దీనిని మిశ్రీకరింపగానైన జవాబు $2\frac{17}{36}$.

2. ఉదా, $2\frac{2}{3}+5+\frac{5}{6}+\frac{7}{12}+\frac{11}{24}$ = వీనిలో మిశ్రమ పూర్ణాంకములుండుటచే మొదట వానిని నపక్రమమునకు మార్చవలెను గనుక $\frac{8}{3}+\frac{5}{1}+\frac{5}{6}+\frac{7}{12}+\frac{11}{24}$ = ఇపుడు వీనిని సమాహారములకు మార్చగా $\frac{64+120+20+14+11}{24}$ = జవాబు $9\frac{13}{24}$.

## వ్యవకలనము పాఠము 17.

ఈ వ్యవకలనపు లెక్కలలో (—) మైనస్ ఈ గురుతునుపయోగించెదరు. అందు (—) ఈ గురుతునకు వెనుకటి సంఖ్యలోనుండియు ముందు సంఖ్యను తీసివేయవలసినదని తెలియవలెను. శోధనీయము — శోధకము.

సూ॥ సంకలన సూత్రమునందు చెప్పియుండు విధిక్రమములుగనే వ్యవకలన గణితమునందు సైతము మిశ్రమ పూర్ణాంక విధులననుసరించి శోధనీయ్య శోధకములరెంటినీ సమాహారకములకు తెచ్చి తరువాతనా శోధనీయ భిన్నముయొక్క అంశములోనుండియు శోధక భిన్నమందలి అంశమును తీసివేయగా నిలుచు దానికి సమాహారమునే ఛేదముగ వ్రాయగా నుత్తరమగును.



1 ఉదా, $\frac{5}{4}-\frac{4}{7}$ = వీనిని సమాహారములుగ మార్చగా $\frac{35}{28}-\frac{16}{28}$ ఇట్లు వ్రాయుటకు మారుగా $\frac{35-16}{28}$ = అనివ్రాసుకొని శోధనీయ అంశమగు 35 లో శోధకాంశమగు 16-ను తీసివేయగా నిలిచినది 19 గనుక $\frac{19}{28}$ ఇదే ఉత్తరమగును.

2 ఉదా, $2\frac{3}{5}-\frac{4}{9}$ = వీనిలో మిశ్రమ పూర్ణాంకములుండుటచే మొదట వానిని నపక్రమమునకు మార్చుకోవలెను గనుక $\frac{13}{5}-\frac{4}{9}$ వీనిని సమాహారములకు మార్పగా $\frac{117-20}{45}=\frac{97}{45}$ కి ఉత్తరము $2\frac{7}{45}$ వచ్చును.

## గుణాకారము పాఠము 18.

సూ॥ ఈ మీద సంకలన వ్యకలనములలో చెప్పియుండు విధముగనే గుణాకారమును చేయవలసినపుడును మిశ్రమ పూర్ణాంకములు వచ్చియుండునపుడు వానినంతయూ మొదటనే నపక్రమమునకు మార్చియుంచుకొని యుండవలసినది తరువాత గుణ్య గుణకములయందలి భిన్నాంశములలోనొక దానిని మరియొక దానిచేతను అదే విధమున భిన్నహారములలోనొక దానిని మరియొక దానిచేతను క్రమముగ గుణింపగావచ్చు అంశ ఛేదములే ఉత్తరమగును.

1 ఉదా, $\frac{4}{5}\times\frac{5}{6}$ దీనికి $\frac{4\times5}{5\times6}=\frac{20}{30}$ దీనిని సూక్ష్మీకరింపగానైన ఉత్తరము $\frac{2}{3}$.

2 ఉదా, $2\frac{3}{5}\times5=\frac{13}{5}\times\frac{5}{1}=\frac{65}{5}=13$ ఉత్తరము.

3 ఉదా, $\frac{2}{3}\times\frac{4}{2}\times\frac{3}{5}=\frac{24}{30}=\frac{4}{5}$ జవాబు.

ఎన్ని సంఖ్యలుండినను ఈ క్రమముగనే నూహింపవలసినది.

## భాగహారము పాఠము 19.

ఈ భిన్నముల భాగహారములలో ÷ ఈగురుతునుపయోగించెదరు. అందీ డివైడెడ్ బై అను గురుతునకు వెనుకటి సంఖ్య భాజ్యముగనూ ముందు, సంఖ్య భాజకముగనూ యుండునని తెలియవలసినది. భాజ్యము ÷ భాజకము.

సూ॥ ఈ మీాద చెప్పియుండు సంకలనాది సూత్రముల ననుసరించియే నీ భాగహారములయందు సైతము మిశ్రమ పూర్ణాంకములుగల తరుణములయందు అట్టి భిన్నములను మొదటనే నపక్రమమునకు మార్చియుంచుకొని యుండవలసినది.

తరువాత భాజ్యభిన్నము నదే విధముగ నుంచుకొని భాజక భిన్నమందలి అంశమును ఛేదముగను ఛేదమును అంశముగను మార్చి నాభాజ్య భాజకముల నడుమనుండు భాగాహారపు గురుతును గుణాకారపు గురుతుగాచేసి మీాద్రిక్రమముగనే గుణింపగా నుత్తరమగును.

1 ఉదా, $\frac{2}{3} \div \frac{4}{5}$ ఇందలి భాజ్యమునదే విధముగ నుంచుకొని భాజకమును తలక్రిందలుచేసి గుణింపగా $\frac{2}{3} \times \frac{5}{4} = \frac{10}{12}$ దీనికి $\frac{5}{6}$ ఉత్తరమగును.

2 ఉదా, $4\frac{2}{3} \div 2\frac{1}{3}$ దీనిలో మిశ్రభిన్నములుండుటచే వానిని అపక్రమమునకు మార్చి తరువాత లెక్కింప వలయును గనుక,

$\frac{14}{3} \div \frac{7}{3} = \frac{14}{3} \times \frac{3}{7} = \frac{42}{21}$ ఇందుకు జవాబు 2 వచ్చును.

3 ఉదా, $4 \div 2 = \frac{4}{1} \div \frac{2}{1} = \frac{4}{1} \times \frac{1}{2} = \frac{4}{2}$ = జవాబు 2

*N. B.* ఈ భిన్న సూత్రములలో భిన్న విరూప కరణ నిర్వచన రూపాంతరాది సూత్రములు లెక్కలేక యుండినను వాటినన్నిటిని ఈ గ్రంథముననే వ్రాసి తెలుపుటకు ఇది గణిత శాస్త్రము (అరిత్మెటిక్) కాదు.

గాకనూ నీ గ్రంథమందలి రాబోవు భాగమగు జాతక రహస్యమునకు కావలసినంతవఱకు గణిత భాగము నిందుచూపబడినదియే గాక లెక్కకుమించి పనికి మాలియుండు సంగతులను వ్రాయలేదు.



## పాఠము 20.

వర్గము, వర్గించుట యనగా యావసంఖ్యను వర్గింపవలెనో నాసంఖ్యను అదే సంఖ్యచేతనే గుణింపవలసినదని తెలియవలెను.

ఉదా, 5-కు వర్గము కావలసిన ఎడల 5-ను 5-చేతనే గుణింపవలసినది 5 × 5=25,, 9-కి వర్గము కావలసిన ఎడల 9 ని 9-చేతనే పెంచవలసినది 9 × 9=81,, 26 కు వర్గము 26 × 26=676,, అదే విధముగనే కలాది 20-10-కి వర్గము కావలసిన ఎడల 20-10 కలాదిని 20-10 కలాదినుండియే గుణింపవలసినదనియూ, 5-6 ఘటికాదిని వర్గించునపుడు 5-6 ఘటికాదిని 5-6, ఘటికాదినుండియే గుణింపవలసినదనియూ నీ మొదటగా నూహింపవలసినది.

## మూలసాధనము పాఠము 21.

మూలమనగ నొకసంఖ్యా వర్గమునుండియు నా సంఖ్యను కనిపెట్టుటకు పేరు.

ఉదా, 25 వర్గముగనుండునపుడు దానికి మూలమేమి ? అనగ 25 అనునది యావ సంఖ్యకు వర్గముగనుండునో నాసంఖ్యను కనిపెట్టవలసినదని భావము.

ఇందయిదును వర్గింపగా 25 వచ్చును గనుక 25-కు 5 మూలమగునని తెలియవలసినది.

అదే విధమున 81-కి మూలము 9 అనియూ 100-కి మూలము 10 అనియూ 4-కు మూలము రెండనియూ 1-కి మూలమొకటే యనియూ ఇట్లు వర్గమునుండియు వర్గించియుండు సంఖ్యనెత్తుటకు మూల సాధనమని జెప్పబడును.

అట్టి మూలమును సాధింపదగిన సంఖ్య 100-లోకీ (తగ్గి) యుండునపుడు దాని మూలమును (మగ్గిళ్ళు) ఎక్కాల యొక్క సహాయముచేతనే సులభముగ తెలియవచ్చును.

అంతకంటె నధిక సంఖ్యలకు వర్గమూల మెత్తవలసినపుడు నీక్రింది భాగహార సూత్రముల సహాయములచే కావలసిన సంఖ్యా మూలములను సులభముగ తెలియవచ్చును.

## (1) సూత్రము.

మూలమెత్తవలసిన సంఖ్యలలోగల అంకముల యందలి ఏకస్థానము (కడలోనుండు అంకము) ను మొదలుజేసి వరుసగ నొక యంకమును వదలినొక యంకము మీద (.) ఇట్టి గురుతు లుంచవలసినది.

```
      .   .   .     .   .   .     .   .   .     .   .   .   .
ఉదా, 8 2 6 9 6 ,, 1 8 9 8 6 4 ,, 9 6 3 2 6 4 ,, 4 2 2 6 4 8 2 ,,
```

ఇట్లు గుర్తులను యుంచు కొనవలయును.

## (2) సూత్రము.

పైజూపియుండు గురుతులుగల అంకమునూ దానివెనుకటి యంకమునూ (రెండును) ఒకే యంకముగ తెలసి నీక్రింద 3-వ సూత్రము మొదలు సూత్రములలో జెప్పబోవు విధులచే భాగింప వలసినది. అందు మొదటి యంకమగు (ప్రథమాంకము) మీదనే (.) పడియుండునపుడు అట్టి సంఖ్యలో ప్రథమమున నొకే యంకమును తరువాత క్రమముగ రెండు రెండంకములతో చేరియుండునవియును వరుసగా వచ్చుచుండును.

## (3) సూత్రము.

మూలమెత్తవలసిన సంఖ్యలో మొదట (.) గలనొకే యంకముగాని లేక (.) తో చేరియుండు స్థాన ద్వయాంకముగానీ నిలుచును, దానిని మొదట యావ అంకముచే భాగించుటకు సరియగునో అదే అంకమే లబ్ధమునందునూ రావలసినది. (ఇందు లబ్ధ భాజకములు రెండును నొకే యంకముగ నుండవలసినదని భావము.) అట్టి యంకములలో నధికమగు యంకముచే ప్రథమమున భాగింపవలయును.

### ఉదాహరణములు.

(1) (2) (3) (4)



```
  .   . .             .   .   .               .   .   .      . . .   .   .
2|8 2 6 9 6|2   4| 1 8 9 8 6 4 |4  9| 9 6 3 2 6 4 |9   2|4 2 2 6 4 8 2|2
 |4        |     |  1 6   .  . |    |  8 1      .  |   .|4 .          |
 |----     |     |  ----       |    |  ----        |    |----         |
 |4        |     |    2        |    |  1 5         |    |             |
```

## (4) సూత్రము.

మీద చూపియుండు విధముగ భాజక లబ్ధముల రెంటియందునూ నొకే యంకము వచ్చువానిలో నధికమగు యంకముచే భాగించి వచ్చిన లబ్ధమును భాజకము డిగవబెట్టి మొత్తముజేసి భాజ్యమునుండియు శేషమునకు 1 అంకమునసగా స్థానద్వయాంకమును చేర్చవలసినది. ఉదా,

(1) (2) (3) (4)

```
    .   .   .     .   .   .      .   .   .      .   .   .   .
2 | 8 2 6 9 6|2  4|1 8 9 8 6 4| 4 9|9 6 3 2 6 4|9  2|4 2 2 6 4 8 2|2
2 | 4        |   4|1 6        |   9|8 1        |   2|4            |
--|  -----   | ---| ----      | ---| -------    |....| ----        |
4 | 4 2 6    |   8|2 9 8      | 1 8|1 5 3 2    |   4|  2 2        |
```

## (5) సూత్రము.

మఱల లబ్ధమునందు యావ అంకమును చేర్చుటకు వీలుగనుండునో నాయంకమును అదే విధముగనే ముందు భాజకములో చేర్చి తరువాత లబ్ధముందు చేర్చి భాగింపవలసినది.

అందు భాగించుటకు పోని తరుణముల యందంతయూ భాగాహార విధి క్రమములుగనే లబ్ధమునందునూ భాజకమునందునూ (౦) లు బెట్టి తరువాత పై భాజ్యమునుండియు వేరొక యంకమును శేషమునకు తీసుకొని మీదిక్రమముగనే భాగింపవలసినది.

ఉదా, (1) (2)

```
2  | 8 2 6 9 6 | 28        4  | 1 8 9 8 6 4 | 4 3
2  | 4                     4  | 1 6
48 | 4 2 6                 83 | 2 9 8
   | 3 8 4                    | 2 4 9
   |   4 2                    |   4 9
```

(3) (4)

```
9   | 9 6 3 2 6 4 | 9 8     2   | 4 2 2 6 4 8 2 | 2 0 5
9   | 8 1                   2   | 4
188 | 1 5 3 2               405 | 2 2 6 4
    | 1 5 0 4                   | 2 0 2 5
    |     2 8                   |   2 3 9
```

## (6) సూత్రము.

మీదిక్రమముగ భాగించిన వెనుక ఇపుడు క్రొత్తగా లబ్ధమునందు చేర్చిన యంకమును భాజకమునకు కూడి భాజ్యమునుండియూ వెనుకటి వలెనే నొకయంకముకు శేషమునకు తీసుకొని మరల లబ్ధమునకు యావ యంకము రాగలదో దాని నదే విధమున ముందు భాజకమునకు చేర్చి పిమ్మట మీదిక్రమముగనే భాగింపవలసినది.

తరువాత 4, 5, సూత్రములలో జెప్పియుండు క్రమములుగనే అపుడపుడు లబ్ధమునకు చేర్చిన యంకములను అపుడపుడే భాజకమునకు కూడుకొనుచూ భాజ్యమునుండియూ శేషమునకు అంకములను వరుసగా చేర్చుకొనుచూ తరువాత లబ్ధమునకు చేర్చబోవు అంకమునే ముందు భాజకమునకు చేర్చి పిమ్మట మీదిక్రమములుగనే (క్రొత్తక్రొత్త భాజకములచే) మాటి మాటికీ భాగించుతూ భాగించి



వచ్చిన లబ్ధాంకమును మరల భాజకమునకు కూడుకొనుచూ, లెక్క పూర్తియగు వఱలో నీక్రమముగనే మాటి మాటికీ జేసి నంత్యమున సర్వోత్తరముగ భాగలబ్ధము నెత్తగా నదియే వర్గమూలమగును.

ఉదా, (1) (2)

```
2   | · · ·                          | · · ·       | 4 3 5
2   | 8 2 6 9 6 | 2 8 7        4     | 1 8 9 8 6 4 |     1 అర్థో
48  | 4         |   1 అర్థో    4     | 1 6         | 4 3 6 జవాబు
8   | 4 2 6     | 2 8 8 ఉత్తరం 83    | 2 9 8
567 | 3 8 4                    3     | 2 4 9
    | 4 2 9 6                  865   | 4 9 6 4
    | 3 9 6 9                        | 4 3 2 5
    |   3 2 7 శేషము                  |   6 3 9 శేషము
```

(3) (4)

```
9    | · · ·                       2    | · · ·
9    | 9 6 3 2 6 4 | 9 8 1 ఉ       2    | 4 2 2 6 4 8 2 | 2 0 5 5
188  | 8 1                         405  | 4             |       1 అ
8    | 1 5 3 2                     5    | 2 2 6 4       | 2 0 5 6 మూలం
1961 | 1 5 0 4                     4105 | 2 0 2 5
     |   2 8 6 4                        |   2 3 9 8 2
     |   1 9 6 1                        |   2 0 5 2 5
     |     9 0 3 శేషము                  |     3 4 5 7 శేషము
```

## పాఠము 22 కలాది గణితము.

సూ॥ వర్గమూలములో కలాది ఫలమును సాధింపవలసిన తరుణముల యందు మూలమెత్తవలసిన దానిని పరలుజేసి అయినమొత్తమును బట్టి నీమీది క్రమములుగనే సర్వోత్తరమతమున మూలమునెత్తగానది విలిప్తల రూపమగును.

దాని నరువదింట భాగించి కలాదిగ జేసి కొనవలయును. ఈ క్రమమునే ఘటి కాదియునూ బోలియుండునని తెలియవలసినది.

ఉదా, 5 7 8 4 0-1 5 కలాదికి మూలమేమి.

ఈ మూల మెత్తవలసిన కలాదియగు 5 7 8 4 0-15 లను పరలు జేయగా 2 0 8 2 2 4 9 0 0 దీనికి మూలము నెత్తగా విలిప్తలగును.

| | | |
|---|---|---|
| 1 | . . . . . | |
| 1 | 2 0 8 2 2 4 9 0 0 | 1 4 4 3 0 ఇదే మూలవిలిప్తలు |
| 2 4 | 1 | |
| 4 | 1 0 8 | దీని కలాది 240-30 |
| 2 8 4 | 9 6 | |
| 4 | 1 2 2 2 | |
| 2 8 8 8 | 1 1 3 6 | |
| | 8 6 4 9 | |
| | 8 6 4 9 | |

గననింపు:—240-30 కలాదెని వర్గించి చూడుము.

సూత్రము:—లిప్తలకు మూలమెత్తగా లిప్తలే వచ్చునవియూ, లిప్తలను విలిప్తలుజేసి మూలమెత్తగా గణిత విపర్యాస మగుననియూ, లిప్తలను పరలుజేసి మూలమెత్తగా విలిప్తలగుననియూ, దానిని మానమెత్తగా కలాది యగుననియూ తెలియవలసినది.

మఱియూ నీ గణితమునందు రెండంకములను ఒకే యంకముగ భావించి యుండుటచే భాజ్యమునందు సున్నలు నిలిచిపోవు తరుణములయందు ఎన్నిసున్నలు నిలిచియుండునో దాని నర్ధించి లబ్ధమునందు చేర్చవలసినదేగాని సున్నలన్నియూ బెట్టగూడదు. అందెవుడైననూ సున్నలు విషమ సంఖ్యలుగ నిలుచుట లేదని తెలియవలసినది.



పాఠము 23 సంకేత వాక్యార్థములు.

(1) దినార్ధము=అహరర్ధము=అహర్దళము=అహఃప్రమాణమునందలి సగము.

(2) దినమానము=అహర్మానము=అహస్సు=సూర్యోదయాది అస్తకాల పర్యంత ప్రమాణము.

(3) అర=సగము=దళము=దళితము=అర్ధము=అర్ధీకరించి=రెండింట నొక భాగము,, వంతు=భాగము,,

(4) భుక్తము=గతము=చెల్లు=కడచిపోయినది=గతించిపోయినది=అనుభవించినది=భోగించినది=నడిచినది........

(5) భోగ్యము=ఏష్యము=గమ్యము=బాకీయుండునది=గతింపవలసినది=మిగిలినది=అనుభవింపవలసిన=భోగింపవలసిన........

(6) ద్విఘ్నించి=రెట్టించి=ద్విగుణించి=2-చే పెంచి.

(7) తృతీయాంశము=3-ట నొక పాలు,, చతుర్థాంశము=4 భాగములలో 1 భాగము, ఈ మొదలుగా తెలియవలసినది.

(8) ప్రమాణము=ఆద్యంతము=పరిమాణము యొక్క విలువ.

(9) క్రాంతము=చేరుట=పొందుట=కలియుట,; సామ్యము=సమానము,,

(10) స్పర్శము=ఆరంభించుట=మొదలు బెట్టుట=ప్రారంభము,, మోక్షము విరామము=నిర్గమము=విడిచిపెట్టుట.

(11) ప్రతి బెట్టుట=వేరుగానొక చోటున వ్రాసికొనుట, ప్రతి=స్థానము=స్థళము=చోటు=జాగా.

(12) మానమెత్తుట = ఆయాకోష్ఠాను సారముగ భాగించి ఫలమును క్రమపరచుట.

(13) తాత్కాలికము=తత్కాలము=మనయిష్ట కాలమగు ఘటికాది.

(14) గతము=తగ్గియుండుట, ఏష్యము=ముందు బోవుట.

(15) ధనము=చేర్చుట,, ఋణము=తీసివేయుట.

(16) సంస్కరించుట = ఆయా విధిక్రమములననుసరించిధనఋణములు జేయుట.

(17) ఏ=ఏకస్థానము = ఒకట్లు,, ద=దశస్థానము=పదులు,, శ= శత=స్థానము=నూర్లు,, స=సహస్రస్థానము=వేలు,, (ద-స)= దశ సహస్రస్థానము=పదివేలు,, ల=లక్షస్థానము=లక్ష,, ద-ల=దశ లక్షస్థానము=పది లక్షలు.

(18) ప=పదకం,, అ=అంతరం,, ధ=ధనాంతరం,, ఋ=ఋణాంతరం,, గ=గతి,, క=కర్కాద్యాది,, మ-మకరాది,,

(19) విపరీతము-వ్యుత్క్రమము = విలోమము=అపసవ్యము= వైపరీత్యము వ్యత్యస్తము = వక్రము = తలక్రిందలు.

(20) సవ్యము=క్రమము = అను లోమము= వరుస = విధి.

(21) అహర్గణము = ద్యుగణము దినగణము = దినసంఘము = దిన సముదాయము = దిన సమూహము ఏదోనొక క్లుప్తదినము మొదలు ఇష్ట దినము వఱలో నగు నరువదిఘడియల ప్రమాణముగల దినముల మొత్తసంఖ్య.

(22) విషువచ్ఛాయ = అక్షచ్ఛాయ= అక్షభా = పలభా.

(23) ప్రాక్కపాలము= పూర్వకపాలము = ప్రాక్పర్వము = అర్ధరాత్రి మొదలు రాబోవు మధ్యాహ్న పర్యంత కాలము.

(24) అపరకపాలము = ప్రత్యక్కపాలము = పశ్చాత్కపాలము = పశ్చాత్పర్వము = ప్రత్యక్పర్వము= మధ్యాహ్నము మొదలు రాబోవు నర్ధరాత్రి పర్యంత కాలము.



(25) పూర్వనతం=ప్రాఙ్నతం,, అపరనతం = పశ్చాన్నతం = ప్రత్యఙ్నతం

(26) ఇష్టము=అభిమతము =కోరికె = స్ఫుటము=కావలసిన.

(27) చరఖండములు = చరార్ధములు =చరదళములు.

(28) ప్రథమ ద్వితియ్య తృతియ్యములు = ఆది మధ్యాంతములు

(29) ద్విగుణము =రెండింతలు,, త్రిగుణము =మూడింతలు ఈ మొదలుగా=నూహింపవలసినది. గుణము=ఇంతలు,,

(30) స్వోదయములు = స్వదేశ లగ్నప్రమాణములు,, లంకోదయములు లంకాలగ్నప్రమాణములు.

(31) శరము = విక్షేపము,, పర్వాంతము=తిథ్యంతము = సూర్యోదయాది తిథిప్రమాణ ఘటికాది.

(32) మానయోగార్ధము = బింబయోగార్ధము,, మానము = బింబము యోగము = చేరుట-- పొందుట కలియుట,,

(33) వర్తించుచుండెడి=సంచరించెడి--నడుస్తూయుండే.

(34) అంతము=అగ్రము=చివర--కొన--మొన.

(35) ఓజము=విషమము,, యుగ్మము=సమము,, ఘంట- $2\frac{1}{2}$ ఘడియ

(36) గమనింపు = ముఖ్యముగా చూడవలసిన సందేహనివర్తి విషయములలోనగు విశేష సంగతుల మరా.

*N. B.* ఈ యధ్యాయమున దేరినగాని ముందు పోకూడదు.

ఇతి శ్రీ సిద్ధాన్త రహస్యే గ్రహతంత్రే

## గణితాధ్యాయోనామ ప్రథమోధ్యాయః

శ్రీ ఛాయాసంజ్ఞాసమేత

శ్రీసూర్య నారాయణ స్వామినేనమః.

# సిద్ధాంతరహస్యే మధ్యాధ్యాయ ప్రారంభము.

శ్లో॥ రవి శశి భూసుత సౌమ్యా మర గురు కవి రవితనూత్థ
రాహు ముఖర్క్ష| ఖచరాన ష్టదిగీశా నింద్ర హుతాశన యమాది
శాన్వద్దే ॥

అత్రాదౌ గ్రంథ స్థాంక స్సంజ్ఞా నిర్ణయమాహ.

వా॥ కటపయ పురస్సర వర్ణా నవ నవ పంచాష్ట కల్పితాః క్రమశః । ఇన
శకాంత్య వర్ణాః వ్యోమం వామే పృథ్యక్షరవిధే గ్రాహ్యం ॥

తా॥ ఈ గ్రంథము నందలి సంఖ్యానిర్ణయ సూత్రాక్షరవాక్యము
లంతయు సంజ్ఞాధ్యాయోక్తమగు కాద్యా ద్యక్షర వర్ణ క్రమములచే నిర్ణయింప
బడియుండునని తెలియవలసినది.

అథశకాబ్దాద్యానయనక్రమః.

మా॥ నీలఘ్ననతయుక్ దీర్ఘగతస్యా ద్వర్షయుక్ఛకః।
ధూసీపూగ యుతం శాకం గతాబ్దస్యా ద్భవేఃకలౌ ॥

తా॥ 30-ని 60-ట హెంచి వచ్చిన మొత్తమునకు 49 నిన్నీ ప్రభవాదిగ
నిష్ట సంవత్సరారంభమువఱలో గతించియుండు గతాబ్ద సంఖ్యయున్నూ చేర్చగా
శాలీవాహన శక గతాబ్దములగును. అందు 3179-ని చేర్చగా,కల్యాది గతాబ్దముల
గుచున్నవి.

ఉదా,, భావ సంవత్సరా షాఢశు 15 గురువారము నాటికి జూపబడును.

30-ని 60-ట గుణింపగా వచ్చిన 1800-కు 49 న్నీ ప్రభవాదిగ భావాబ్దాది
యనగా శ్రీముఖాంతము వఱకు గతించియుండు సం॥లు 7-న్నూ చేర్చగాసైన
భావ సంవత్సరమునకు శాలీవాహన శక గతాబ్దములు 1856, దీనిలో 3179-ని చేర్చగా
సైనకల్యాది గతాబ్దములు 5035.



అస్య గ్రంథోత్పత్తి కాల నిర్ణయమాహ.

శ్లో॥ కలౌశూలి నమోభుక్త స్వస్తి శ్రీముఖవత్సరే ।
ఫాల్గుణస్యాసితే పక్షేప్య మాయాం గురువాసరే ॥
సంఘూన్నర్థాలహాటస్యా ద్గత కల్యాద్యహర్గణాః ।
ఏత త్ప్రభాత సమయే లంకామధ్య ముదాహృతం ॥

తా॥ కల్యాద్య హర్గణము 1839047 గల కలిగ్గతము 5035-ను
చెల్లగల శ్రీముఖ సంవత్సర ఫాల్గుణ బ, 30-లు గురువారమునాటి లంకాప్రాతః
కాలమునుండియు నీగ్రంథోక్త గణితము చే గూడును.

అథాహర్గణానయనమాహ.

శ్లో॥ మార్గనాశ విశోచ్ఛిష్టం ధృవాబ్దస్యాద్భవేః కలౌ ।
ధృవాబ్దః ఖేటనిహతై శ్చైత్రాదిర్గతమాసయుక్ ।
స్వత్రి్రతాడితయుక్స్వాత శ్శైపాప్తమధియుక్సదా ॥
దినీకృతో దినయుతః స్వవాచాంశా క్షయంరుణం |
కృత్వాస్వకాది వారంస్యా ద్యద్వాచాంతర యుగ్వియుక్ ॥

తా॥ కలిగతాబ్దములయందు 5035-ను తీసివేయగా నిలిచినది ధృవా
బ్దములగును దానిని 12-ట హెంచివచ్చిన మొత్తమునకు చైత్రాదీష్ట మాసారంభము
వఱలో చెల్లియుండు గతమాసముల సంఖ్యను చేర్చ అయిన మొత్తమును రెండు ప్రతు
లుంచి ( రెండుస్థానములయందు వ్రాసుకొని ) యందొక దానిని ద్విఘ్నించి
నందులో 61 ని చేర్చి అయిన మొత్తమును 65-ట భాగింపగా వచ్చు లబ్ధము అధిక
మాసములగును గనుక దానిని మరియొకదానిలోచేర్చి అయిన మొత్తమును 30 ట
గుణించి దానికి శుక్లప్రతి పదాదీష్ట దినమువఱకు నగు తిథిసంఖ్యను చేర్చి అయిన
మొత్తమును మరలరెండు ప్రతులుంచి యందొక దానిని 64-చేత పాలుగొనిన
లబ్ధమగు క్షయదినముల నింకొకదానిలో తీసివేయగా నిలుచు శేషమే నీగ్రంథో

క్తాహర్గణమగును. గనుక దానిని నేటిచే (7-ట) భాగింపగా నొకటి మొదలు క్రమముగ నిలుచు శేషములు వరుసగా శుక్రాదివారములను సూచించును అందిష్టవారము సరిరాని యెడల ఋణముల యందంతయూ మీద అహర్గణములో సందర్భమును గూర్చి నొకటి రెంటిని ధనముగాని లేక ఋణముగానీ జేసి వారమునను సరిపాల్చినుంచు కొనవలసినది. (ఇందలి భాగాహారములలో సర్ధోత్తరమతములేదు.)

ఉదా, కలిర్గతము 5035 దీనిలో 5035-ను తీసివేయగా నిలిచిన ధృవాబ్దములు (౦) దీనిని 12-ట గుణించి వచ్చిన గుణక లబ్ధములో ఇష్ట సంవత్సరమందలి ఆషాఢ మాసారంభమువఱకూ చెల్లియుండు చైత్రాది గతమాసములగు 3-ను చేర్చగానైన మొత్తము 3 (దీనినే మాసప్రతియని చెప్పబడును. దీనినుండియే మందయాంశలనెత్తబడును.) దీనిని రెండుప్రతులుగ దలచియందొక దానిని 2-చే గుణింపగా వచ్చిన 6-లో 61-ని చేర్చి 65-ట భాగింపగా వచ్చిన పూర్ణలబ్ధము (శేషమక్కఱలేదు) ఇదియే అధిక మాసములగును గనుక దీనిని మీద చూపియుండు మాసప్రతియగు 3-లో కలుపగా 4 అయినది. దీనిని 30-ట గుణింపగా 120-దీనిలో ఇష్టమాసమందలి శుక్ల ప్రతిపదాదీష్టదిన పర్యంతమగు తిథి సంఖ్య 15 ను చేర్చగానయినది 135 దీనిని రెండు ప్రతులుగ దలచి నొకదానిని 64-ట భాగింపగా వచ్చిన క్షయదిన లబ్ధమగురెంటిని మరియొక దానిలో తీసివేయగా నిలిచిన అహర్గణము, 133 దీనినేడింట భాగింపగా నిలిచిన శేషము (౦) గనుక శుక్రాదిగురువారమగునని తెలిసెను. ఇందిష్టవారము సరివచ్చినది గనుక ఈ 133-లో నేమియూ ధనఋణములు చేయనక్కఱలేదు గనుక 133 ఇదియే నీగ్రంథోక్త అహర్గణమగును. *

---

నో * అధిమాసమునగానీ లేక దాని వెనుకటి మాసమునగానీ అహర్గణానయనము చేయునపుడు గతవర్షాధిక సంఖ్యకంటెను వర్తమానాబ్దాధిక సంఖ్య మించియుండెనేని యందొకటిని తగ్గించి యుంచుకొనవలసినది. మరియూ కడచిన క్షయాబ్దాత్పూర్వము 29-ని 60-చేతనూ ఇపుడు 30-ని 60-చేతనూ ముందురాబోవు క్షయాబ్దాత్పరము 31-ని 60-చేతనూ గుణించుకొని శకాబ్దాద్యానయనాదులను చేసికొనవలసినది. అనగా ప్రభవాదిషష్ట్యబ్దములకొక అబ్దచక్రమంటచే గతైష్యచక్రములయందలి గణిత క్రమములలో 30-కి నొకటొకటి చొప్పున క్రమముగా ఋణధనములుజేసి శకాబ్దాద్యానయనాదులలో నగువానిని తెచ్చుకొనవలసినదని భావము మరియూ నీగ్రంథోక్తాహర్గణానయన క్రమమునందలి క్షయదినములలో ప్రతి 703 దినములకును నొక్కొక్కటి చొప్పున నధికముగా చేర్చుకొనవలయును



వా॥ రవేర్మహాసీసాండసారః,, సోమేహంస ధనాన్నార్తాతండః,, కుజే ధనార్తే మాణవకః,, కేంద్రసౌమ్యే మతసంధిరతజః,, గురో ర్గురు జరోద్గురుః, కేంద్ర శుక్రే పుత్రార్తః స్త్రీకంసల్యా,, మాందే సహజక్రోధః,, తుంగసంఘే,, ర్బంధునీలః,, పాతేకాదంటాసావుపో,,

శ్లో॥ ఏతదక్షర వాక్యాద్దా హిత్వాసూచక ఖేచరాః ।
కాద్యాది వర్ణః క్రమయో శ్శేషం చక్రధ్రువాస్స్మృతాః ॥
చక్రధ్రువేణ ద్యుగణై ర్హత్వా మాప్తార్బుదాత్పరం ।
చక్రాది ఫల సంపాద్యం యద్వానేకాద్య హర్గణో ।
స్థానస్థిత సజాతీయ్య గ్రహమధ్యగతేః పదం ।
యుక్కాఁదే యంధ్రువై ర్లంకాస్యాత్స్వభాత గ్రహాస్స్మృతాః ॥

తాత్పర్యము.

రవికి-2737785,, చంద్రునకు - 36600978 కుజనకు 1455609 బుధకేంద్రమునకు - 8629765,, గురునకు 230823,, శుక్ర కేంద్రమునకు - 1712621,, శనికి - 92887,, తుంగకు -309397,, పాతకు - 147181,, గుణక సంఖ్యలగును.

పూర్వసాధితాహర్గణమును నీమీద జూపియుండు వారివారి గుణకములచే వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను వరుసగా 1000 000 000-చే భాగించి తెచ్చిన భగణాది ఫలములో భగణములను వదలి (విడిచి) వరుసగా రాశ్యాది గ్రహములను వ్రాసికొనినగానీ.

లేక పదక సంగ్రహమందలి గ్రహదినమధ్యగతియుత పదకములలో అహర్గణమందలి ఏకాది స్థానస్థిత సంజ్ఞాంకములకు సజాతీయ్యములగు పదక ఫలములను వరుస క్రమముగనెత్తి వ్రాసుకొని వానిని మొత్తముజేసినగానీ అహర్గణానీత మధ్యగ్రహములగును. (తా- సశేషం)

ఉదా, అహర్గణము 133 దీనిని రవి గుణకము 2737785-చే గుణింపగా వచ్చిన 364125405-ను 1000 000 000-చేతవిభజింపగానైన భగణాది 0-4-11-5-7 ఈ మొదలగు గణితోదాహరణములను వెనుక గణితాధ్యాయమునందలి 10-వ పాఠమునుచూచి తెలియనగును.

ఈ విధిచే మధ్య గ్రహములను సాధించుట కంటెను రెండవ విధమగు పదక ఫలములను చేర్చుట లలితముగ నుండుటచే నీ క్రిందుదహరించు విధముగనే మధ్యగ్రహసాధనము చేయనగును.

అహర్గణము 133 ఇందులో ఏకము-3,, దశకము - 3,, శతకము 1, గనుక రవ్యాది గ్రహదినమధ్య గతియుత పదకములలో నాయా గ్రహములకు చూపియుండు ఏ 3-ది,. ద3 ది,, శ 1 ది,, ఈ మూడు పదక ఫలములనూ వట్టు చేర్చి అందలి పరల నర్థోత్తరముగ వదలి వేయగా అహర్గణానీత మధ్య గ్రహము లగునని తెలియవలసినది.

| (1) రవిసాధనము రవిదినమధ్యగతి యుతపదకము లనుచూడుము. | (2) చంద్రసాధనము చంద్రదినమధ్య గతియుతపదక ములనుచూడుము | (3) కుజసాధనము కుజదినమధ్యగతి యుతపదకములను చూడుము. |
|---|---|---|
| ఏ 3 ది 0-2-57 24-31,, | 3 ఏ 1-9-31-44-36,, | 3 ఏ 0-1-34-19-25 |
| ద 3 ది 0-29-34-5-5,, | 3 ద 1-5-17-26-3,, | 3 ద 0-15-43-14-6 |
| శ 1 ది 3-8-33-36-58,, | 1 శ 7-27-38-6-46,, | 1 శ 1-22-24-6-59 |
| మొత్తం 4-11-5-6-34 | 10-12-27-17-25 | 2-9-41-40-30 |

ఈ రాశ్యాది మొత్తములలో పరల నర్థోత్తరముగ విడిచి పెట్టగానైన అహర్గణానీతమధ్యరవిః 4-11-5-7 అహర్గణానీత మధ్యచంద్రః 10-12-27-17 అహర్గణానీత మధ్యకుజః 2-9-41-40,, ఈ క్రమముగనే బుధకేంద్రము 1-28-11-35,, గురుః 6-11-3-6,, శుక్రకేంద్రము 2-22-0-1,, శనిః 0-4-26-51,, తుంగః 0-14-48,50,, పాతః 0-7-2-49,, అహర్గణానీత మధ్యగ్రహములగుననిమీ దిక్రమముగనే పరీక్షించి గనుగొనుడు.



శ్లో॥ అర్కే-ర్నాక్షైర్గజైః స్సామై ర్నాక్షైర్బీరైర్వ శైశ్శశీ ।
కుజైః కోపైస్సుజ్ఞజ్ఞారై ర్బుధే చాన్శై క్రిమైర్దశైః ॥
గురోర్మనైర్భరైర్ధూపైస్తన భారైర్గమైః కవేః ।
నాట్యకాళశరా మందే తుంగేరాజ్ఞాస్త్రరోర్భగాః ॥
పాతేరాజ్ఞైర్మనుధనై గ్రహేతూర్వ ధృవాస్మృతాః ।
పూర్వోక్త వర్ణః క్రమయోః స్సర్వం రాశ్యంశ లిప్తికాః ॥

తా॥ రవ్యాది గ్రహ పూర్వధృవక రాశ్యాదులు.

రవికి 10-28-57,, బుధకేంద్రమునకు 6-12-18,, శనికి 10-1-25,,
చంద్రునకు 10-20-54,, గురునకు 5-24-19,, తుంగకు 2-22-34,,
కుజునకు 11-7-28,, శుక్రకేంద్రమునకు 6-24-53,, పాతకు 2-5-9,,

పూర్వసాధితమగు అహర్గణానీత మధ్యగ్రహాదులయందు నీపైదచూపియుండు వారివారి ధృవకములను చేర్చగా లంకా ప్రాతఃకాలమునకు దృఙ్మధ్య గ్రహములగును, నిశ్శేషతా ॥

ఉదా,

అహర్గణానీత మధ్యరవిః 4-11-5-7 దీనిలో నతని పూర్వధృవకమగు 10-28-57,,-ను చేర్చగానైన లంకాప్రాతః కాలిక దృఙ్మధ్యరవిః 3-10-2-7,, అదే విధమున అహర్గణానీత మధ్య చంద్రుడగు 10-12-27-17-లో నతని ధృవకమగు 10-20 54-ను చేర్చగానైన లంకాప్రభాతకాలీన దృఙ్మధ్య చంద్రుడు. 9-3-21-17 ఈ విధముగనే తక్కిన కుజాదులకునూ నాయా అహర్గణానీత మధ్యగ్రహముల యందు వారివారి ధృవకములను చేర్చి వరుసగా వ్రాసికొనగానైన లంకాప్రాతః కాలిక దృఙ్మధ్య గ్రహములు.

రవిః 3-10-2-7,, బుధకేంద్రము 8-5-29-35,, శనిః 10-5-51-51,,
చంద్రః 9-3-21-17,, గురుః 6-5-22-6,, తుంగః 3-7-22-50,.
కుజః 1-17-9-40,, శుక్రకేంద్రము 9-16-53-1,, పాతః 2-12-11-49,,

## అథమందోచ్చాః.

వా॥ నవాచావోర్కః, సోమేతుంగం,, వక్రేర్వనహంసః,, బుధేర్నీలస్త్రీలయః, గురోద్వాహేస్త్రీనాట్యం,, వధూసంఘే శుక్రః,, శనేర్దగ్ధపావకః ఏతదక్షర వాక్యానాం ఖేటసూచక శోధయేత్ । చంద్రవాక్యేచ శేషం స్యాద్గిహేమాంద కలాధృవాః॥ సవర్ణీకృతతా ॥ రవికి 2-17-20,, చంద్రునకు పూర్వసాధిత తుంగము,, కుజునకు 4-10-4,, బుధునకు 7-10-30,. గురునకు 5-21 24,, శుక్రునకు 2-19-54, శనికి 7 26-38,, రాశ్యాది మందోచ్చములగునని తెలియవలసినది,

## అథగ్రహాదిన మధ్యగతయః.

అక్షరవాక్యాని,, రవేర్ధూమజః,, సోమే నఘూసోమాలః, భౌమే పూగచోరః,, సౌమ్యకేంద్రే షోదాపోభారం,, జీవేశః,, శౌక్రేసంగః,, మందేస్త్రీ,, తుంగేస్తోయవాః,, పాతేగోకూటః,, సంజ్ఞాది వర్ణః క్రమయో స్సర్వాంలిప్త విలిప్తికాః ॥

తా॥ రవికి 59-8,, చంద్రునకు 790-35,, కుజునకు 31-26,, బుధకేంద్రమునకు 186-24 గురునకు 5-0 శుక్రకేంద్రమునకు 37-0 శనికి 2-0 తుంగకు 6-41 పాతకు 3-11 కలాది దినమధ్య గతులగును, అనగా నొకయహోరాత్రప్రమాణమగు 60-ఘడియల కాలములో వారివారి మధ్యగతి సంచార కలాప్రమాణమని తెలియవలసినది. (ఏ 1 పదక ఫలములను చూడుము.)

## అయనాంశ సాధనమాహ.

శ్లో॥ మాసరాశేర్ధనై హత్వా స్త్రీభక్తా ద్వికలాస్మృతాః ।
పుత్రపాలైర్నీలయోజ్యే భాగాద్యయన మీరితం ॥

తా॥ అహర్గణమును సాధించునపుడు ఇచ్చియుండిన మాస ప్రతిని (అధికముతో చేరని దానిని) 9-ట పెంచివచ్చిన మొత్తమును 2-చే విభజింపగా



వచ్చు వర్ధోత్తర లబ్ధము విలిప్తలగును. దానిని మానమెత్తి భాగాది 21-31-30 లకు చేర్చగా అయనాంశములగును, ఇదే అయన భాగలు.

ఉదా, మాసప్రతి 3-దీనిని 9-ట గుణింపగా 27-దీనిని 2-ట భాగింపగా వచ్చిన వర్ధోత్తర లబ్ధ విలిప్తలు 14-ను భాగాది ధృవకమగు 21-31-30 లో చేర్చగా నైన అయనాంశములు 21-31-44.

## ముఖ్య షరా.

ఈ గ్రంథోత్పత్తికి పూర్వమనగా కలిగతాబ్దములు 5035 లకంటెను తగ్గియుండునపుడు నీగ్రంథోక్తమగు గ్రహగణితమును జేయవలసిన ఎడల.

మీదిక్రమముగనే కలిగతాబ్దములను తెచ్చి దానిని 12-ట గుణింపగా వచ్చిన మొత్తమునకు చైత్రాది గత మాసములనుచేర్చి దానిని రెండు ప్రతులుంచి యందొక ప్రతిని 71-చే గుణించి 2310-చేత భాగింపగావచ్చు పూర్ణ లబ్ధమగునధి మాసముల నింకొక ప్రతియందు కలుపగా శుద్ధమాస గణమగును. దానిని 30-ట పెంచి వచ్చిన మొత్తములో శుక్లప్రతిపదాదీష్టదిన పర్యంతమగు తిథి సంఖ్యనుచేర్చి అయిన మొత్తమును మరలరెండు ప్రతులుంచి యందొక ప్రతిని 11-చేత పెంచి 703-చేత భాగింపగా వచ్చు క్షయ లబ్ధమునింకొక ప్రతిలో తీసివేయగా నిలిచిన దియే శుక్రవారాదిగ కల్యాద్యహర్గణమగును.

కల్యాద్యహర్గణమును 1839047-లో తీసివేయగా నిలుచునది ఋణాహర్గణమగును.

ఋణాహర్గణమును బట్టి నీమీదిక్రమములుగనే అహర్గణానీత మధ్యగ్రహములను సాధించి యుంచుకొనవలసినది.

---

నో॥ కల్యాద్యహర్గణమును 7-ట భాగింపగా 1 మొదలు క్రమముగా నిలుచు శేషములచే వరుసగ శుక్రాది వారములను చింతింప వలసినది. అందిష్ట వారము సరిరాని తరుణములయందంతయూ నీవెనుకటి క్రమముగనే సముచితముగ 1, 2, ని ధనఋణములుచేసికొని వారమును స్థిరీకరించుకొన వలసినది.

ఈ అహర్గణానీత మధ్య గ్రహములను వారివారి పూర్వ ధ్రువకములలో చేర్చుటకు మారుగ తీసివేయగా నిలుచునదియే ఇష్టదినమునాటి లంకా ప్రాతః కాలిక దృఙ్మధ్య గ్రహాదులగును.

అయనాంశ భాగలను తెలియవలసినపుడు కలిగతాబ్దములలో 3600-ను తీసివేయగా నిలిచిన దానిని 3-చే పెంచి 200-ట భాగించి భాగాది ఫలమును తీసికొని దానిలో నెల 1-కి $4\frac{1}{2}$ విలిప్తల వంతున చైత్రాదిదీష్ట మాసమువఱకు గత మాసముల కెన్ని విలిప్తలగునో దానిని చేర్చగా అయనాంశ భాగాదియగును (ఈ విధినెల్లపుడును నుపయోగించుకొనవచ్చును.)

ఇతి శ్రీ సిద్ధాంత రహస్యే గ్రహతంత్రే

# మధ్యాధ్యాయోనామ ద్వితీయః.

## అథ స్ఫుటాధ్యాయ ప్రారంభః ॥

శ్లో॥ (మధ్యసోమే జనకలా ద్రేఖాంతర ఫలంరుణం ।
సూర్యబాహుఫలం సోమే సారాప్తాంశార్కవత్కృతం ॥ )

స్వోచ్చం గ్రహోనం కేంద్రంస్యాత్తత్పదే విషమే గతః । యుగ్మేగమే శ్యాంచ బాహు ర్నిలఘ్నద్రాశి భాగయుక్ । రవిచంద్రౌస్తథామంద పదకం స్యాచ్చ సర్వదా ॥ భుజలిప్తాంతరాన్యోన్య తాడితాంతర తేః ఫలం । విలిప్తి కాసుఫలయుక్పదే సోమార్క సర్వదా ॥ తత్ఫలం మేషజూకాద్యౌ గ్రహేధ నరుణం క్రమాత్ । సోమార్కయో ర్యేక మేవ సంస్కార త్వాద్భవేస్ఫుటౌ ॥

### సవర్ణీకృత తాత్పర్యము.

### సూర్య స్ఫుటక్రమము.

రవిమందోచ్చమగు రాశ్యాది 2-17-20.లలో లంకాదృఙ్మధ్య రవిని తీసివేయగా నిలిచినది రవికి మంద కేంద్రమగును. ఆకేంద్రము మూడు రాసులకు తగ్గియుండునపుడదియే భుజయగును. 3 రాసులకు మించి నారురాసులకు తగ్గియుండునపుడా కేంద్రమును నారు రాసులలో తీసివేయగా నిలిచినది భుజయగును.



6 రాసులకుమించి 9 రాసులకు తగ్గియుండు కేంద్రములో నారు రాసులను తీసివేయగా మిగిలినది భుజయగును. మరియూ నా కేంద్రము 9 రాసులకుమించియుండునపుడు ఆకేంద్రమును 12 రాసులలో తీసివేయగా నిలిచినది భుజయగును.

ముందుచూపబోవు చంద్రమంద కేంద్రము నుండియునూ నీక్రమముగనే భుజాసాధనమును చేయవలసినది.

ఇట్లు రవికి మంద భుజను తెచ్చి నాభుజా రాశ్యాదిని భాగాదిగ మార్చగా నాభాగస్థాన స్థితమగు సంఖ్యయే (భుజాభాగలే) రవిమంద పదకములయందలి పదక, సంఖ్యయునూ లిప్తలే శేషకలాదియూనగును.

ఆ పదకమునకు సరిగా వ్రాసియుండు పదక ఫలమునూ అంతర లిప్తలనూ కర్కాద్యాది మకరాది గతులలో రవిమందకేంద్రమేగతి గలిగియుండునో నా కేంద్రగతియునూ వరుసగా వ్రాసికొని ఆ పదాంతర లిప్తలచే శేషకలాదియందలి నర్ధోత్తర లిప్తలను సామాన్య విధిచే గుణింపగా వచ్చు లబ్ధలిప్తలే విలిప్తల రూపమగు నంతర ఫలమగును. (దాని నరువదింట భాగింపగా కలాదియగును.)

పదక ఫలకలాదిలో నంతర ఫలమును చేర్చగా రవికి మంద ఫలమగును దానిని రవిమంద కేంద్రము మేషాదిలో నుండునపుడు ధనభుజాఫలమనియూ తులాదిలోనుండునపుడు రుణభుజా ఫలమనియు తెలసి మానమెత్తి ధనభుజా ఫలముగనుండునపుడు మధ్యరవిలో చేర్చగనూ రుణభుజా ఫలముగ నుండునపుడు తీసివేయగనూ మంద రవియగును.

---

నో॥ 9 రాసులకు తగ్గి 3 రాసులకు మించియుండు కేంద్రము కర్కాద్యాదియనియూ ; 9 రాసులకు మించి 3 రాసులకు తగ్గియుండు కేంద్రము మకరాదియనియూ అదేవిధమున నారురాసులకు తగ్గియుండు కేంద్రము మేషాది యనియునూ నారురాసులకు మించియుండు కేంద్రము తులాది యనియూ సారశుచేసి యుంచుకొని యుండవలసినది. అందెపుడైననూ మేషాది కేంద్రము ధనసంజ్ఞగలదిగనూ తులాది కేంద్రము రుణసంజ్ఞగలదిగనూ తెలియవలసినది.

ఉదా, రవిమందోచ్చము 2-17-20 దీనిలో మధ్యమరవియగు 8-10-2-7-ను తీసివేయగానైన రవి మందకేంద్రము 11-7-17-53,, ఇది 9 రాసులకుమించి యుండుటచే మకరాదిగతిగల కేంద్రమనియూ నారు రాసులను మించియుండుటచే తులాది కేంద్రమనియూ తెలిసెను.

మరియూ నీ కేంద్రము తొమ్మిది రాసులను మించియుండుటచే 12 రాసులలో తీసివేయగానైన రవిమందభుజా 0-22-42-7,, దీనిభాగాది 22-42-7 ఇందలి భాగలే రవిమంద పదకములయందలి పదక సంఖ్యయగుటచే రవిమంద పదకము 22-ది చూడగా 49-39 అంతరం 2 మకరాది గతి 57-3 అనియున్నది గనుక ఇందలి నర్ధోత్తర శేషకలలగు 42-ను పదాంతరమగు 2-చే గుణింపగా వచ్చిన అంతర ఫలవిలిప్తలు 84 దీని కలాది 1-24 దీనిని మీది పదక ఫలకలాది యగు 49-39 లలో చేర్చగానైన రవిమంద ఫల కలాది 51-3 ఇది రవిమంద కేంద్రము తులాదినిపొంది యుండుటచే రుణభుజా ఫలమనబడును గనుక దీనిని మధ్యరవియగు 8-10-2-7-లో తీసివేయగానైన మంద సూర్యుడు 8-9-11-4.

అథ చరఫల సాధన సంస్కారా ద్యానయనక్రమః.

శ్లో॥ రాశిత్రయేషు బాహుస్యా త్ఖండత్రియ విధేఃక్రమః।
అనుపాత విధేస్సాధ్యం చరఖండార్క సాయనా ॥
తత్ఫలం చరలిప్తాస్స్యు ద్నిశాచర మహర్దళే।
క్రమాద్ధన రుణంకృత్వా సాధయేత్స్వ మహర్దళం ॥
దినార్ధస్యా ద్భవేర్మాన మహః ఖనన తాడితాః।
దినమూనేనతం రాత్రి మానస్సంజాయతేసదా ॥

స. తా॥ మందఫలసంస్కారము చేసియుండు రవియం దయన భాగలను కలుపగా సాయన రవియగును. దానిని రవిమంద కేంద్రముగనెరిగి మీది క్రమముగనే భుజాసాధనమును చేసియుంచుకొన వలసినది.



తరువాత నా భుజారాశి స్థానమున శూన్యమైయుండునపుడు ప్రథమచర ఖండము గుణకమనియూ, 1 యుండునపుడు ద్వితీయ్య చరఖండము గుణకమనియూ రెండుండునపుడు తృతీయ్య చరఖండము గుణకమనియూ తెలసి నట్టి గుణకముచే మీదిభుజయందలి రాసులను వదలివేసి భాగాదిని లిప్తలుచేయగానైన నర్ధోత్తర లిప్తలను గుణించి వచ్చిన మొత్తమును రాశికలా సంఖ్యయగు 1800-ట భాగింపగా వచ్చు నర్ధోత్తర లబ్ధమును ద్వితీయ్య చరఖండమను గుణకముగానుంచుకొని యుండు నపుడు ప్రథమ చరఖండములో చేర్చగనూ తృతీయ్య చరఖండమును గుణకముగా నుంచుకొని యుండినపుడు ప్రథమ ద్వితీయ్య చరఖండముల మొత్తమునకు చేర్చగనూ చరార్ధ వినాడికలగును.

గమనింపు:—ప్రథమ చరఖండమునే గుణకముగ నుంచుకొని యుండు నపుడందేమియూ చేర్చనక్కఱలేదు అదియే చరార్ధవినాడి కలగును. మరియూ భుజారాసులు 3 సరిగా వచ్చియుండునపుడు ప్రథమ ద్వితీయ్య తృతీయ్య చరఖండముల మొత్తమే (యోగమే) చరార్ధ వినాడి కలగునని తెలియవలసినది.

చరార్ధ వినాడికలను సాయన రవి మేషాది షట్కమునుపొందియుండు నపుడు 15-0, లలో ధనమునూ తులాది షట్కమునుపొందియుండునపుడు 15-0 లలో రుణమునూ చేసికొనగా స్వదేశ దినార్ధమగును. దానిని ద్విఘ్నింపగా అహర్మానమునూ, అహర్మానమును 60-0 లలో తీసివేయగా నిలిచినది రాత్రి మానమునూ దానినర్ధింపగా రాత్ర్యర్ధమునూ క్రమముగవచ్చును.

ఉదా, మంద సూర్యుడు 8-9-11-4 దీనిలో నయనాంశలు 21-31-44 లను చేర్చగానైన సాయనరవిః 4-0-42-48 దీనిని మందకేంద్రముగనెరిగి భుజాసాధన మును జేయుట కీకేంద్రము మూడు రాసులకుమించి నారురాసులకు తగ్గియుండుటచే దీనిని నారు రాసులలో తీసివేయగానైన భుజా రాశ్యాది. 1-29-17-12 ఇందలి రాశిస్థానమున నొకటియుండుటచే ( స్వదేశ చరఖండములు 27,, 22,, 9,, ) ద్వితీయ్య చరఖండమగు 22 గుణకమగునని తెలసి నీ 22-చే మీది భుజాంశములగు

---

నో॥ స్వదేశ చరఖండములు మొదలగు వానిని సాధించు క్రమములు ముందు చూపబడును.

29-17-12-ను ఆర్ధోత్తర క్షిప్తలు చేయగాసైన 1757-ను గుణింపగా వచ్చిన 38654-ను 1800-టు విభజింపగా వచ్చిన వర్ధోత్తర లబ్ధము 21 దీనిని ద్వితీయ్యా చరఖండము గుణకము గావచ్చి యుండుటచే ప్రథమ చరఖండమగు 27—లో చేర్చగాసైన చరార్ధ వినాడికలు 48 దీనిని సాయనార్కుడు మేషాదిలో నుండుటచే 15-0 ఘటికాదిలో చేర్చగాసైన దినార్ధము 15-48, దీనిని ద్విగుణింపగాసైన అహస్సు 31-36,, దీని నరువదిలో తీసివేయగాసైన రాత్రిః 28-24 దీని నర్ధింపగాసైన రాత్ర్యర్ధము 14-12.

## సంస్కారక్రమః.

శ్లో॥ చరలిప్తైర్గుణై స్సూర్యే ర్వాచకై స్సోమ రేఖభిః ।
సూర్యేదశ సహస్రేణ సోమేశత విభాజితం ।
విలోమన్యాయమేషాది ర్గ్రిహేరుణధనం క్రమాత్ ।
ప్రభాత కాలికస్సర్వేః గ్రహాస్తాత్కాలికోభవేత్ ।
ఇతరేషాం స్వస్వదేశైః పూర్వమేవోక్తవస్తథా ॥

## సవర్ణీకృతతా.

పూర్వసాధితమగు చరార్ధ వినాడికలను రవికి 164 చేతనూ చంద్రునకు 22 చేతనూ వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను రవికి పదివేలు చేతనూ చంద్రునకు నూరుచేతనూ భాగించి తెచ్చిన కలాది ఫలములను వారివారిలో చరార్ధ ఫలము ధనముగానుండునపుడు (దినార్ధము 15-0కు మించి యుండునపుడు) రుణమునూ రుణముగానుండునపుడు (దినార్ధము 15-కు తగ్గియుండునపుడు) ధనమునూ చేసికొనగా స్వదేశ ప్రాతః కాలికమునకు దృఙ్మధ్య గ్రహములగును.

గమనింపు:—రవి చంద్రులకు దప్ప తక్కినవారలకీ చరార్ధ ఫలసంస్కారము జెప్పబడకుండుటచే వారలు వెనుకటివలెనే స్వదేశియ్యులగుదురని తెలియవలసినది. మరియూ నీసంస్కారము మందరవియందు సంస్కరించిననూ లేక నీసంస్కారముచే సంస్కరింపబడిన మధ్య రవిని బట్టి మీదిక్రమముగనే మరల మంద ఫలమును



తెచ్చినతని యందే సంస్కరించిననూ స్ఫుట రవియగును. నతనికి కర్కాద్యది మకరాది గతులే స్ఫుట గతులగునని తెలియవలసినది.

ఉదా, మీద వచ్చియుండిన ధనచరార్ధఫల వినాడికలు 48-దీనిని రవి గుణకమగు 164-టు పెంచి 10000-టు భాగించి తెచ్చిన కలాది ఫలము 0-47 అదే విధమున చంద్రునికి నతని గుణహారకములచే తెచ్చిన లిప్తాది ఫలము 10-34 ఈ ఫలములను చరార్ధ ఫలము ధనముగా నుండుటచే నాయాగ్రహములయందు తీసివేయవలసినది గనుక మీద చూపియుండు మధ్య రవియగు 3-10-2-7-లో రవి ఫలమగు 0-47-ను తీసివేయగాసైన స్వదేశియ్య ప్రాతః కాలిక దృఙ్మధ్య రవిః 3-10-1-20 అదే విధమున మంద రవియగు 3-9-11-4-లో 0-47-ను తీసివేయగాసైన స్వదేశియ్య ప్రాతః కాలిత దృక్స్ఫుట సూర్యుడు 3-9-10-17 స్ఫుట గతి 57-3.

ఈవిధముగనే మధ్య చంద్రునియందునూ నతని చరార్ధ ఫలమును (10-34-ను) సంస్కరించి తక్కిన గ్రహాదులను మీదిక్రమముగనే నీ క్రిందుద హరించు విధమున వరుసగా వ్రాసుకొనవలయును.

## స్వదేశీయ్య ప్రాతః కాలిక దృఙ్మధ్యగ్రహాః.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవిః | 3-10-1-20 | బుధ-కేం | 8-5-29-35 | శనిః | 10-5-51-51 |
| చంద్రః | 9-3-10-43 | గురుః | 6-5-22-6 | తుంగః | 3-7-22-50 |
| కుజః | 1-17-9-40 | శు-కేం | 9-16-53-1 | పాతః | 2-12-11-19 |

ఇట్లు వరుసగా వ్రాసియుంచు కొనవలసినది.

గమనింపు:—ఈ మధ్య రవిని బట్టి మంద ఫలమును తెచ్చి నతనియందే సంస్కరించి పైచూపియుండు స్ఫుట రవిని పోల్చిచూడుము. 3-9-10-17 వచ్చును.

## చంద్రస్ఫుట క్రమము.

సూర్య స్ఫుట కర్మయందు వచ్చియుండు రవిమంద భుజాఫల కలాదిని 27-టు భాగింపగావచ్చు కలాది ఫలమును చరార్ధఫల సంస్కృత మధ్య చంద్రుని యందు ధనభుజాఫలముగ నుండునపుడు చేర్చగనూ రుణభుజాఫలముగనుండునపుడు

తీసివేయగనూ అర్క-బాహుఫల సంస్కృత మధ్య చంద్రుడగును. అందు దేశాంతర ఋణలిప్తాధృవకమగు 8 లిప్తలను తీసివేయగా స్ఫుట మధ్య చంద్రుడగును వానిని నతని మందోచ్చమగు తుంగములో తీసివేయగా నిలిచినది చంద్రమంద కేంద్రమగును.

దానిని బట్టి మీద్క్రమముగనే భుజా పదకాదులను తెచ్చి చంద్రమంద పదకములనుండియు భుజాఫలమును సాధించి రవికి చెప్పినవొడుపుననే స్ఫుట మధ్య చంద్రునియందు సంస్కరింపగా దృక్స్ఫుట చంద్రుడగును. (దేశాంతర ధృవక కలాసాధనాక్రమములను సూర్య సిద్ధాంత సంగ్రహమున ముందు జూపబడును.)

ఉదాహరణము.

రవికి ఋణభుజాఫల కలాది 51.3 దీనిని 27-ట భాగింపగావచ్చిన లిప్తాది ఫలము 1-53 ఇది ఋణ భుజాఫలమునుండియు వచ్చిన దగుటచే దీనిని మధ్య చంద్రుడగు 9-3-10-13-లో తీసివేయగానైన నర్క-బాహుఫల సంస్కృత మధ్య చంద్రుడు 9-3-8-50, దీనిలో రేఖాంతర ధృవలిప్తలగు 8-ని తీసివేయగానైన స్ఫుట మధ్య చంద్రుడు 9-3-0-50 దీనిని నతని మందోచ్చమగు తుంగము 3.7-22-50 లలో తీసివేయగానైన చంద్రమంద కేంద్రము 6-4-22-0 ఈ కేంద్రము కర్క్యాది గతిగల తులాది కేంద్రమని తెలిసెను. దీని భుజా 0-4-22-0 దీనిని భాగాదిగ మార్చగా 4-22-0 ఇందలి భాగలు 4 గనుక చంద్రమంద పదక ములయందలి పదక సంఖ్య 4-డి 21-18 అంతరం 5 కర్క్యాదిగతి 860-3.

ఇందలి అంతర లిప్తలగు 5-చే మీది శేషకలలగు 22-ను గుణింపగావచ్చిన సంతరఫల విలిప్తలు 110 దీని కలాది 1.50, దీనిని పదక లిప్తలలో చేర్చగానైన ఋణ భుజాఫల కలాది 23-8 దీనిని స్ఫుట మధ్య చంద్రుడగు 9-3-0-50 లలో తీసివేయగానైన దృక్స్ఫుట చంద్రః 9-2-37-42 స్ఫుట గతిః 860-3,,

గమనింపు :—ఇట్లు రవి చంద్రులిరువురునూ మాంద్రైక ఫలసంస్కారము నుండియే స్వదేశ ప్రాతః కాలములకు దృక్ స్ఫుటములగుదురు. తక్కిన కుజాది పంచగ్రహములకు నీవెంబడి చెప్ప బోవువిధమున శీఘ్ర మాంద పునశ్శీఘ్ర ములన బడు 3 సంస్కారక్రమములచే శుద్ధ స్ఫుటములయ్యెదరు.



శ్లో॥ మధ్యఖేటే వియుక్తుంగో స్తత్తత్కేంద్రమి తీరితః ।
కుజాదీనాం మాంద శీఘ్ర క్రియేషూనాం భుజాస్తథా ॥
బుధ శుక్రా శీఘ్ర కేంద్రస్తత్రమానయనంవినా ।
తత్తద్బాహుఃక లీకృత్య శతభిః ర్భాగమాహరేత్ ॥
లబ్ధం స్యాత్పదకం సంఖ్య స్తత్పిండాంతర పిండయోః ।
శేషలిప్తాను పాతేన సాధయిత్వా ఫలం క్రమాత్ ॥
తత్ఫలం స్వర్ణ సంస్కారం ధనర్ణాంతరయోః క్రమాత్ ।
తత్తత్ఫలం మేష జూకౌ క్రమాద్ధన ఋణం భవేత్ ॥
అథ సంస్కార క్రమః ॥ ప్రాజ్మధ్యమే చల ఫలస్యదళం
విపధ్యాత్తస్మాచ్చమాంద మఖిలం విదధీత మధ్యే ।
ద్రాక్కేంద్ర కేపిచవిలోమ మతచ్చ శైఘ్ర్యం సర్వంచ తత్ర
విదధీత భవేత్ స్ఫుటో౽సౌ ॥

సవర్ణీకృత తాత్పర్యమునందలి ముఖ్య గమనింపు.

చరార్ధఫల సంస్కారమును సంస్కరించియుండు మధ్య సూర్యుడే కుజ గురు శనులకు శీఘ్రోచ్చముగనుండును గనుక మధ్యమరవిలోనీ మీద చెప్పిన నాయా మధ్య గ్రహములను తీసివేయగా మిగిలినది నాయాగ్రహములకు ప్రథమ శీఘ్రకేంద్రములగును.

బుధ శుక్రులకు నీవెనుక గణితా గతముగ సాధించి యుండునదియే వారికి ప్రథమ శీఘ్రకేంద్రములగుననియూ అందు బుధ శుక్రులకు మీది మధ్య సూర్యుడే మధ్యగ్రహముగ నుండుననియూ తెలియవలసినది,

మఱియూ మధ్య మరవిని బుధ శీఘ్రకేంద్రమునకు చేర్చగా బుధ శీఘ్రోచ్చమునూ శుక్ర శీఘ్రకేంద్రమునకు చేర్చగా శుక్ర శీఘ్రోచ్చమునూ వచ్చుననియూ మధ్య బుధుడు 1, మధ్య శుక్రుడు 2, కుజ శీఘ్రోచ్చము 3, గురు శీఘ్రోచ్చము 4, శని శీఘ్రోచ్చము 5, ఈ 5 రూపములున్నూ చరార్ధ ఫల సంస్కృతమగు మధ్య మార్కుడే పొందియుండుననియూ పాఠముచేసియుంచుకొని యుండవలసినది

## ఫలత్రయ సంస్కారములయందలి ప్రథమ శీఘ్రసంస్కారము.

కుజాది గ్రహములయొక్క ప్రథమ శీఘ్రకేంద్ర రాశ్యాదిని కలలుచేసి 100-ట భాగింపగా వచ్చు లబ్ధము ఆయా గ్రహ శీఘ్రపదకములయందలి పదక సంఖ్యయగును తచ్ఛేషమును పదాంతరముచే గుణించి 100-చే భాగింపగా వచ్చు నర్ధోత్త రాంతర ఫల కలా లబ్ధమును పదాంతరము ధనాంతరముగా నుండునపుడు పదక లిప్తలలో చేర్చగనూ ఋణాంతరముగ నుండునపుడు తీసివేయగనూ కుజాదులకు ప్రథమ శీఘ్రఫల లిప్తలగును. దాని నర్ధించి మానమెత్తిన దానిని నాయా మధ్య గ్రహములయందు మేషాది తులాది కేంద్రములచే క్రమముగ ధన ఋణములెరిగి సంస్కరింపగా ప్రథమ శీఘ్రగ్రహములగును.

## ద్వితీయ్య మంద సంస్కారము.

ప్రథమ శీఘ్రగ్రహములను మధ్యాధ్యాయమున చూపియుండు వారివారి మందోచ్చములలో తీసివేయగా నిలిచినది నాయా గ్రహములకు మందకేంద్రములగును. దానిని లిప్తలుచేసి 100-ట భాగింపగా వచ్చు లబ్ధములా యాగ్రహమంద పదకములయందలి పదక సంఖ్యమగును. దాని శేషమును పదాంతరముచే పెంచి 100-చే భాగింపగా వచ్చు నర్ధోత్తరాంతర ఫలకలా లబ్ధమును ధనాంతర ఋణాంతరములనుబట్టి, మీదిక్రమముగనే పదక లిప్తలయందు సంస్కరింపగానది కుజాదులకు మంద ఫలమగును. దానిని మానమెత్తి నాయాగ్రహ మందకేంద్రముల యొక్క మేషాది తులాదులను గమనించి ఆయా మధ్య గ్రహములయందే (ప్రథమ సంస్కారముచేయని గ్రహములయందే) సంస్కరింపగా మందస్ఫుట గ్రహములగును,



ఆయాగ్రహ ప్రథమ శీఘ్రకేంద్రములయందు వారివారి ద్వితీయ్య సంస్కారమునందలి మంద ఫలమును విపరీతమున సంస్కరింపగా వచ్చినది (అనగా వారివారి మంద కేంద్రములు మేషాదిలో నుండునపుడు ఋణమునూ తులాదిలో నుండునపుడు ధనమునూ చేసికొనవలయునని భావము.) వారివారికి నంత్య శీఘ్రకేంద్రములగును.

దానినిబట్టి మీదిక్రమముగనే మరల శీఘ్రఫలమును దెచ్చి దాని నంతయూ మానమెత్తి మంద స్ఫుట గ్రహములయందు వెనుకటివలెనే క్రమముగ సంస్కరింపగా దృక్ స్ఫుట గ్రహములగును.

గమనింపు,, నీ మీద జూపియుండు నంత్య శీఘ్రకేంద్రములనుండియునూ ముందు జూపబోవు నంత్య శీఘ్రకేంద్రగతులనుండియునూ ముందు వక్రాది కాలములను కనిపెట్టుటచే వాటిని గుర్తించి యుండవలసినది మఱియూ నీ కుజాది పంచగ్రహ స్ఫుట గణితక్రమములయందెప్పుడైననూ అర్ధోత్తరమతమున విలిప్తలను వదలివేసి లిప్తాంతమువఱకే గణించుటయందు కేవల గణిత సౌకర్యమగుట చేతనూ అందమిత స్ఖాలిత్యము జెందకుండుట చేతనూ తాత్పర్యోదాహృతములను ఆతీరున వ్రాయబడియె.

గాకనూ నిక్కాలపు పంచాంగములను చూడగ నొకటికొకటి చేరనీయక తారాగ్రహములయందలి స్ఫుటములు భాగాదివైషమ్యములచే నొప్పుచుండుటవల ననే నక్షత్రచారాదులు సైత ముదినాదులతో భేదపడియుండుననుట గురించి నిందు వ్రాసి తెలుపనక్కఱలేదు.

గనుక గణిత మత భేదములచే భాగాదివైషమ్యములను పొందుచుండ పనికి మాలియుండు విలిప్తలకేల తమ గణిత పాండిత్యమును సెలవుచేయుదురో నాకు తెలియదు.

## ఉదాహరణము కుజస్ఫుటము.

(1) కుజ శీఘ్రోచ్చమగు నర్ధోత్తర లిప్తాంత మధ్య రవిః 3-10-1 దీనిలో అర్ధోత్తర లిప్తాంత మధ్య కుజుడగు 1-17-10-ని తీసివేయగానైన కుజ ప్రథమ శీఘ్ర

కేంద్రము 1-22-51 దీని లిప్తలు 3171 దీనిని 100-చే భాగింపగావచ్చిన కుజ శీఘ్ర పదకములయందలి పదక సంఖ్య 31 శేషలిప్తలు 71.

కుజ శీఘ్ర పదకము 31-ది 1194 ధనాంతరము 36 గనుక ఈ అంతరమగు 36 చే మీది శేషకలలగు 71-ని గుణింపగానైన 2556-ను 100-చే భాగింపగా వచ్చిన సర్ధోత్తర లబ్ధము 26 ఇది ధనాంతరమునుండి వచ్చిన నంతరఫల లిప్తలగుటచే దీనిని పదక లిప్తలగు 1194 లలో చేర్చగానైన ప్రథమ శీఘ్రఫల లిప్తలు 1220 ఇది ప్రథమ శీఘ్రసంస్కారమగుటచే దీని నర్ధింపగానైన 610 లిప్తలను మానమెత్తగానైన భాగాది 10-10 దీనిని కుజ ప్రథమ శీఘ్రకేంద్రము మేషాదిగనుండుటచే మధ్య కుజుడగు 1-17-10 లో చేర్చగానైన ప్రథమ శీఘ్ర కుజుడు 1-27-20.

(2) మధ్యాధ్యాయోక్త కుజమందోచ్చమగు 4-10-4-లో ప్రథమ శీఘ్రకుజుడు 1-27-20-ని తీసివేయగానైన కుజ మందకేంద్రము 2-12-44 దీనిని లిప్తలుచేయగా 4364 దీనిని 100-చే భాగింపగావచ్చిన కుజ మంద పదక సంఖ్య 43 శేషకలలు 64.

కుజ మంద పదకము 43-ది 635 ధనాంతరము 7 గనుక నీయంతర లిప్తలచే శేషకలలగు 64-ను గుణించి 100-చే భాగింపగా వచ్చిన సర్ధోత్తరాంతరఫల లిప్తలు 4-ను పదక లిప్తలలో చేర్చగానైన మందఫల కొరాని 639 దీనిని మానమెత్తగానైన ధనభుజాఫల భాగాది 10-39 దీనిని మధ్య కుజుడుగు 1-17-10-లో చేర్చగానైన మంద స్ఫుట కుజుడు 1-27-49.

(3) కుజ ప్రథమ శీఘ్రకేంద్రమగు 1-22-51-లో ధనమందఫల భాగాదియగు 10-39-ని ఋణముచేయగానైన అంత్య శీఘ్రకేంద్రము 1-12-12 దీని లిప్తలు 2532 గనుక కుజ శీఘ్రపదకము 25-ది శేషకలలు 32 వచ్చును.

కుజ శీఘ్రపదకము 25-ది 971 ధ 37 ఈ అంతరముచే శేషమును పెంచి 100-చే భాగింపగానైన అర్ధోత్తరాంతరఫలలిప్తలు 12-ను పదక కలలలో చేర్చి మానమెత్తగానైన భాగాది 16-23 దీనిని అంత్య శీఘ్రకేంద్రము మేషాదియగుటచే మంద స్ఫుట కుజుడగు 1-27-49-లో చేర్చగానైన ప్రాతఃకాలిక దృక్ స్ఫుట కుజుడు 2-14-12.



(1) పూర్వసాధితమగు బుధకేంద్రము 8-5-30 ఇదియే బుధునికి ప్రథమ శీఘ్ర కేంద్రమగును గనుక దీనిని లిప్తలుచేసి 100-చే భాగింపగా వచ్చిన బుధ శీఘ్ర పదక సంఖ్య 147 శేషలిప్తలు 30. బుధ శీఘ్రపదకము 147-ది 1289 ధ 3 గనుక ఇందలి శేషాంతరములను గుణించి మీదిక్రమముగనే తెచ్చిన అంతరఫల లిప్త 1-ని పదక లిప్తలలోచేర్చి అయిన మొత్తమునర్ధీకరించి మానమెత్తగానైన భాగది 10-45 దీనిని మధ్య బుధుడగు మధ్యమరవి 3-10-1-లో సంస్కరింపగానైన ప్రథమ శీఘ్ర బుధుడు 2-29-16.

(2) ప్రథమ శీఘ్రబుధుడగు 2-29-16-ను నతని మందోచ్చమగు 7-10-30-లో తీసివేయగానైన బుధ మంద కేంద్రము 4-11-14 దీనిని బట్టి మీదిక్రమముగనే పదక సాధనమును చేయగా బుధమంద పదకము 78-ది శేషకలలు 74 బుధమంద పదకము 78-ది 214-ఋ 5 గనుక దీనికేర్పడు నంతరఫల కలలగు 4-ను ఋణాంతరమగుటచే పదక లిప్తలలో తీసివేయగానైన మందఫల లిప్తలు 210 దీని భాగాది 3-30 దీనిని మధ్య బుధునియందే చేర్చగానైన మంద స్ఫుట బుధుడు (8-13-31).

(3) బుధ ప్రథమ శీఘ్రకేంద్రమగు 8-5-30-లో ధనమందఫల భాగాదియగు 3-30-ను ఋణము చేయగానైన అంత్య శీఘ్రకేంద్రము 8-2-0 దీని లిప్తలు 14520 గనుక బుధ శీ. ప. సంఖ్య 145 శే. 20 వచ్చెను బు. శీ. ప. 145-ది 1282 ధ 6 గనుక ఈ అంతరముచే శేషలిప్తలనుగుణించి 100-చే భాగింపగా వచ్చిన సర్ధోత్తర లిప్తలను పదక లిప్తలలోచేర్చి భాగాది చేయగానైన నంత్య శీఘ్రఫల భాగాది 21-23 దీనిని మంద స్ఫుట బుధునిలో తీసివేయగానైన శుద్ధదృక్ స్ఫుట బుధుడు 2-22-8.

## గురు స్ఫుటము.

(1) గురు శీఘ్రోచ్చము 3_10-1 మధ్య గురుడు 6-5-22 గురు ప్ర. శీ. కేంద్రము 9-4_39 దీని లిప్తలు 16479 గు. శీ, ప. 164-ది 670 రు 5 శే 79 అంతరఫలము 4 ఇది ఋణాంతరఫలమగుటచే పదక లిప్తలగు 670_లో తీసివేయగానైన శీఘ్రఫల లిప్తలు 666 దీనిలో సగము 333 దీని భాగాది 5-33 దీనిని మధ్య గురునిలో తీసి వేయగానైన ప్ర. శీ. గురుః 5_29.49.

(2) ప్రథమ శీఘ్ర గురుః 5-29-49 అతని మందోచ్చ 5-21-24 మందకేం. 11_21_35 దీనిని లిప్తలుచేసి 100_చే భాగించి తెచ్చిన గురు మంద ప. 210-ది 52 రు 9 శేషలిప్తలు 95 దీనిని బట్టి ఋణాంతర ఫలమును తెచ్చి మీది క్రమముగనే పదక లిప్తలలో సంస్కరింపగానైన మందఫల లిప్తలు 43 దీనిని మధ్య గురుని యందేతీసివేయగానైన మంద స్ఫుట గురుడు 6-4_39.

(3) గురు ప్రథమ శీఘ్రకేంద్రము 9-4.39 ఋణ మంద భుజాఫల లిప్తలు 43 అంత్య శీఘ్రకేంద్రము 9-5-22 దీని పదకము 165-ది 665 రు 6 శేషలిప్తలు 22 వచ్చును. గనుక దీని శీఘ్రఫల భాగాదియగు 11-4-ను అంత్య శీఘ్రకేంద్రము తులాదిగ నుండుటచే మంద స్ఫుట గురునియందు తీసివేయగానైన దృక్ స్ఫుట గురుః 5-23_35.

గమనింపు,,—ఈ మీద కనుపరచియుండు కుజాది మూడు గ్రహముల స్ఫుటోదాహరణములను చక్కగపరిశీలించి గణిత క్రమములను తెలసిన తరువాత నీక్రిందుదహరించు శుక్ర శనుల స్ఫుటో దాహరణ గణితక్రమములను చూడగా గణింప తగిన పద్ధతి చక్కబడును.



(1)

శుక్రకేం 9-16-53

270

286 × 60

17160

53

172.13

శు. శీ. ప 172-ది

శేషలిప్తలు 13

1790 రు 88 × 13

5 4 . 94

1785 ÷ 2 = 893

భాగాది 14-53

మధ్య శుక్రుడగు

మధ్య రవిః 3-10_1

14-53

ప్ర. శీ. శుక్రః 2-25-8

(2) శు, మందోచ్చం

2-19-54

ప్ర. శు 2-25 8

మం. కేం 11-24-46

330

354 × 60

21240

46

212.86

శు, మం, ప, 212-ది

13 రు 3 శేష కలలు

86 గనుక

86 × 3

2.58

13

3

10 ఋణఫలము

3-10-1

10

3-9_51

మంద స్ఫుట శుక్రః

(3)

ప్ర. శీ. కేం 9_16_53

రు మం, ఫ 10

అం, శీ కేం, 9-17_3

270

287 × 60

17220

3

172.23

శు, శీ, ప 172_ది శే 23

1790 రు 88 × 23

9

1781 దీని 114

76

8.74

భాగాది 29.41

మం, స్ఫు, శు 3-9-51

29-41

దృ, స్ఫు, శుక్రః 2-10_10

## శని స్ఫుటము.

(1) శ, శీ 3-10-1
మ, శ 10-5-52
ప్ర, శీ, కేం 5-4-9
154 × 60 + 9
92-49 × 10
187 రు 10    4.90
5
182 ÷ 2 = 91-శి 1-31
10-5-52
1-31
ప్ర, శనిః 10-7-23

(2) శ, మం 7-26-38
10-7-23
9-19-15
270
289 × 60 + 15
173 . 55 × 5.
2.75
427 రు 5
3
424 భాగాది 7-4
మ, శ 10-5-52
7-4
మం, స్ఫు. శ 9-28-48
అంత్య శీఘ్రఫలం 2-15
దృక్ స్ఫుట శనిః 10-1-3

(3)
ప్ర, శీ కేం 5-4-9
మందఫల 7-4
అం, శీ, కేం 5-11-13
150
161 × 60 + 13
143 రు 11    96.73 × 11
8    80.3
135 భాగాది 2-15

## అథ కుజాది పంచగ్రహ స్ఫుట గత్యానయనం.

మూ॥ సవ్యాపసవ్య సవ్యేచ క్రమాత్కేంద్రాంతరా విధేః ।
సంస్కారమేవం సర్వత్ర కృత్వాకార్యం గతి స్ఫుటం ।
ఏవం త్రికర్మభిస్సమ్యక్ స్ఫుటాస్సుర్యూఖ సుతాదయః ॥

సవర్ణీకృత తాత్పర్యమునందలి ముఖ్యగమనింపు, రవి మధ్యగతియగు 59-8లే కుజ గురు శనులకు శీఘ్రోచ్చ మధ్యగతులగుననియూ శుద్ధమార్గ గతియగు



59-8-లే బుధ శుక్రులకు మధ్యగతులగుననియూ కుజ గురు శనుల శీఘ్రోచ్చగతియగు 59-8-లలో వారివారి మధ్యగతులను తీసివేయగా కుజ గురు శనులకు ప్రథమ శీఘ్ర కేంద్రగతులగుననియూ మరియూ నీ వెనుక చూపియుండు బుధ శుక్ర కేంద్రగతులే వారికి ప్రథమ శీఘ్ర కేంద్రగతులగుననియూ బుధ శుక్ర కేంద్రగతులయందు రవి మధ్య గతిని చేర్చగా వారికి శీఘ్రోచ్చ గతులగుననియూ నీ మొదలగులోని విషయములను వెనుకటి స్ఫుట గణిత క్రమములచే బాగుగ నెరిగి పాఠముచేయ వలసినది.

(1) తరువాత వారివారి ప్రథమ శీఘ్రకేంద్రగతులను నాయా గ్రహముల ప్రథమ శీఘ్రపదాంతరముచే గుణించి 100-చే భాగింపగా వచ్చు కలాదిలో నర్ధఫలమును ప్రథమ శీఘ్రకేంద్రము మేషాదిలోనుండి ధనాంతర మగునపుడు గ్రహ మధ్యగతిలో చేర్చగనూ ఋణాంతర మగునపుడు తీసివేయగనూ తులాదిలో నుండి ధనాంతర మగునపుడు తీసివేయగనూ ఋణాంతర మగునపుడు చేర్చగనూ కుజాదులకు ప్రథమ శీఘ్రగతులగును.

(2) ప్రథమ శీఘ్ర గతులను వారివారి మంద పదాంతరముచే పెంచి 100-చే భాగించి తీసిన కలాది గతిఫలమును మందకేంద్రము మేషాదిలోనుండి ధనాంతర మగునపుడు గ్రహ మధ్యగతిలో తీసివేయగనూ ఋణాంతర మగునపుడు చేర్చగనూ ; తులాదిలోనుండి ధనాంతరమగునపుడు చేర్చగనూ ఋణాంతరమగునపుడు తీసివేయగనూ కుజాదులకు మంద స్ఫుట గతులగును.

(3) ఆకలాది మందగతి ఫలమునే వారివారి ప్రథమ శీఘ్ర కేంద్ర గతులయందు మీదిక్రమమునకు విపరీతముగ సంస్కరింపగా వారివారికినంత్య శీఘ్రకేంద్రగతులగును దానిని వారివారి నంత్య శీఘ్రపదాంతరముచే పెంచి 100 చే భాగించినెత్తిన కలాది ఫలమును గ్రహామంత్య శీఘ్రకేంద్రము మేషాదిలోనుండి ధనాంతరమగునపుడు మంద స్ఫుట గతిలో చేర్చగనూ ఋణాంతరమగునపుడు తీసివేయగనూ ; తులాదిలో నుండి ధనాంతర మగునపుడు తీసివేయగనూ ఋణాంతరమగునపుడు చేర్చగనూ శుద్ధ స్ఫుట గతులగును.

అందెపుడైననూ తీసివేయతగిన ఫలమధికమై తీసివేపించుకొను ఫలమల్పమై తీసివేయుటకు పోనితరుణమునందా నధికములో నల్పమునే తీసివేసి మీదిక్రమముగనే

గణింపుచుండిన నాగ్రహమునకువక్రగతియగునని తెలియవలసినది.

## కుజ గత్యానయనం.

ఉదా, కుజ శీఘ్రోచ్చగతియగు 59-8 లో కుజ మధ్యగతియగు 31-26-ను తీసివేయగానైన కుజ ప్రథమ శీఘ్రకేంద్రగతి 27-42 దీనిని కుజ ప్రథమ శీఘ్ర పదాంతరమగు 36-ట పెంచి 100-చే భాగించి తీసిన కలాది ఫలము 9-58 దీనిలో సగము 4-59 దీనిని మీదచూపియుండు శీఘ్ర పదాంతరము మేషాది కేంద్రమందలి ధనాంతరమగుటచే గ్రహమధ్యగతియగు 31,26 లలో చేర్చగానైన కుజ ప్రథమ శీఘ్రగతి కలాది 36-25 దీనినే నతనిమంద పదకాంతరమగు 7-చే గుణించి 100-చేభాగించి తీసిన మంద గతిఫల కలాదియగు 2-33-ను మంద పదాంతరము మేషాది కేంద్రమును పొంది యుండు ధనాంతరమగుటచే పూర్వోక్త మధ్యగతియగు 31-26-లో తీసివేయగానైన మంద స్ఫుటగతి కలాది 28-53,, ఇందొచ్చియుండిన ఋణఫల కలాదియగు 2-33-ను ప్రథమ శీఘ్ర కేంద్రగతియగు 27-42 లో ధనము చేయగానైన అంత్య శీఘ్రకేంద్రగతి 30-15 దీనిని అంత్య శీఘ్ర పదకాంతరమగు 37-చే పెంచి 100-చే భాగించి తీసిన కలాది ఫలము 11-17 దీనిని అంత్య శీఘ్ర పదాంతరము మేషాది కేంద్రమునందలి ధనాంతరమగుటచే మంద స్ఫుటగతియగు 28-53-లో చేర్చగానైన శుద్ధ స్ఫుటగతి కలాది 40-10.

## బుధ గత్యానయనం.

మధ్యాధ్యాయోక్త బుధ కేంద్రగతి 186-24 ఇదే బుధప్రథమ శీఘ్ర కేంద్రగతియగును గనుక దీనినే బుధ ప్రథమ శీఘ్ర పదాంతరమగు 3-చే గుణించి 100-చే భాగింపగా వచ్చిన లిప్తాది ఫలదళము 2-48 దీనిని ప్రథమ శీఘ్ర పదకాంతరము తులాది కేంద్రమునందలి ధనాంతరమగుటచే బుధ గ్రహమధ్యగతియగు 59-8-లలో తీసివేయగానైన ప్రథమ శీఘ్రగతి 56-20 దీనినే నతని మంద పదాంతరమగు5-చే పెంచి 100-చే భాగించి తీసిన గతిఫల కలాది 2-49 దీనిని మందపదాంతరము మేషాది కేంద్రమందలి ఋణాంతరమగుటచే మధ్యగతియగు 59-8లోచేర్చగానైన మంద స్ఫుట గతికలాది 61-57 ఇందొచ్చియుండిన గతిఫల ధనకలాదియగు



2-49-లను ప్రథమ శీఘ్ర కేంద్రగతియగు 186-24-లలో తీసివేయగానైన నంత్య శీఘ్రకేంద్రగతి 183-35 దీనిని అంత్య శీఘ్ర పదాంతరమగు 6-చే పెంచి నూటిచే భాగింపగా వచ్చిన లిప్తాది ఫలము 11-1 ఇది తులాది కేంద్రమందలి ధనాంతరమునుండియు వచ్చిన ఫలమగుటచే దీనిని మంద స్ఫుట గతియందు ఋణముచేయగానైన శుద్ధ స్ఫుటగతి కలాది 50-56,,

## గురు గత్యానయనము.

గురు శీఘ్రోచ్చగతి 59-8-లో గురు మధ్యగతి 5-?-ను తీసివేయగానైన గురు ప్రథమ శీఘ్ర కేంద్రగతి 54-8 దీనిని గురు ప్రథమ శీఘ్ర పదాంతరమగు 5-చే పెంచి 100-చే భాగించి తెచ్చిన కలాది ఫలము 2-42 దీనిదళము 1-21-దీనిని ప్రథమ శీఘ్ర పదాంతరము తులాది కేంద్రమునందలి ఋణాన్తరమగుటచే మధ్యగతిలో చేర్చగానైన గురు ప్రథమ శీఘ్రగతి 6-21 దీనినే నతని మంద పదాంతరమగు 9-ట పెంచి 100-ట విభజింపగా వచ్చిన గతిఫల కలాది 0-34 దీనిని మన్ద పదాంతరము తులాది కేంద్ర మందలి ఋణాంతర మగుటచే గ్రహమధ్యగతిలో తీసివేయగానైన మంద స్ఫుటగతి కలాది 4-26 ఇందొచ్చియుండిన గతిఫల ఋణకలాదియగు 0-34-లను ప్రథమ శీఘ్రకేంద్రగతిలో చేర్చగానైన నన్త్య శీఘ్ర కేంద్రగతి 54-42 దీనిని అంత్య శీఘ్ర పదాంతరమగు 6-చే పెంచి 100-చే భాగింపగావచ్చిన లిప్తాది ఫలము 3-17 దీనిని అంత్య శీఘ్ర పదాంతరము తులాది కేంద్రమునందలి ఋణాంతరమగుటచే మంద స్ఫుటగతిలో కలుపగానైన శుద్ధస్ఫుటగతి కలాది 7-43,,

## శుక్ర గత్యానయనం.

మధ్యాధ్యాయోక్తమగు శుక్ర కేంద్రగతి 37-0, ఇదే శుక్ర ప్రథమ శీఘ్ర కేంద్రగతియగును. దీనిని బట్టి వెనుకటివలెనే ప్రథమ శీఘ్రగతి ఫలమును సాధింపగా వచ్చిన కలాది 14-4 దీని దళము 7-2 ఇది తులాది కేంద్రమునందలి ఋణాంతరమునుండియు వచ్చిన ఫలమగుటవలన దీనిని శుక్ర గ్రహమధ్యగతియగు 59-8-లలో చేర్చగానైన ప్రథమ శీఘ్రగతి 66-10 దీనిని బట్టి మందగతి ఫలమును సాధింపగా వచ్చిన లిప్తాది 1-59 ఇది తులాది కేంద్రమునందలి ఋణాంతరముచే వచ్చియుండు

ఫలముగుటచే దీనిని మధ్యగతిలో తీసివేయగానైన మంద స్ఫుటగతి కలాది 57-9,, ఇందొచ్చియుండిన గతిఫల కలలాదియగు 1-59-లను ప్రథమ శీఘ్ర కేంద్రగతిలో సంస్కరింపగానైన నంత్య శీఘ్రకేంద్రగతి 38-59 దీనిచే విూదిక్రమముగనే మరల నంత్య శీఘ్రగతిఫలమును సాధింపగా వచ్చిన కలాది ఫలము 14-48 ఇది తులాది కేంద్రమునందలి ఋణాంతరమునుండియు వచ్చిన ఫలముగుటచే దీనిని మందస్ఫుట గతిలో చేర్చగానైన శుద్ధ స్ఫుటగతి కలాది 71-51.

## శని గత్యానయనం:

శని శీఘ్రోచ్చగతి 59-8 శని మధ్యగతి 2-0 ప్రథమ శీఘ్రకేంద్రగతి 57-8 దీనిచే ప్రథమ శీఘ్ర గత్యర్థ ఫలమును గణింపగా 2-51 ఇది మేషాది కేంద్రమందలి ఋణాంతరమునుండియు వచ్చిన ఫలముగుటచే దీనిని మధ్యగతియగు 2-0 లలో తీసి వేయవలసినది. ఇందు మధ్యగతిలో 2-51 ను తీసివేయుటకు పోదు గనుక 2-51 యందే 2-0-లను తీసివేయగానైన శని ప్రథమ శీఘ్రగతి 0-51 (ఇది వక్రగతియగును) దీనిచే మంద గతిఫలమును సాధింపగా 0-3 వచ్చును. ఇది మధ్యగతిలో ఋణముకా దగినదిగనుక 2 లలో 0-3 లను తీసివేయగానైన మంద స్ఫుటగతి కలాది 1-57 ఇందొచ్చియుండిన మందగతి ఫలముగు 0-3 లను ప్రథమ శీఘ్రకేంద్రగతిలో సంస్కరింపగానైన నంత్య శీఘ్రకేంద్రగతి 57-11 తత్ఫలం 6-17 ఇది మంద స్ఫుటగతిలో తీసివేయుటకు పోదుగనుక 6-17-లో మంద స్ఫుటగతిని తీసివేయగా నిలిచిన వక్రస్ఫుటగతి కలాది 4.20.

గమనింపు:— ఈ విూదిక్రమముగ రవ్యాది సప్తగ్రహములనూస్ఫుటీకరించిన. పిమ్మట నీ క్రిందుదహరించు విధముగ గ్రహాదులలోనగు వానిని వరుసగా వ్రాసి యుంచుకొనవలసినది.

భావ సం॥ ఆషాఢ శుక్ల పూర్ణిమా గురువారము నాటిస్వదేశ ప్రాతః కాలిక దృక్ స్ఫుట గ్రహాః.



స్ఫుట గ్రహములు,, స్ఫుటగతులు,, అంత్య శీ. కేంద్రములు,, అం. శీ. గతులు.

| | | | | |
|---|---|---|---|---|
| రవిః | 3-9-10-17 | 57-3 | | |
| చంద్రః | 9-2-37-42 | 860-3 | | |
| కుజః | 2-14-12-0 | 40-10 | 1-12-12 | 30-15 |
| బుధః | 2-22-8-0 | 50-56 | 8-2-0 | 183-35 |
| గురుః | 5-23-35-0 | 7-43 | 9-5-22 | 54-42 |
| శుక్రః | 2-10-10-0 | 71-51 | 9-17-3 | 38-59 |
| శనిః | 10-1-3-0 | 4-20 వక్రం | 5-11-13 | 57-11 |

నో-స్ఫుటగతియనగా దినద్వయ స్ఫుటాంతరమని చెప్పబడును. (60ఘడియల ప్రమాణముగలనొక యహోరాత్రమునకు స్ఫుట గ్రహసంచారప్రమాణము.)

## అథ రాహు కేతు స్ఫుటక్రమః.

శ్లో॥ చక్రేపాత విశోధ్ఛిష్టం స్ఫుటరాహు ప్రకీర్తితాః ॥
సషడ్భరాహో కేతుస్యాచ్ఛాయా గ్రహశ్చ భవే స్ఫుటం॥

తా॥ మధ్యాధ్యాయోక్త మధ్యపాతయే స్ఫుట పాతియగును. దానిని 12-రాసులలో తీసివేయగా నిలిచినది రాహు స్ఫుటమునూ దానికారు రాసులను చేర్చగా కేతు స్ఫుటమునూయగును. మరియూ వారికి 3-11 కలాది మధ్యగతియే స్ఫుటగతియగునని తెలియవలసినది. అందు పాతకు సవ్యగతియూ రాహుకేతువుల కప సవ్యగతియూ గలిగియుండునని సదా జ్ఞప్తియుంచియుండవలయును.

ఉదా మధ్యాధ్యాయోక్త మధ్యపాతము 2-12-11-49 అర్థోత్తరమతమున లిప్తాంత మధ్యపాత 2-12-12ఇదే స్ఫుటపాత దీనికి స్ఫుటగతి కలాది 3-11 ఈ స్ఫుట పాతను భగణరాసులలో తీసివేయగా నిలిచిన రాహుస్ఫుటము 9-17-48 ఇందారు రాసులను చేర్చగానైన కేతు స్ఫుటము 3-17-48 వక్రగతి 3-11.

## దృక్ స్ఫుట రవి చంద్రులకపవాదము.

శ్లో॥ సిద్ధాంత గ్రహచారేణ వ్రతాదిః కాల ఉచ్యతే ॥
దృక్సిద్ధ గ్రహచారేణ ప్రత్యక్షఫలచింతితం ॥

తా॥ మీదవచ్చియుండు రవి చంద్రులు దృక్స్ఫుటయుక్తులుగనుండుటచే వారిని గ్రహణాది జాతకములలో మాత్రము నుపయోగింపవలసినదియే దప్పతక్కిన వైదికాచరణీయంబులగు శ్రాద్ధాదివ్రతకాల సాధనోపయుక్త తిథ్యాద్యానయన గణితములలో నుపయోగింప గూడదని తెలియవలసినది.

అథతిథ్యాద్యానయనోపయుక్తసౌరసిద్ధాన్తోక్త రవిచంద్రస్ఫుటక్రమః

శ్లో॥ రవేర్మ సోమతాతుంగేర్మ భోగాధ్రువలిప్తికాః ।
తిథ్యాది సాధనేయోగ్య దినపార్ణ న్యథాధనం ॥

స॥ తా॥ స్ఫుటాధ్యాయమునందు చరఫల సంస్కారము చేసియుండు స్వదేశీయప్రాతః కాలిక దృక్సిద్ధ మధ్య గ్రహములయందలి మధ్యమరవిలో 5 లిప్తలు ఋణమునూ; మధ్య చంద్రునిలో నారులిప్తలు ధనమునూ; చంద్రోచ్చమగు తుంగములో భాగాది 5-45 ధనమునూ; చేసికొనగా స్వదేశీయప్రాతః కాలమునకు సూర్యసిద్ధాంతానీత మధ్య గ్రహములగును. వారిలో రవిని నతని మందోచ్చములో తీసివేసి వెనుకటివలెనే మంద ఫలమును తెచ్చి నతనియందే సంస్కరింపగా సూర్యస్ఫుటమగును. మరలనందేమియూ చరార్ధాదిఫల సంస్కారము లక్కఅలేదు

చంద్రస్ఫుటమును మీది క్రమముగనే సాధింపవలసినది.

ఉదా.—స్వదేశ ప్రాతఃకాలిక మధ్య గ్రహములయందలి మధ్యమార్కుడు 3-10-1-20లలో నయిదు లిప్తలను తీసివేయగానైన సూర్యసిద్ధాంతరవిః 3-9-56-20. దీనిని నతని మన్దోచ్చములో తీసివేసి వెనుకటివలెనే భుజాపదక ములను తెచ్చి మందఫల మెత్తగా వచ్చిన ఋణ భుజాఫల కలాది 50-51 దీనిని పైరవియగు 3-9-56-20 లలో తీసివేయగానైన సూర్య సిద్ధాంతానీత స్ఫుటార్కః 3-9-5-29 స్ఫుటగతి 57-3

మధ్యచంద్రుడు 9-3-10-43 దీనిలో నారులిప్తలను చేర్చి అయిన దానిలో సూర్య భుజాఫల లిప్తలను 27 టపాలు గొనగా వచ్చిన లిప్తాది ఫలమును సంస్కరింపగానైన అర్క బాహుఫల సంస్కారకృత మధ్య చంద్రుడు 9-3-14-50 దీనిలో దేశాంతర ధ్రువలిప్తలను తీసివేయగానైన స్ఫుటమధ్యచంద్రుడు 9-3-6-50 దీనిని మీద కనుపఱచియుండు తుంగములో భాగాది 5-45 లను చేర్చగా నయిన 3-13-7-50 లో



తీసివేయగా నైన చంద్ర మందకేంద్రము 6-10-1-0 దీనిని బట్టి వెనుకటివలెనే చంద్ర మంద పదకములనుండియు ఫలసాధనమును చేయగా వచ్చిన ఋణ భుజాఫల లిప్తాది 53-2 కర్కాద్యది స్ఫుటగతి 858-57 ఈ భుజాఫలమును స్ఫుటమధ్య చంద్రుడగు 9-3-6-50 లో సంస్కరింపగా నయిన సూర్య సిద్ధాంతోక్త స్ఫుట చంద్రః 9-2-13-48 స్ఫుటగతిః 858-57

*N.B.* ఈ స్ఫుట రవి చంద్రులను బట్టియే తిథ్యాదులను గణింపవలసినది.

ఇతి శ్రీ సిద్ధాంత రహస్య గ్రహతంత్రే

# స్ఫుటాధికారోనామ తృతీయోఽధ్యాయః

## అథ సిద్ధాంత రహస్యే పంచాంగాద్యానయనాధ్యాయః

(12 భా. అంతరముగల)

తిథికరణధ్రువక చక్రము

| శుక్లపక్షము | | | | | కృష్ణపక్షము | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తిథులు | రా | భా | పూర్వ కరణం | ఉత్తర కరణం | తిథులు | రా | భా | పూర్వ కరణం | ఉత్తర కరణం |
| ప్రతి | 0 | 12 | కింస్తు | బవ | ప్రతి | 6 | 12 | బాల | కౌలవ |
| ద్వితి | 0 | 24 | బాల | కౌల | ద్వితి | 6 | 24 | తైతు | గర |
| తృతి | 1 | 6 | తైతు | గర | తృతి | 7 | 6 | వణి | భద్రి |
| చతు | 1 | 18 | వణి | భద్రి | చతు | 7 | 18 | బవ | బాల |
| పంచ | 2 | 0 | బవ | బాల | పంచ | 8 | 0 | కౌల | తైతు |
| షష్ఠి | 2 | 12 | కౌల | తైతు | షష్ఠి | 8 | 12 | గర | వణి |
| సప్త | 2 | 24 | గర | వణి | సప్త | 8 | 24 | భద్రి | బవ |
| అష్ట | 3 | 6 | భద్రి | బవ | అష్ట | 9 | 6 | బాల | కౌల |
| నవ | 3 | 18 | బాల | కౌల | నవ | 9 | 18 | తైతు | గర |
| దశ | 4 | 0 | తైతు | గర | దశ | 10 | 0 | వణి | భద్రి |
| ఏకా | 4 | 12 | వణి | భద్రి | ఏకా | 10 | 12 | బవ | బాల |
| ద్వాద | 4 | 24 | బవ | బాల | ద్వాద | 10 | 24 | కౌలవ | తైతుల |
| త్రియో | 5 | 6 | కౌల | తైతు | త్రియో | 11 | 6 | గర | వణి |
| చతుర్ద | 5 | 18 | గర | వణి | చతు | 11 | 18 | భద్రి | శకుని |
| పూర్ణి | 6 | 0 | భద్రి | బవ | అమా | 12 | 0 | చతుష్పా | నాగవం |

## తిథికరణ సాధనాక్రమము.

శ్లో॥ వ్యర్కేందు హీన ధ్రువకం లిప్తీకృత్యార్కతఘ్నయత్ ।
తద్గత్యాప్తం సదాభోగ్యస్తిథి నాడ్యాదికం భవేత్ ॥
జ్ఞానేషు పుత్రైకరణే స్యాద్ఘటీ ధ్రువలిప్తికాః ।
స్తిథ్యర్ధమానేకరణ ప్రమాణాం చింతి తంసదా ॥

స॥ తా॥ చంద్రి స్ఫుటమునందు రవి స్ఫుటమును తీసివేయగా వ్యర్కేందు వునూ; చంద్రి స్ఫుటగతియందు రవి స్ఫుటగతిని తీసివేయగా వ్యర్కేందు గతియునూ నిలుచును.

అట్టి వ్యర్కేందువును నీ మీదచూపియుండు రాశ్యాది ధ్రువకములలో తీసివేయుటకు తగిన నక్ష్యల్ప ధ్రువకమునందనగా వ్యర్కేందువుకంటెను 12-భాగలకు మించకుండు ధ్రువకమునందు తీసివేయగా నా ధ్రువకమునకు సరిగా వ్రాసియుండు తిథియే నుదయాదిగ నుండునని తెలియవలసినది.

పిమ్మట వ్యర్కేందు హీన ధ్రువకము ద్వాదశాంశాల్ప శేషభాగాదిని వికలలుచేసి అయిన మొత్తమును వ్యర్కేందుగతి నర్ధోత్తర లిప్తలచే భాగించి ఘటకాది ఫలమునెత్తగా నదియే సూర్యోదయాదిగ తిథిప్రమాణనాడికాదియగును.

కరణప్రమాణ సవర్ణీకృత భాజ్యరాశియగు 21600-ను వ్యర్కేందుగతి నర్ధోత్తర లిప్తలచేభాగింపగావచ్చు ఘటికాదిఫలము తిథ్యుత్తరార్ధ కరణపరిమాణ నాడికాదియగును గనుక దానిని తిథిపరిమాణములో తీసివేయగా నిలిచినది నా తిథికి సరిగా మీదవ్రాసియుండు పూర్వ కరణపరిమాణ నాడికాదియగును, అందు తీసివేయుటకు పోని తరుణమునందు నా తిథిపరిమాణ ఘటికాదియే ఉత్తర కరణ పరిమాణమైయ్యుండునని తెలియవలసినది.

ఉదా:—సూర్య సిద్ధాంత స్ఫుటసోమః 9-2-13-48 దీనిలో టస్ఫుటరవి 3-9-5-29-ని తీసివేయగా నిలిచిన వ్యర్కేందువు 5-23-8-19 చంద్రి స్ఫుటగతియగు 858-57-లో రవిస్ఫుటగతి 57-3-ను తీసివేయగానయిన వ్యర్కేందుగతి కలాది 801-54 దీనిని తిథిగతియనియు చంద్రిగత్యంతరమనియూ చెప్పబడును.



వ్యర్కేందువగు 5-23-8-19-ని మీద చూపియుండు ధ్రువకములలో తీసివేయుటకు తగినది పూర్ణిమా ధ్రువకమగు 6-0 గనుక దీనిలో తీసివేయగా నిలిచిన వ్యర్కేందు హీన ధ్రువ భాగాది 6-51-41 దీనిని వికలలుచేయగా 24701 దీనిని రవి చంద్రి గత్యంతరార్ధోత్తర లిప్తలగు 802-చే విభజింపగావచ్చిన నుదయాది ఘ॥ పూర్ణిమా తిథ్యంత పరిమాణ ఘటికాది 30-48 ఇదే తిథిపరిమాణము కరణపారిణ లిప్తలగు 21600-ను తిథిగతియగు 802-చే భాగింపగా వచ్చిన పూర్ణిమాయుత్తరార్ధ కరణ పరిమాణమగు బవకరణ పరిమాణ నాడికాది 26-59 దీనిని తిథిపరిమాణమగు 30-48 లలో తీసివేయగా నిలిచిన పూర్ణిమా పూర్వకరణమగు భద్రి వాకరణ పరిమాణ ఘటికాది 3-49 గనుక ఉదయాదిగ 3-49వరలో భద్రి వాకరణముండునని తెలిసెను

(భాగాది 13-20 అంతరముగల)

## నక్షత్రయోగ ధ్రువకములనుచూపు చక్రము.

| నక్షత్రములు | ధ్రువక రాశ్యాది | | | యోగములు | నక్షత్రములు | ధ్రువక రాశ్యాది | | | యోగములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | 0 | 13 | 20 | విష్కం | స్వాతి | 6 | 20 | 0 | వజ్రిం |
| భర | 0 | 26 | 40 | ప్రీతి | విశా | 7 | 3 | 20 | సిద్ధి |
| కృత్తి | 1 | 10 | 0 | ఆయు | అనూ | 7 | 16 | 40 | వ్యతీ |
| రోహి | 1 | 23 | 20 | సౌభా | జ్యేష్ఠ | 8 | 0 | 0 | వరీ |
| మృగ | 2 | 6 | 40 | శోభ | మూల | 8 | 13 | 20 | పరిఘ |
| ఆరు | 2 | 20 | 0 | అతిగ | పూ. షా | 8 | 26 | 40 | శివ |
| పున | 3 | 3 | 20 | సుక | ఉ షా | 9 | 10 | 0 | సిద్ధ |
| పుష్య | 3 | 16 | 40 | ధృతి | శ్రవ | 9 | 23 | 20 | సాధ్యం |
| ఆశ్రే | 4 | 0 | 0 | శూల | ధని | 10 | 6 | 40 | శుభ |
| మఖ | 4 | 13 | 20 | గండం | శత | 10 | 20 | 0 | శుక్ల |
| పుబ్బ | 4 | 6 | 40 | వృద్ధి | పూ. భా | 11 | 3 | 20 | బ్రహ్మ |
| ఉ-ర | 5 | 10 | 0 | ధ్రువ | ఉ. భా | 11 | 16 | 40 | ఐంద్రి |
| హస్త | 5 | 23 | 20 | వ్యాఘా | రేవతి | 12 | 0 | 0 | వైధృతి |
| చిత్త | 6 | 6 | 40 | హర్షణ | | | | | |

## యోగ నక్షత్రములనెత్తుట.

శ్లో॥ చంద్రార్కయోగ హీనంస్యాత్కలీ కృత్యార్ధతఘ్నయత్ ।
తద్గత్యాప్తంసదా భోగ్యయోగ నాడ్యాదికం ధృవే ॥
ఏవం స్ఫుట నిశానాథే ఋక్షమానమవం క్రమాత్ ॥

స॥ తా॥ స్ఫుటార్కునియందు స్ఫుట చంద్రుని చేర్పగా యోగ రాశ్యాదియునూ రవిస్ఫుటగతియందు చంద్ర స్ఫుటగతిని కలుపగా యోగగతియునూయగును.

అట్టియోగ రాశ్యాదిని నీ మీదచూపియుండు ధృవకములలో తీసివేయుటకు యోగ్యమగువానిలో నత్యల్ప ధృవకమునందు తీసివేయగా నా ధృవకమునకు సరిగా వ్రాసియుండు యోగమే నుదయాదిగనుండునని తెలసి అందలి శేషభాగాదిని విలిప్తలుచేసి అయిన మొత్తమును యోగగతి లిప్తలచే భాగింపగావచ్చు నాడికాది ఫలమే సూర్యోదయాదిగ యోగప్రమాణమగును.

చంద్ర స్ఫుటమునుండియూ నీ మీది క్రమముగనే గణింపగా నుదయాదిగ నక్షత్ర ప్రమాణ ఘటికాదియగునని తెలియవలసినది.

## ఉదా, ను చక్కగ పరిశీలింపుము.

రవి చంద్ర స్ఫుటముల రెంటినీ చేర్పగానైన యోగరాశ్యాది 0-11-19-17 దీనిని విష్కంభయోగ ధృవకమగు 0-13-20 లో తీసివేయగా నిలిచిన భాగాది 2-0-43 దీనివిలిప్తలు 7243 దీనిని యోగగతి నర్ధోత్తర లిప్తలగు 916 చే భాగించి తెచ్చిన ఘటికాది ఫలము 7-54 ఇది సూర్యోదయాదిగ విష్కంభయోగ ప్రమాణమగునని తెలిసెను.

అదే విధముగనే చంద్రస్ఫుటమగు 9-2-18-49 లను నీ మీద చూపియుండు నక్షత్ర ధృవకములలో తీసివేయుటకు యోగ్యమగువానిలో నత్యల్ప ధృవకము 9-10-0 ఇది ఉత్తరాషాఢ నక్షత్ర ధృవకమగుటచే నే డుదయాదిగ నుత్తరాషాఢా నక్షత్రమేయుండునని తెలిసి నీ ధృవకములో చంద్రస్ఫుటమును తీసివేయగా నిలిచిన భాగాదిని వికలలుచేయగానైనది 27972 దీనిని చంద్రస్ఫుటగతి నర్ధోత్తరలిప్తలగు 859 చేత విభజింపగావచ్చిన నక్షత్రఘటికాది 32-34.

ఇట్లు వరుసగా భావ సం॥ అషాఢ శు॥ 15 గురువారమునాటికి గురువారము పూర్ణిమా 30-48 ఉ షా 32-34 విష్కం 7-54, భద్రవాకరణం 3-49 అని తెలిసెను.



స్వదేశ పంచాంగ గణితక్రమమునందలి విశేష ప్రక్రియమధ్యాధ్యాయోక్తమగు మధ్యగ్రహములయందలి మధ్యరవిలో నయిదు లిప్తలునూ చంద్రునియందు రెండు విలిప్తలునూతీసివేసి తుంగమునందయిదు భాగలు 45 లిప్తలను చేర్చుకొనగా స్వదేశ సూర్యసిద్ధాంతానీత మధ్యగ్రహములగును. వారిలో వారివారి దినమధ్యగతియుత పదకములయందలి పదకములలో నిష్టమగు పదక ఫలమును (లేక ఫలములను) వరుసక్రమముగ చేర్చుకొనగా ఇష్టదినమునకు చాలిత మధ్యగ్రహములయ్యెదరు.

వానిని బట్టి నీక్రిందువహరించు విధమున రవిచంద్రులను స్ఫుటీకరించుకొని వానినుండియు నీ మీదిక్రమముగనే తిథ్యాదులను తెచ్చుకొనవలసినది.

## రవిచంద్ర స్ఫుటక్రమము.

ఇష్టమైన చాలిత మధ్యార్కుని వెనుకటివలెనే నతని మందోచ్చములో తీసివేసి మంద ఫలమును తెచ్చి సంస్కరింపగా మందరవియగును.

మంద రవిలో నయనాంశలనుచేర్చి భుజజేయగానైన భుజా రాశ్యాదిని నర్ధోత్తర భాగలుజేయగా నదియే దినగతి పదకములయందలి పదక సంఖ్యయగును. ఆ పదకమునకు సరిగా వ్రాసియుండు అహఃప్రమాణ రాత్రిప్రమాణములు సాయనరవి మేషాదిలో నుండునపుడవియే సరివచ్చును. తులాదిలో నుండునపుడందులకు విపరీతమనగా అహఃప్రమాణము రాత్రిప్రమాణమునూ; రాత్రిప్రమాణము అహఃప్రమాణమునూ నైయుండును. తరువాత రవిచరార్ధఫల విలిప్తలను సాయనరవి మేషాదిలో నుండునపుడు మందరవిలో ఋణమునూ తులాదిలో నుండునపుడు ధనమునూ జేసికొనగా స్ఫుటరవియగును.

రవిచరార్ధఫల విలిప్తలను మందరవిలో సంస్కరించినవిధమునే మధ్య చంద్రునియందతని చరార్ధఫల కలాదిని సంస్కరించుకొని యందర్క బాహుఫల సంస్కారమును సంస్కరింపగా స్ఫుటమధ్య చంద్రుడగును. వానినతని తుంగములో తీసివేసి మీదిక్రమముగనే మందఫలము తెచ్చి సంస్కరింపగా స్ఫుట చంద్రుడగును. స్ఫుటగతులను వెనుకటివలెనే పదకములనుండియు సాధింపవలసినది.

ఈ రవిచంద్ర స్ఫుటములనుండియు మీదిక్రమములుగనే వైదిక కర్మానుష్ఠానములకు యోగ్యమగుతిథ్యాదులను సులభముగ గణించుకొనవచ్చును.

మధ్యాధ్యాయమును చూడుము.

ఉదా,, మధ్యరవిః 3-10-2-7 దీనిలో 5 లిప్తలునూ, మధ్యచంద్రుడు 9-3-21-17 దీనిలో రెండు లిప్తలునూ తీసివేసి తుంగముగు 3-7-22-50-లలో భాగాది 5-45-లను చేర్చగానైన సూర్య సిద్ధాంతోక్త స్వదేశీయ మధ్యగ్రహములు. రవిః 3-9-57-7 చంద్రః 9-3-19-17 తుంగః 3-13-7-50 ఈ రవిచంద్ర తుంగములలో వరుసగా వారివారి దినమధ్యగతి యుతపదకములయందలి ఏ 1-వ పదక ఫలములను చేర్చిపరల నర్ధోత్తరమతముగ వదలివేయగానైన రెండవనాటి ప్రాతఃకాలిక మధ్యగ్రహములు రవిః 3-10-56-15 చంద్రః 9-16-29-52 తుంగః 3-14-14-31.

ఇందులో మధ్యరవిని నతని మందోచ్చములో తీసివేసి మందఫలమునెత్తగా వచ్చిన ఋణభుజాఫల కలాది 52-54 మందఫల సంస్కృత రవిః 3-10-3-21 దీనిలో నయనాంశలను చేర్చి భుజచేయగానైన సాయనార్క భుజా 1-28-24-55, దీనినర్ధోత్తర భాగలుచేయగా 58 గనుక దినగతి పదకములయందలి పదక సంఖ్య 58 అని తెలిసెను.

58-వ పదకము; చరలిప్తలు 48 అహః 31-36 రాత్రి 28-24 రవికి చరార్ధ ఫల విలిప్తలు 47 చంద్రచరార్ధఫల కలాది 10-34 అని వ్రాసియున్నది గనుక రవి చరార్ధఫల విలిప్తలగు 47-లను మందరవిలో సంస్కరింపగానైన సిద్ధాంతస్ఫుటార్కః 3-10-2-34 స్ఫుటగతిః 57-5.

నీమీదవచ్చియుండు చంద్రచరార్ధఫల కలాదియగు 10-34-లను మధ్య చంద్రునిలో తీసివేసి యందర్క బాహుఫల సంస్కారమును సంస్కరించి మీది క్రమముగనే మందకేంద్రము మీద భుజాపదక ఫలాదులను తెచ్చి సంస్కరింపగా నైన స్ఫుటచంద్రుడు 9-16-33-34 గతిః 860-3, ఈ రవిచంద్రులనుబట్టి వెనుకటి వలెనే పంచాంగానయనమును జేయగా కృ॥ ప్రతి 24-35, శ్రవ 28-20, ప్రీతి ౯-15,, కౌల 24 35 అని తెలిసెను.

అదే విధముగ పైచూపియుండుమధ్యగ్రహములగు రవి ?-9-57-7,, చంద్ర 9-3-19-17 తుంగ3-13-7-50, వీనిలో ఏ 2 గతియుత పదక ఫలములను వరుసగాచేర్చి మీద్రిక్రమముగనే స్ఫుటీకరింపగానైన మూడవనాటి ప్రాతఃకాలిక స్ఫుటగ్రహములు రవిః 3-10-59-36 గతిః 57-5,, చంద్రః 10-0-52-40, గతి 857-0, వీనినుండి కృ ॥ ద్వితీయా 18-31 ధని 24-19 సౌభా 45-9 గర 18-31 అహః 31-34 అని తెలిసెను.



గమనింపు,,-ఈ క్రమముగనే నొకనాటి మధ్యగ్రహములను ధృవములుగ తెలసి అందు వారివారి ఏకాదిస్థానగతియుత పదక ఫలములను వరుసగాచేర్చు కొనుమా క్రమముగ గణింపుచుండిన సులభములో తిథ్యాదులను గణింపదగును.

ఈ విషయమునుగూర్చి నీ యధ్యాయాంతమున వ్రాసియుండు ఆషాఢ కృష్ణపక్షముయొక్క తిథ్యాదులను సరిచూచి గణితక్రమములను సరిపోల్చు కొనవచ్చును.

అథ విషఘటికాద్యానయనక్రమః.

| నక్షత్రములు | విష ధృవకము | అమృతధ్రువకము | నక్షత్రములు | విష ధృవకము | అమృతధ్రువకము | నక్షత్రములు | విష ధృవకము | అమృతధ్రువకము | నక్షత్రములు | విష ధృవకము | అమృతధ్రువకము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | 50 | 42 | పుష్య | 20 | 44 | స్వా | 14 | 38 | శ్రవ | 10 | 34 |
| భర | 24 | 48 | ఆశ్లే | 32 | 56 | విశా | 14 | 38 | ధని | 10 | 34 |
| కృత్తి | 30 | 54 | మ | 30 | 54 | అనూ | 10 | 34 | శత | 18 | 42 |
| రోహి | 40 | 52 | పుబ్బ | 20 | 44 | జ్యే | 14 | 38 | పూ.భా | 16 | 40 |
| మృ | 14 | 38 | ఉ.ర | 18 | 42 | మూ | 56/20 | 44 | ఉ.భా | 24 | 48 |
| ఆర్ది | 21 | 45/35 | హ | 21 | 45 | పూ.షా | 24 | 48 | రేవ | 30 | 54 |
| పున | 30 | 55 | చిత్తి | 20 | 44 | ఉ.షా | 20 | 44 | | | |

మూ॥ విషధృవైర్నిశదఘ్నైశ్చంద్రగత్యాప్తయోః ఫలం ।
నాడ్యాదిస్యాద్గతర్క్షేషు యోజయే ద్విషనాడికాః ॥
దివారాత్రస్తయోః కార్యం త్యాజ్యారంభంభవేధ్రువం ।
నానారోగైశ్చంద్రగత్యా ర్భాజయే ద్విషసర్వదా ॥
ఏవంసుధాధ్రువై స్తాసద్య మమృతోదయఉచ్యతే ॥

స॥ తా॥ త్యాజ్యమను విషకాలమును తెలియవలసిన నక్షత్రమునకు నీ మీద చూపియుండు విషధృవకముచే నక్షత్రమాన లిప్తలగు 800-లను హెంచి వచ్చిన మొత్తమును నాటి చంద్రస్ఫుటగతిచే భాగించి తెచ్చిన ఘటికాదిఫలమును తత్వా

ర్వదిన నక్షత్ర (గతనక్షత్ర) ఘడియలలో చేర్చగా త్యాజ్యారంభ కాలమగును. అందు 3200 ను చంద్రస్ఫుటగతిచే భాగింపగావచ్చు ఘటికాది ఫలమే త్యాజ్య ప్రమాణమగును. తత్కాలము దివారాత్రులలో నెపుడు వ్యాపించియుండునో దానిని సంగ్రహముగ దివి,, రావి,, అనిచెప్పబడును. అందు దివి అనగా దివిలో విషఘటికారంభమనియూ రావియనగా రాత్రిలో విషఘటికారంభమనియూ తెలియవలసినది.

రావిలో త్యాజ్య ప్రమాణమును చేర్చగానది రాత్రి ప్రమాణమునకు మించి యుండెనేని దానిలో రాత్రి ప్రమాణమును తీసివేయగా నిలిచినది (రాత్రి ప్రమాణమునకు మించియుండునది) శేషత్యాజ్యమగును = శేష,, విష ధ్రువకములనుండియూ విషకాలమును తెచ్చు విధముగనే అమృత ధ్రువకములనుండియు అమృత కాలములను తెచ్చుకొనవలసినది.

### బాగుగ పరిశీలింపుము.

ఉ॥ ప్రతి, నాటి నక్షత్రము శ్రవణము గనుక శ్రవణనక్షత్ర విషధ్రువకమగు 10 చే 800 ను హెంచివచ్చిన దానిని చంద్రగతియగు 860 చే భాగింపగా వచ్చిన నాడికాదిఫలము 9-18, దీనిని పూర్ణిమానాటి నక్షత్ర ఘడియలగు ఉపా 32-34, ల లో చేర్చగా 41-52 ఇది పూర్ణిమానాటి అహస్సునకంటెను మించియుండుటచే ఇందులో దినమానమును తీసివేయగానైన అస్తాది విషారంభకాలము 10-16 ,, చంద్ర స్ఫు॰ గతియగు 860 చే 3200 ను భాగింపగావచ్చిన త్యాజ్య ప్రమాణ ఘటికాది 3-44 ఇది రాత్రి త్యాజ్యమగుటచే రావి 10-16 త్యాప్ర 3-44 అని తెలిసెను.

అదే విధమున శ్రవణ నక్షత్రామృత ధ్రువకమగు 34 చే 800 ను గుణించి వచ్చిన దానిని చంద్రస్ఫుటగతిచే భాగించి తెచ్చిన నాడికాదిఫలమగు 31-38 ని గత నక్షత్ర ఘడియలగు 32-34 లో కలుపగానైన అమృతకాలము 64-12 ఇంత ఘడియలు 60 కి మించియుండుటచే 60 ని తీసివేయగా నిలిచిన మరుదయాది అమృతకాలారంభము 4-12.



ఈ విధముగనే రెండవదిన నక్షత్రమగు ధనిష్ఠా నక్షత్రమునకు గణింపగా దాని త్యాజ్యామృత ధ్రువకములచే 800 ను వేరువేరుగా గుణించి నాటి చంద్రస్ఫుట గతియగు 857 చే భాగింపగావచ్చిన నాడికాది ఫలములు ,, 9-20 ,, 31-45,, వీనిని వేరువేరుగా తత్పూర్వదిన నక్షత్రప్రమాణమగు శ్రవ 28-20 లలో చేర్చగానైన త్యాజ్యా మృతకాలములు 37-40 ,, 60-5 ,, ఇందులో త్యాజ్యారంభము దినమానము నకంటెనూ అమృతారంభ మహోరాత్రమునకంటెనూ మించియుండుటచే నాయా కాలములయందు నాయాప్రమాణములను తీసివేయగానైన అస్తాది త్యాజ్యారంభ కాలము 6-4 ఇందుకు త్యాజ్య ప్రమాణము 3-45 వచ్చును గనుక రావి 6-4 త్యాప్ర 3-45 అనియూ రెండవ దినమున అమృ 0-5 అనియూ తెలియవలసినది.

గమనింపు.—నొక యహోరాత్రమునకు 60-10 ఘటికాది ప్రమాణమగునని చెప్పబడియుండినను కొన్ని విధులయందాక్రమము సరిపడనిదానిచే నీగ్రంథమున నొక యహోరాత్రమునకరువది ఘడియలను మాత్రమే నిర్ణయింపబడినది.

### అథగ్రహనక్షత్ర పాదప్రవేశాద్యానయనక్రమః

గమనింపు.—కుజాది పంచ తారాగ్రహముల నక్షత్రపాద ప్రవేశాదులను నిర్ణయించుటకు మొదట వారివారి పాదచారగతులను గణింపవలయును.

అందు నీవెనుక జూపియుండు స్ఫుటగతులనే కొందరు సిద్ధాంతకారులు చారగతులుగ దలచెదరు. అట్టి గణితములో ప్రతిదినమునకుగాని లేక నొక దినమును విడిచి నొక దినమునకుగాని కుజాదిస్ఫుటముల నెత్తవలసినది. అవిలేకుండిన విశేష స్ఖాలిత్యములగుబడును మరియూ నీముందు చూపబోవు విధముగ జాతకాదీష్టకాలములకు గ్రహస్ఫుటములను తాత్కాలించుకొనుటకు మాత్రమేదప్ప తక్కిన నక్షత్ర చారాదులను లెక్కించుటకు వెనుకటి స్ఫుటగతులు పనికిరావు. గాకనూ దిన దినమునకునూ గ్రహస్ఫుటములుచేసి పంచాంగములనెవరుగానీవ్రాయరు.

మఱియూ నాక్రమము కష్టసాధ్యముగ నుండుటచేనిచట పక్షగ్రహ చాలిత గణితక్రమమును చూపబడును.

### అథ పర్వాంతచారగత్యానయనక్రమః.

శ్లో॥ స్ఫుటద్వయోస్త్వంతరంచ కలాన్పక్షదినైర్భజేత్ ।
కలాది స్యాత్ఫలం సాధ్యం చారభుక్తిర్విధీయతే ॥

స॥ తా॥ పక్షగ్రహగతియనగా ప్రతి మాసమునందును పూర్ణిమావాస్యలనబడు రెండు పర్వదినములలో గ్రహస్ఫుటములుచేసి వానియంతరము నెత్తగానదియే పక్షగతియగును, దానిని పక్షదినములచే భాగింపగా వచ్చుఫలమే చారగతియగును దానిని బట్టి నీక్రింది విధముగ నక్షత్రపాదప్రవేశాదులను సులభముతో వ్రాయవచ్చును.

అందులనుగూర్చి నీక్రిందుదాహృతములను చక్కగపరిశీలింపవలయును.

### ఉదాహరణములు.

ఆషాడ శుద్ధ 15 నాటి స్ఫుటకుజుడు 2-14-12 నాటి మధ్యకుజుడు 1-17-9-4 లలో పూర్ణిమా మొదలు అమావాస్యావఱలో చెల్లగల 15 దినములయొక్క కుజ మధ్య గతిని [ ఇందు ఏ 6ది,, ద1ది,, దిన మధ్యగతియుతపదక ఫలములను చేర్చగా 15 దినముల మధ్యగతియగునని ఈ మొదలుగా తెలియవలెను. ] చేర్చి మీదిక్రమముగనే నాదినమునకు కుజ శీఘ్రోచ్చమును తెచ్చి క్రమముగస్ఫుటీకరింపగానయిన

---

నో॥ షా. రా. కే. వీరికి 3-11 కలాదియే స్ఫుటచారగతియగుననియూ రవి చంద్రులను తిథ్యాద్యానయనమునందు ప్రతినాడునూ స్ఫుటీకరించుటచే వారికివారి స్ఫుటగతియే చారగతియగుననియూ తెలియవలసినది. తక్కిన కుజాది తారాగ్రహములకు మాత్రము నీ మీదిక్రమముగనె పక్షదినముల లెక్కించి ( పక్షదినములనగా పూర్ణిమావాస్యల నడుమనుండు అంతరదినములగును అవి 13 మొదలు 16 వరులో వచ్చుచుండును) నన్నిదినములకగు గ్రహదినమధ్యగతులను గ్రహదినమధ్యగతియుతపదకములనుండియు గ్రహించి వానిని గత పర్వమునందలి మధ్యగ్రహములలో క్రమముగచేర్చుకొని స్ఫుటీకరింపగానవి ఏష్యపర్వమునకు గ్రహస్ఫుటములగును. తరువాతగతైష్యపర్వములయొక్క స్ఫుటాంతర లిప్తలను పక్షదినములచేత భాగింపగా వచ్చు కలాదిఫలమే నాయాగ్రహములకు స్ఫుట చారగతులగును. అందు గతపర్వస్ఫుటముకంటెను ఏష్యపర్వస్ఫుటము తగ్గియుండునప్పుడాగ్రహమునకు వక్రచారగతియగునని తెలియవలసినది.



ఆషాఢ బ 30 లు నాటి స్ఫుటకుజుడు 2-24.8 పూర్ణిమావాస్యలయందలి స్ఫుటాంతర భాగాది 9-56 దీనిలిప్తలు 596 ఇది 15 దినములగతి స్ఫుటమగుటచే దీనిని 15-ట భాగింపగావచ్చిన చారస్ఫుటగతి కలాది 39-44 ఇదే విధమున ఆషాఢ శు 15 నాటి మధ్యగ్రహములకు 15 దినముల మధ్యగతులనుచేర్చి అమావాస్యనాటికి తాత్కాలించుకొని మీదిక్రమముగనే స్ఫుటీకరించి ఉభయస్ఫుటాంతర లిప్తలను 15-ట విభజింపగా వచ్చిన చారస్ఫుటగతులు బుధ=77.48,, గురు=8-28,, శుక్ర=72 శని=4-44 వక్ర॰ దీనిని పరిక్షించిచూడుము.

### అథ గ్రహ నక్షత్ర పాదప్రవేశ గణితక్రమః.

శ్లో॥ చారభుక్తిర్విలిప్తైశ్చ భపాదధృవకం హరేత్ ।
వారనాడ్యాదికం యుక్తం ప్రవేశగత పర్వకే ॥

### సవర్ణీకృత తాత్పర్యము.

గత పర్వస్ఫుట గ్రహమునందు నీవెనుక చూపిముందు నక్షత్ర యోగ్యధ్రువకములలో తీసి వేయుటకుకా తగిన నక్షత్ర ధృవకములలో నధికమగుదానిని తీసివేయగా మిగిలినది ఏష్యనక్షత్రమునందలి భుక్త భాగాదియగును. [ఇందు ధృవమునకు సరిగానుండునది గతమనియూ తదనంతరమున వరుసగావచ్చునది ఏష్యమనియూ తెలియవలసినది.] దానిని లిప్తలుచేసి నక్షత్రపాదప్రమాణమగు 200-చే విభజింపగా వచ్చులబ్ధము ఏష్యనక్షత్రమునందలి భుక్తపాదములగును, అందలి శేషము వర్తమానపాదమందలి గతలిప్తలగుటచే దానిని 200-లలో తీసివేయగా నిలుచు శేషమును విలిప్తలుచేసి చారగతి విలిప్తలచేత భాగించి దినాదిఫలమును తీసికొనగా నదియే నాడుదయాదిగ వర్తమానపాదమునకు తదనంతరపాద ప్రవేశకాలమగును.

అందలి వారములలో నాటివారము భానువారాదిగనెన్నవదగునో నావార సంఖ్యనుకలుపగా వారాదిగ చారప్రవేశకాలమగును (ఇది భానువారాదికము,.)

### పాదగత్యానయన సంస్కారక్రమము.

నక్షత్రపాద ధృవసవర్ణీకృత భాజ్యరాశియగు 12000-ను చారగతి విలిప్తలచేత భాగించి దినాదిఫలము నెత్తగానదియే పాదగతియగును. దానిని మీదవచ్చి

యుండు చారప్రవేశకాల వారాదియందు వరుసక్రమములననుసరించి కలుపుకొనుచూ నక్షత్రపాదప్రవేశములను వరుసగా లెక్కించవలసినది.

## ఉదాహరణములు.

శుక్లపూర్ణిమా గురువారమునాటి స్ఫుట కుజుడు 2-14-12 ఇందులో తీసి వేయుటకు కాతగిన నక్షత్రధ్రువకములలో గొప్పది 2-6-40 ఇదిమృగశిరా నక్షత్ర ధ్రువకమగుటచే 2-14-12-లలో 2-6-40-లను తీసివేయగానిలిచిన భాగాది 7-32 ఇది ఆర్ద్రానక్షత్రమందలి గతాంశములగును. దీని లిప్తలు 452 దీనిని 200-ట భాగింపగా వచ్చిన లబ్ధము 2 ఇది ఆర్ద్రలోగత పాదములగును శేషము 52 ఇది ఆర్ద్ర 3-వ పాదమునందలి గతలిప్తలగును ఇదేవర్తమాన పాదముగనుక దీనిని 200-లో తీసివేయగా నిలిచిన దానిని వికలలుచేయగానైన 8880-ని చారగతి విలిప్తలగు 2384-చే భాగింపగా వచ్చినదినాది 3-43-29-ఇది నేడుదయాదిగ 4 వ వారమగు భానువారము నాడు 43-29 లకు ఆర్ద్రానక్షత్రమందలి 4-వ పాదమునకు కుజచారమగునని తెలియజేయుచున్నది.

నేడుగురువారమగుటచే భానువారాదిగ 5-వ వారమగును గనుక నీ వార సంఖ్యయగు 5ను మీదవచ్చియుండు వారాదియగు 3-43-29-లలో చేర్చగానైన చార ప్రవేశవారాది 1-43-29 అనగా బ 3 భానువారము ఆర్ద్ర 4కు43-29 అని తెలియవలసినది.

12000-ను చారగతి విలిప్తలచే పాలుగొనగా వచ్చిన పాదగతి వారాది 5-2-1 దీనిని మీదచూపియుండు చారప్రవేశవారాదియగు 1-43-29-లలో చేర్చగా 6-45-30 దీనినిచూచి బ 9 శుక్రవారం పునర్వ,ప్రథ,కుజః 45 30అనిసులభముగ తెలిసెను అదే విధమున 6-45-30-లకు మరల 5-2-1-ని కలుపగానైన 4-47 31-ని చూచి బ 13 బుధ, పున 2 కు 47-31 అని తెలియుచున్నది.

మఱియూ నీ మీదిక్రమమునకు విపరీతముగ గణించి వర్తమాన పాదప్రవే కాలములనూ లెక్కించుకొనవచ్చును.

ఉదా,, ఆర్ద్ర 4 కుజః అనుచారప్రవేశకాలవారాదియగు 1-43-29 లలో పాద గతియగు 5-2-1-ను కలుపుటకు మారుగా తీసివేయగానైనవారాది 3-41-28 దీనినిచూచి పూర్ణిమాకువెనుకటి మంగళవారమున 41-28-లకు ఆర్ద్ర 3-వ పాదమునకు కుజ చారమైయుండునని తెలిసెను.



గమనింపు:— వక్రగ్రహములకు నక్షత్ర పాదప్రవేశములను లెక్కించు నపుడీ మీదిక్రమములకు విపరీతముగ గణింపవలసినది.

ఉదా:— చక్రగ పరిశీలింపుము, స్ఫుటశనిః 10-1-3 ఇందులోతీసివేయు టకు యోగ్యమగు నక్షత్రధ్రువకములలో గొప్పది శ్రవణధ్రువకమగు 9-23-20 దీనిని తీసివేయగా నిలిచిన భాగాది 7-43 ఇది ధనిష్ఠా నక్షత్రమందలి గత భాగాదియగును. గనుక దీనిని లిప్తలు చేయగానైన 463 లను 200చే భాగింపగావచ్చినధనిష్ఠానక్షత్ర మందలి గతపాదములు 2 శేషము 63 ఇది 3-వ పాదమునందలి గతలిప్తలగును. శనికి వక్రత్వముగనుండుటచే 3-వ పాదమునుండియు రెండవ పాదమునకు ప్రవేశమగును. గనుక నీ శేషలిప్తలగు 63-ను 200లో తీసివేయ పనిలేదు దీనినే విలిప్తలుచేసి శనిచార గతివిలిప్తలచే భాగింపగావచ్చిన దినాది 13-18-34 దీనిలోగురువారమునాటి వారసంఖ్య యగు 5ను చేర్చి వారశోధనమును చేయగా నిలిచిన వారాది 4-18-34 దీనినిచూచి బ 13 బుధవారము 18-34లకు ధని-ద్వితి-వక్రశనిః అని తెలిసెను.

రాహుకేతులకునూ నక్షత్ర పాదప్రవేశములను లెక్కించునపుడీమీద చూపియుండు వక్రగ్రహ గణితక్రమము ననుసరించియే గణింపవలసినది.

## సూర్య చారము.

రవికి పాదప్రవేశచారము వేయుటకు వెనుకపంచాంగ సాధనాక్రమము నందు దిన స్ఫుటములే వచ్చియుండుటచే ఆయానక్షత్రపాద ప్రవేశకాలము యావ నాడుగలుగునో దానిని స్థూలముగతెలసి నాటిస్ఫుటగతిని చారగతిగతెలసి దాని మీదచారమును వేయవలయును.

ఉదా:—శు 15 గురువారమునాటి స్ఫుటార్కః 3-9-5-29 దీనిలో 3-3-20 లను తీసివేయగా నిలిచిన పుష్యమీనక్షత్రమందలిగత భాగాది 5-45-29 దీని కలాది 345-29 దీనిని 200-చే భాగింపగావచ్చిన గత పాదము 1 శేషకలాది 145-29 దీనిని 200 లిప్తలలో తీసివేయగా 54-31 దీనిని విలిప్తలుచేసి నాటి స్ఫుటగతియగు 57-3-ను విలిప్తలు చేయగానైన 3423-చే భాగింపగావచ్చిన దినాది 0-57-20 దీనికి గురువార సంఖ్య 5-ను కలుపగానైనచారప్రవేశకాలవారాది 5-57-20 అనగా నేడుదయాది 57-20-లకు పుష్యమీతృతీయే అర్కః అని తెలిసెను.

గమనింపు:—దినాది 3-20-0-లు రవికి స్థూలముగాపాదగతియగును గనుక దీనిని అతనిపాదప్రవేశస్ఫుటవారాదులకువరుసగా చేర్చుకొనుచుండిన ఏష్యపాదప్రవేశ కాలము స్థూలముగా తెలియుచుండును నాటిరవిస్ఫుటమును బట్టి మీదిక్రమముగనే స్ఫుటీకరించుకొనవలసినది.

ఉదాహరణము.

పుష్య 3 ర్క్ష దీనివారాది 5-57-20 దీనికి 3-20-0-లను చేర్చగాసైన ఏష్య పాదము పుష్య 4-వ పాదప్రవేశకాలవారాది 2-17-20 ఇది సోమవారమునాడుద యాది 17-20-లను స్థూలముగాసూచించుచున్నది గాన నాటిరవిస్ఫుట స్ఫుటగతులను బట్టి మీదిక్రమముగనేస్థిరీకరింపగాసైన చారప్రవేశకాలవారాది 2-27-32 దీనిచే కృ 4 సోమ పుష్య 4 ర్క్ష 27-32 అని తెలిసెను.

ఇందొచ్చియుండిన స్ఫుటవారాదియగు 2-27-32-లలో నరల 3-20-0-లను కలుపుకొని వెనుకటివలెనే స్ఫుటీకరింపగా దాని కవతలి నక్షత్రపాద ప్రవేశకాల వారాదియగును.

ఈ క్రమముగనే సన్నిగ్రహములకును పాదప్రవేశచారములను తెలియ వచ్చును.

అథ కుజాది తారాగ్రహాణాం.

వక్రవక్రత్యాగోదయాస్త ధ్రువక రాశ్యాదయః

మూలం. గ్రంథాంతరే

పంచాగ్నిరూపై ర్యుగబాణపక్షైః వేదార్థభాక్షైర్గిరిరూపకైశ్చ ।
గుణాగ్ని నేత్రైశ్చలకేంద్రభాద్యా ర్వక్రత్వమాయాంతి కుజాదిఖేటాః ॥
వ్యోమాష్టనేత్రైః రసబాణదస్రైః పూర్ణాంబురూపై రసపావకైశ్చ ।
పూర్ణాద్రిచంద్రైశ్చలకేంద్రభాద్యాః ప్రాచ్యాం కుజాద్యా ముదయం ప్రయాంతి ॥
దిక్పూర్ణచంద్రై శ్శివతర్క భాద్యాః ప్రాగస్తగాసౌమ్య సితాచ ఖేటాః ।
న్యగోదయాస్త్వచలకేంద్రభాద్యా శ్శోధ్యంతు చక్రేవ్యతిరిక్త మాహుః ॥





| గ్రహములు | వక్రధ్రువరాశ్యాది | | వక్రత్యాగ ధ్రువరాశ్యాది | | పూర్వోదయధ్రువరాశ్యాది | | పశ్చిమాస్త ధ్రువరాశ్యాది | | పశ్చిమోదయధ్రువకరాశ్యాది | | పూర్వాస్త ధ్రువకరాశ్యాది | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కుజునికి | 5 | 13 | 6 | 17 | 0 | 28 | 11 | 2 | | | | |
| బుధునికి | 4 | 25 | 7 | 5 | 6 | 25 | 5 | 5 | 1 | 20 | 10 | 10 |
| గురునకు | 4 | 5 | 7 | 25 | 0 | 14 | 11 | 16 | | | | |
| శుక్రునకు | 5 | 17 | 6 | 13 | 6 | 3 | 5 | 27 | 0 | 24 | 11 | 6 |
| శనికి | 3 | 23 | 8 | 7 | 0 | 17 | 11 | 13 | | | | |

కుజాదుల స్ఫుటకర్మముల యందొచ్చియుండు వారివారిసంత్య శీఘ్రకేంద్రములు నీ మీదచూపియుండు వారివారి వక్రాదిధ్రువకములకు మించియుండిన ఎడల నాయాగ్రహములాయాగతిని పొందియుండెదరని భావము.

ఉదా:—శనికి సంత్య శీఘ్రకేంద్ర రాశ్యాది 5-11-13 ఇదివతని వక్రారంభ ధ్రువకమగు రాశ్యాది 3-23 లకు మించి వక్రత్యాగ ధ్రువకమగు రాశ్యాది 8-7 లకు తగ్గియుండుటచే వక్రగతిని పొందియుండునని తెలిసెను.

ఈ విధముగనే వారివారి అస్తోదయ ధ్రువకములచేతనూ వారివారి నస్తోదయ గతులనూ హింపవగును.

తత్తత్కాలసాధనాక్రమః.

శ్లో॥ ధ్రువస్యాంతర రాశ్యాది కలీకృత్యాద్గతైష్యయోః ।
క్రమాదంత్యశ్చలాత్కేంద్రగత్యాప్తంస్యాద్దినాత్మకం ॥

స, తా॥ ఆయాగ్రహములయొక్క వక్రాది ధ్రువకములకంటెను వారివారి సంత్య శీఘ్రకేంద్రములు తగ్గియుండునపుడా ధ్రువకములలో సంత్య శీఘ్రకేంద్రములను తీసి వేయగా నిలుచు శేషమును విలిప్తలుచేసి అయిన దానిని వారివారి సంత్య శీఘ్రకేంద్ర గతి విలిప్తలచే భాగించి దినాది ఫలమును తీసికొనగా ఆయాగ్రహములకు వక్రాది కాలములగును. (ఇది ఏష్యఫలము).

అందు ధృవములకంటెను అంత్య శీఘ్రకేంద్రములుమించియుండునపుడు కేంద్రములో ధృవకమును తీసివేసి మీదిక్రమముగనె గణింపగా గతఫలదినాదియగునని తెలియవలసినది.

గమనింపు:—ఎప్పుడైననూ నిట్టిగణితక్రమమునందలి దినసంఖ్య పక్షదినముల కంటెను మించియుండునపుడు అట్టికాలమును స్థూలముగనెరిగి తత్కాలమునకు సమీపించి (పక్షదినములకుతగ్గి) యుండు గ్రహస్ఫుటములయందలి నంత్య శీఘ్ర కేంద్రములనుండియు నీ మీదిక్రమముగ నేమరలగణించి స్థిరీకరింపవలయును.

ఉదా:—శుక్రునకు పూర్వాస్తధృవక రాశ్యాది 11-6 లో నతని అంత్య శీఘ్ర కేంద్రమగు 9-17.3లను తీసివేయగానిలిచిన రాశ్యాది 1.18-57 దీనివిలిప్తలు 176220 దీనినతని నంత్య శీఘ్ర కేంద్రగతియగు 38-59 ని విలిప్తలుచేయగానైన 2339 చేతభాగింపగావచ్చిన దినాది 75-20-24 అనగానెడుదయాది 75-20-24 లకు శుక్రుడుప్రాగస్తమితుడగునని తెలిసెను. అయితే ఇంవలి దినసంఖ్య పక్షదినములకంటెనుమించియుండుటచే నాకాలమునకుచేరియుండు పక్షగ్రహస్ఫుటమునందలి నంత్య శీఘ్ర కేంద్రమునుండియు నీ మీదక్రమముగనె ప్రాగస్త కాలమును స్థిరముగాకని పెట్టవలయును.

గతఫలకాలికోదాహరణము.

బుధాంత్య శీఘ్రకేంద్రము 8-2-0 దీనిలోనతనివక్రత్యాగ ధృవకమగు రాశ్యాది 7-5 ను తీసివేయగా నిలిచిన భాగలు 27 దీనిని అతని నంత్య శీఘ్రకేంద్రగతిచే భాగింపగా (సవర్ణించి) వచ్చిన దినాది ఫలము 8-49-28 ఇది గతఫలమగుటచే నేడుదయాత్పూర్వము 8-49-28 లకు అనగా 8-49-28 లకు1 -49 28 వచ్చును దీనిని గురువారమగు 5-0-0 లలో తీసివేయగా నిలిచిన 3-10-32 లను చూచి మంగళవారమునాడుదయాదిగ 10-32 లకు బుధవక్రత్యాగమైయుండునని తెలిసెను.

అథ క్రూరగ్రహాక్రాంత నక్షత్రనిర్ణయః.

తా॥ బుధ గురు శుక్రులుదప్ప తక్కినగ్రహములలో నెవరుగానీ నాటిదిన నక్షత్రముతోగూడియుండెరేనిక్రాంతమని చెప్పబడును. (ఇందుకు క్రాం అనిసంజ్ఞయగు)



ఉదా:—కృ॥ ద్వి॥ శనివారంనాటి నక్షత్రమగు ధనిష్ఠానక్షత్రములో శని గ్రహముచేరియుండుటచే నాడు శనిక్రాంత నక్షత్రమని తెలియవలసినది శక్రాం,,

ఆదేవిధమున కృ॥ ప్రతి॥ శుక్రవారమున రాహుసంచార నక్షత్రమగు శ్రవణ నక్షత్రమగుటచే రా. క్రాం, మగును,,

పంచశలాక వేధా నక్షత్రములు.

తా॥ కృత్తివిశాఖలు,, అభిజిద్రోహిణులు, మృగ,, ఉపాలు,, ఆరి, పూపాలు,, పున,, మూలలు,, పుష్య జ్యేష్ఠలు,, ధనిష్ఠాశ్లేషలు,, మఘశ్రవలు,, పుబ్బాశ్వినులు,, రేవత్యుత్తరలు,. హస్తోత్తరాభాద్రలు,, చిత్త పూభాలు,, స్వాతి శతలు అనూ భర,, ఈ నక్షత్రములు పరస్పరముగ ననగా నొకటికొకటి పంచశలాక వేధను బొందియుండును.

సప్తశలాక వేధా నక్షత్రములు.

తా॥ కృత్తి శ్రవణములు,, అభిజిద్రోహిణులు,, ఉషా,, మృగలు, పూషా, ఆరుద్రలు, మూలపున, పుష్య జ్యేష్ఠలు,, ఆనూరాధాశ్లేషలు,, మఖాభరణులు, పుబ్బాశ్వినులు,, రేవత్యుత్తరలు,, హస్తోత్తరాభాద్రలు,, పూభా, చిత్తలు,, స్వాతీ, శతభిషలు, విశాఖాధని.....లు., ఈ నక్షత్రములు మీదిక్రమముగనె సప్తశలాక వేధను పొందియుండునని తెలియవలసినది.

గ్రహవేధసంజ్ఞా.

తా॥ నిత్య నక్షత్రమునూ గ్రహస్థిత నక్షత్రమునూ పరస్పరముగ నీమీద చూపియుండు పంచశలాక వేధను గానీ లేక సప్తశలాక వేధనుగానీ పొందియుండెనేని నాటి నక్షత్రమున కాగ్రహవేధగలిగియుండునని తెలియవలసినది.

ఉదా:—కృ,, 30 లు నాటి ఆశ్లేషా నక్షత్రమునూ శనిస్థితమగు ధనిష్ఠా నక్షత్రమునూ పరస్పరముగ పంచశలాకవేధను పొందియుండుటచే నాటి నక్షత్రమునకు శనివేధగలిగియుండును గనుక శవే,యని తెలియవలసినది.

ఆదే విధమున కృ॥ ద్వితి శనివారమునాటి ధనిష్ఠా నక్షత్రమునూ కేతువుతో చేరియుండు ఆశ్లేషా నక్షత్రమునూ వేధను పొందియుండుటచే నాడు కేవే, యగునని తెలిసిను,,

## అథ దినభుక్తి విచారః

శ్లో॥ కలీకృత్య గతాంశాది స్వోదయఘ్నార్క తాడితాః ।
విభజేద్రాశిలిప్తాభి ర్దినస్యాద్భుక్తి సర్వదా॥

స॥తా॥ స్ఫుటార్కునియందలి భాగాదిని సవర్ణోత్తరలిప్తలుచేసి దానిని సూర్యుడుండే స్వదేశ రాశి ప్రమాణవినాడికలచే పెంచి వచ్చిన మొత్తమును 1800చే భాగింపగా వచ్చు వినాడికలే నాటికి దిన భుక్తి యగును.

అందు రవి స్ఫుటగతిని సూర్య రాశి ప్రమాణ వినాడికలచే పెంచి 1800 చే భాగింపగా వచ్చు వినాడికలు భుక్తి గతియగును గనుక దానిని దినభుక్తులలో క్రమముగ కలుపుకొనుచూ వరుసగా పక్షాంతము వఱలో దినభుక్తులను సులభముగా వ్రాయవచ్చును.

అందొక దినమునకు పూర్ణ లబ్ధమునూ నింకొక దినమునకు సవర్ణోత్తర లబ్ధమునూ వరుసగా చేర్చుకొనుచుండ వలసినది.

### ఉదాహరణము

శుద్ధ 15 నాటి స్ఫుటరవిః 3-9-5.29 గతిః 57-3 ఇందలి రాసులను వదలి వేయగా నిలిచిన భాగాది 9-5-29 దీనిసవర్ణోత్తర లిప్తలు చేయగానైన 515 ను సూర్య రాశి ప్రమాణమగు కటక రాశి ప్రమాణ విఘడియలు 332 చే పెంచి వచ్చిన దానిని 1800 చే భాగింపగా వచ్చిన సవర్ణోత్తర లబ్ధ వినాడికలు 101 దీని ఘటికాది 1-41 ఇది నేడుదయాత్పూర్వము కటక రాశిలో గతించిన భుక్తఘటికాదియగును.

రవిస్ఫుట గతి లిప్తలను సూర్యరాశి ప్రమాణముచే పెంచి 1800 చే భాగింపగా వచ్చిన పూర్ణలబ్ధము 10 అర్థోత్తరము 11 ఇది భుక్తిగతి వినాడికలగును గనుక 1-41 లో 11 ను చేర్చగానైన రెండవదిన భుక్తి 1-52 దీనిలో 10 ను చేర్చగానయిన 3 వ దినభుక్తి 2-2 దీనికి మరల 11 ను చేర్చగానయిన 4 వ దిన భుక్తి 2-13 దీనికి మరల 10 ని చేర్చగానయిన 5 వ దినభుక్తి 2-23 ఈ క్రమముగనే నొకదినమునకు అర్థోత్తర లబ్ధమునూ మరొక దినమునకు పూర్ణ లబ్ధమునూ వరుసగా చేర్చుకొను చుండ వలయును.



శ్లో॥ మిథునేష్టాదశేభాగే కన్యాయాంతు చతుర్దశే ।
షడ్వింశే ధనుషీభాగే మీనేద్వావింశయస్మృతః॥

తా॥ సూర్యుడు మిథున రాశియందలి 18 భాగలోనూ కన్యయందు 14 వ భాగలోనూ ధనుస్సున 26వ భాగలోనూ మీనమున 22 వ భాగలోనూ ప్రవేశించి యుండునపుడు షడశీతి ముఖముతో ప్రకాశించు చుండునని తెలియవలసినది.

అందు సూర్యుడు మేష కటక తులా మకర రాసులను ప్రవేశించునపుడు విషువత్పుణ్యకాలమనియూ మిథున కన్యా ధనుర్మీనరాశి ప్రవేశకాలములయందు షడశీతి పుణ్యకాలమనియూ తక్కిన రాశి ప్రవేశకాలములయందు హరిపద పుణ్య కాలమనియూ చెప్పుదురు.

### మేషాద్యాయననిర్ణయము:

వాక్యం॥ సాయనార్కాద్రాశి భుక్త మేషాద్యాయన సర్వదా॥ స్ఫుట సూర్యునికయనాంశలను చేర్చగా సాయనార్కుడనబడును. అట్టి సాయనార్కుడు మేషాది రాసులను ప్రవేశించుకాలమే అయన ప్రవేశకాలమనియూ, స్ఫుటసూర్యుడు మేషాదిరాసులను ప్రవేశించుకాలమే సంక్రమప్రవేశకాలమనియూ తెలియవలసినది.

### అగస్త్యాస్తమయోదయ ధృవకాః

గ్రంథాంతరే ॥ వృషభేష్టాదశే భాగే సూర్యలిప్తాస్తమానకం ।
సింహేబాణాంశముదయ మష్టచత్వారి లిప్తిచ ॥

అన్యచ్చ॥ అగస్త్యస్తమయం ప్రాహుస్సప్తశైలైర్మనిషిణః ।
ఉదయంగిరినంద్రైశ్చ స్ఫుట సూర్యేసమాంశకైః ।
స్వదేశాక్ష ప్రభాఘ్నష్టా హీనయుక్తాస్తదంశకైః ।
అగస్త్యస్తమయాం శాస్య రుదయాంశాత్స్వదేశజాః ॥

---

తా॥ సూర్యస్ఫుటము 1-18.12 లవ మించినపుడు అగస్త్యాస్తమను 4-5-48 లవ మించినపుడు అగస్త్యోదయమునూ గలుగునని కొందరును స్వదేశ విషువచా

యను 8, ట గుణించి వచ్చిన దానిని *భాగాదిగ తెలిసి అగస్త్యాస్త ధ్రువభాగలగు 77-లలో ఋణమును అగస్త్యోదయ ధ్రువభాగలగు 97-లలో ధనమును జేసికొనగ స్వదేశమునకు అగస్త్యాస్తమయోదయ కాలమునకు సూర్యస్ఫుట భాగలగునని కొందరును తెలియజేసియుండెదరు.

అథ తిథినిర్ణయః గ్రంథాంతరే,,

శ్లో॥ అహ్నో ద్యూంశం ద్విధా వేద నిఘ్నాత్పూర్వతిథింత్యజేత్ ।
త్రిఘ్నంపరతిథే శ్శేష్యం అధికం యత్ర సామతా ॥
సమత్వేతు తథైవాసా మపరాహ్ణవ్యాపినీయది ।
క్షీయ్యమాణేతు పూర్వేవ వర్ధమానేతువై పరా॥

తా॥ అహః ప్రమాణముయొక్క పంచమాంశమును రెండు ప్రతులుంచి యందొక దానిని 4-చే పెంచివచ్చిన మొత్తమగు అపరాహ్ణాంత కాలములో పూర్వదిన తిథిప్రమాణమును తీసివేయగనూ; మరియొక దానిని 3-చే పెంచినచ్చిన మొత్తమగు అపరాహ్ణాది కాలమును పరదిన తిథిప్రమాణములో తీసివేయగనూ; నిలుచు ద్వివిధ శేషములలో యావనాటి శేషమధికముగ నిలిచియుండునో నాటి దినమే పరతిథియగునని తెలియవలసినది.

అందపరాహ్ణ వ్యాప్తియను నారెండు శేషములునూ సమముగ నిలిచియుండు నపుడా రెండు దినములలో పూర్వదినము నాటి చంద్రస్ఫుటగతికంటెను మరునటి దిన చంద్రస్ఫుటగతి మించియుండునపుడు తిథికి క్షయగతియనియు గగ్గియుండునపుడు వృద్ధిగతియనియూ తెలిసి క్షయగతిలో పూర్వదినమునను వృద్ధిగతిలో నపరదినము ననూ తిథినిర్ణయమును జేయవలయును.

లేక గతతిథిప్రమాణము నరువది ఘడియలలో తీసివేసి నిలిచిన దానికి ఏష్య తిథిప్రమాణమును జేర్చి పంచాంగము మీద బుక్తాద్యన్త సాధనమువలెనే గతైష్య తిథ్యాద్యన్తములను దెచ్చుకొని వానినుండియు తిథిక్షయ వృద్ధిగతులనూహించు కొనవచ్చును.

---

* దీనిని కొందరు కలాదిగ భావించెదరు, అదిమూల సూత్రార్థమునకు విపరీతమగునని తెలియవలెను.



*N.B.* కొందరు సిద్ధాన్తకారులే సుదయాది తిథిఘటికలను బట్టి పూర్వాపరదినములయొక్క తిథిగతిని చింతించెదరు. తిథ్యాద్యంత మహోరాత్రాంతర భేదములచే నావిధిక్రమము సూత్రార్థమునుండియు నిషేధింపబడుననుటనుగూర్చి సి. ర. అ. 5, శ్లో 20,, తిథ్యాద్యన్తం ఘటీమానం.......క్షయవృద్ధిః క్రమాత్తిథిః॥

ఉదా:—కృష్ణ ప్రతి, శుక్రవారమునాటి తిథిప్రమాణము 24-35,, ద్వితియ్యా శనివారమునాటి తిథిప్రమాణము 18-31,, ఇందు ద్వితియ్యాతిథి ఏనాడగునో దానిని తెలియుటకు, నాటి అహస్సునయిదు భాగములుచేయగా వచ్చున ఘటికాది, 6-19 దీనిని 4-చే గుణింపగా వచ్చిన నపరాహ్ణాంతకాలము 25-16,, 6-19-లనె త్రిఘ్నింపగా నయిన నపరాహ్ణాదికాలము 18-57,, ఇందు ప్రతిపద్ఘటికాదియగు 24-35 లను అపరాహ్ణాంతకాలములో తీసివేయగా నిలిచిన శేషము,, 0-41,,

అపరాహ్ణాదికాలమగు 18-57 లను ద్వితియ్యా తిథిలో తీసివేయుటకేపోదు గనుక నాటి నపరాహ్ణాదికాలమునకే ద్వితియ్యాతిథి వ్యాప్తి లేదని తెలసి పరతిథియగు ద్వితియ్యాతిథి శుక్రవారమేయగునని నిర్ణయింపవలసినది.

చాంద్రిమానార్ఘః.

తా॥ అశ్వి, కృ, మృ, పుష్య, మ, పుబ్బ హ, చి, అనూ, మూ, పూషా శ్ర, ధని, పూభా, రేవ, ఈ నక్షత్రములలో చంద్రోదయమయిన సమార్ఘమనియు, భర, జ్యే, ఆశ్లే, ఆరు, శత, స్వా, వీనిలో చంద్రోదయమయిన శూన్యార్ఘమని యు తక్కిన నక్షత్రములలోనయిన నత్యర్ఘమనియూ జెప్పబడును.

సౌరమానార్ఘః.

తా॥ సంక్రమణ కాలమందలి శుక్లప్రతిపదాది తిథిసంఖ్యయునూ భాను వారాది వారసంఖ్యయునూ అశ్విన్యాది నక్షత్ర సంఖ్యయునూ వట్టుచేర్చి 3-ట భాగింపగానిలుచు శేషము వరుసగా నత్యర్ఘసమార్ఘశూన్యార్ఘములను సూచించును.

## చంద్రశృంగము.

శ్లో॥ మీనమేషోదయశ్చంద్రః సతతం దక్షిణోన్నతః ।
శేషముత్తరతశ్శృంగీ సమంతు వృషకుంభయోః ॥
అన్యచ్చ॥ ఆర్ద్రాదిషోడశర్క్షేషు ముత్తరశ్శృంగతశ్శశీ ।
శ్రవణాత్పంచ నక్షత్రే దక్షిణశ్శృంగమేవచ ।
రేవత్యాత్షట్సు ఋక్షేతు సమశృంగం ప్రకీర్తితాః॥ తా॥ స్పష్టం॥ *

## అధిమాస నిర్ణయము.

బాలాదిత్యః॥ అర్కసంక్రాంతి రహిత శ్చాంద్రమాసోధికస్మృతః ।
ద్విసంక్రాంతి యుతశ్చైవ క్షయమాసః ప్రకీర్తితాః ॥

తా॥ యావచాంద్రమాసమునందు ( చైత్రాదిమాసములు ) సంక్రాంతి శూన్యమగునో ననగా సౌరమాసాంభముగలుగదో ( సూర్యరాశిచలనములేదో ) నామాసమధికమనియూ యావచాంద్రమాసమునందు సౌరమాసారంభద్వయమగునో నామాసము క్షయమనియూ చెప్పబడును.

## ఉపరితిథ్యాది ప్రమాణ నిర్ణయం.

తా॥ తిథిప్రమాణ లిప్తలగు 720 ని విలిప్తలుచేసి తిథిగతి లిప్తలచే భాగింపగా ఉపరితిథి ప్రమాణ ఘటికాదియునూ నక్షత్రప్రమాణకలలగు 800 ను విలిప్తలు చేసి చంద్రస్ఫుటగతి లిప్తలచే భాగింపగా నుపరి నక్షత్రాద్యంత ప్రమాణ ఘటికాదియునూ ఉపరి తిథిప్రమాణము నర్థింపగా నుపరి కరణప్రమాణ ఘటికాదియునూ యోగప్రమాణకలలగు 800 ను విలిప్తలుచేసి యోగగతి లిప్తలచే భాగింపగాను పరి యోగప్రమాణమునూ తెలియును.

---

*అమావాస్యా శుక్లప్రతి పత్తులయందొకనాటి అస్తకాలవ్యర్కేందువయినది 8 భాగలకు కొంత హెచ్చు తగ్గులుగ సమీపించియుండినచో నా రెండవ దినమున సూక్ష్మచంద్రోదయమునూ మించియుండిన స్ఫుట చంద్రోదయమునూ గలుగునని స్థూలముగ తెలియవచ్చును.



తా॥ స్ఫుటార్కుడు 0-20-0-0 లకు మించినపుడు వాస్తుకర్తరీప్రవేశమై 1-13-20-0 లకు మించినపుడు వాస్తుకర్తరీత్యాగమగుననగా భర 3 ర్కః వాస్తుకర్తరీ ప్రవేశః,, రోహి 2 ర్కః వాస్తుకర్తరీత్యాగః అనిచారమగును.

## అపమాదయః.

తా॥ ఉపరి తిథికి అపమాహమనియూ 3 దినములలో నొకతిథి వ్యాపించియుండిన త్రిద్యుస్పృక్కనియూ రెండుతిథులొకేదినమున చేరియుండిన తిథిద్వయమనియూ తిథిశూన్యమయిన శూన్యతిథియనియూ చెప్పబడును.

## అగ్నినక్షత్రం.

వాక్యార్థము,, సూర్యుడు కృత్తికా నక్షత్రమునకు ప్రవేశించు దినమున అగ్నినక్షత్రమని ద్రావిడ సిద్ధాంతము.

గమనింపు.—ఈ మీదచూపియుండు సిద్ధాంత గణితక్రమములచే నిదివఱకు తిథ్యాదులను గణించుకొని తరువాతనీగ్రంథస్థ ద్వితీయభాగమునందలి నిర్ణయములచొప్పున తిథ్యాదులచే నేర్పడు యోగఫలములను నిర్ణయింపవలసినది. అందులో నీ మీద చూపబడియుండు గణితక్రమములచే నింతవఱకు పంచాంగమున్ వ్రాయవచ్చుననుటను గురించి నీ క్రిందపత్ర దినములకొక యుదాహరణమిచ్చుచున్నాడను. గనుక దానిని మీది క్రమములచే మరల గణించి గణిత సాంప్రదాయిక మర్మములను పరిపాల్చి చూచి దానిక్రమములుగనే కావలసినన్ని దినములకు పంచాంగములను గణించి తక్కినతిథ్యాదులచే నేర్పడు యోగఫలములను ఈ గ్రంథముయొక్క ద్వితీయ భాగమునుండియూ గ్రహించి ఇష్టముండినవారలు స్వస్వదేశీయములకు పంచాంగ కర్తలు కావచ్చునని విన్నపించుచూ దాని ఉదాహరణమును వ్రాయబడియె.

ఉదా॥ కలిగ్గతము 5035 భావ సం। ఆషాఢమాసము

గురు=పూర్ణి 30-48 ఉషా 32-34 విష్కం 7-54 భ 3-49 రావి 10-16 త్యా ప్ర 3-44 ప్యత్ప ర్కః 57-20 ప్న ద్వి బు 55-32 అహః 31-36 భుక్తి 41-41 ( గ్రస్తోదయ సోమోపరాగః స్పర్శం 25-55 మధ్యం 29-20 మోక్షం 33-17. )

శుక్ర=కృ, ప్రతి 24-35 శ్రవ 28-20 ప్రీ 0-15 కౌల 24-35 రావి 6-4 త్యా 3-45 అమృ 4-12 రాక్రాంతిథిద్వయం అహః 31-36 భు 1-52.

శని॥ద్వి 18-31 ధని 24-19 సౌ 45-9 గర 18-31 రా 9-41 త్యా 3-46 అ్ర 0-5 శక్రాంకేవే త్రితృశు 38-20 అహః 31-34 భు 2-2.

భాను=తృ 12-50 శత 20-41 శో 38-5 భద్ర 12-50 రా 4-19 త్యా 3-48 అ్ర 3-51, 58-4', త్రిచతు-శు 43-29 పునత్రి బు 29-46 దినం 31-34 భుక్తి 2-18

సోమ=చ 7-41 పూభా 17-34 అతి 31-33 బా 7-41 రా 9-10 త్యా 3-52 పుష్య చతుర్కః 27-32 దినం 31-32 భుక్తి 2-23.

మంగ=పం 3-14 ఉపరిఘ 55-58 ఉభా 15-14 సుక 25-42 తైతు 3-11 రా 13-8 త్యా 3 55 అమృ 3-50 అనమూహః త్రిచతుశు 25-0 దినం 31-30 భు 2-34

బుధ=స 56-41 రేవ 13-50 ధృ 20-37 భద్ర 28-11 విష ఘటికాభావః అ్ర 8-10; 55-47 పున చతు బు 4-0 దినం 31-30 భు 2-44.

గురు=అ 55-16 అశ్వి 13-25 శూ 16.22 బాల 26-12 దివి 3-46 త్యా 3-59 రావి 6-25 త్యా 4-5 అల్ప్రసర్కః 57-26 మహావ్యతీపాతప్రవేశః 17-9 నిర్గమః 32-19 దినం 31-28 భు 2-55.

శుక్ర=నవ 55-8 భర 14-15 గం 13-6 తై 25-28 రావి 13-59 త్యా 4-9 అ్ర 2-20 పునప్రశు 45-30 పునప్రశు 11-40 పుష్యప్రబు 38-14 దినమానం 31-26 భుక్తి 3-5

శని=దశ 56-13 కృ 16-14 వృ 10-48 వణి 25-55 రావి 27-10 త్యా 4-14 అమృ 10-20 దినం 31-24 భు 3-16.

భాను=ఏ 58-36 రో 19-31 ధృ 9-31 బవ 27-42 శేషత్యా 2-48 రావి 3-11 త్యాప్ర 4-18 అ్ర 11-16 పునద్విశు 58-20 దినం 31-24 భు 3-26.

సో=ద్వా 60-0 మృగ 23-54 వ్యా 9-8 కౌల 30-36 రావి 15-27 త్యా 4-22 అ్ర 0-26 త్రిద్యుస్పృక్ అల్ప ద్వర్కః 27-5 పుష్య ద్వి బు 12-28 దినం 31-22 భు 3-37.

మంగ=ద్వా 2-41 త్రి 29-22 హ 9-41 తైతు 2-41 త్యాజ్యా భావఃఅమృ 13-1 దినం 31-20 భు 3-47



బుధ=త్రయో 7-2 పున 35-30 వజ్ర 10-48 వణి 7-2 దివి 2-26 త్యా 4-24 రా 26-22 త్యా 4-27 అ్ర 29-58 కుక్రాం ధని ద్వివ, శ 18-34 పున తృశు 45-0 పునద్విశు 47-31 పుష్య తృబు 46-42 దినం 31-18 భు 3-58.

గురు=చతుర్ద 11-58 పుష్య 41-45 సిద్ధి 12-21 శకు 11-58 శేష 2-7 అమృ 24-15 అల్ప తృర్కః 56-24 దినం 31-18 భు 4-8.

శుక్ర=అమా 17-2 అల్ప 48-42 వ్యతీ 14-1 నాగ 17-2 దివి 17-15 త్యా 4-28 అ్ర 43-53 రక్రాంకే కాత్రింశవే దినం 31-16 భు 4-19 గ్రహణాభావః.

## ఇతి శ్రీ సిద్ధాంత రహస్యే గ్రహతంత్రే పంచాంగాద్యానయనా ధ్యాయోనామశ్చతుర్థః.

### అథ త్రిః ప్రశ్నాధ్యాయప్రారంభః (గణకానందే).

శ్లో॥ యఃకర్మసాక్షీభగవాన్ యోవేదప్రతిపాదితః ।
తమాశ్రయే సదామోహ తమోరాశినివృత్తయే ॥

మూ॥ మేషాయనదినే కర్కస్య తులాయనదినేపివా । స్వదేశాక్షప్రభాస్వాధ్యా ద్వాదశాంగుళ శంకునా । సమీకృతశిలాయాంవా సమభూమితలేపివా । ఇష్ట శంకోః ప్రమాణేన విలిఖేద్వృత్తమండలం । వృత్తమధ్య స్థితస్యాస్య శంకోః పూర్వాపరాహ్ణయోః । ఛాయాగ్రం యత్రవిశతి వృత్తం తత్రవిముంచతి । వృత్తే ప్రాక్పశ్చిమస్థాన ర్వయే బిందూకృతౌయది । పూర్వాపరాఖ్యౌతౌస్యాతాం వక్ష మాణానుసారతః । పూర్వబిందుం సమారభ్య శంకు మూలస్యయత్నతః । కర్కటేస్య సంలిఖేదర్ధ చంద్రవ ద్వలయంతతః । పశ్చాద్బిందుం సమారభ్య వలయం చంద్ర ఖండవత్ । శంకుదీర్ఘ ప్రమాణేన కర్కటేనైవ సంలిఖేత్ । కేంద్రీకృతప్రాగపర బిందోర్వలయ యోగతః । మత్స్యాకృతి ర్భవేదేత ద్వృత్తమండలమధ్యగా । తన్మత్స్య పుచ్ఛముఖయోర్మధ్యతో వృత్తమండలం । ప్రాప్యమేకాం లిఖేద్రేఖాం

సమయామ్యోత్తరాన్వితాం। వృత్తసంయోగయోర్మ్యోద గ్రిఖాగ్రిబిందుచిహ్నితే। తేకేంద్రీకృత్యవలయ ద్వితయం విలిఖేత్సుధీః। వలయద్వితయస్యాస్య సంయోగాన్మ, త్స్య సంభవః। మత్స్యమధ్యే విలిఖితౌ రేఖా పూర్వాపరాభిదా। ఏవం దిక్సాధనం కృత్వా పూర్వోక్త విషువద్వయోః। దినార్ధ సమయే శంకుం దిఙ్మధ్యేతు వినిక్షిపేత్। యామ్యోత్తరాయాం రేఖాయాం శంకోరుత్తరయామ్యతః॥
యస్మిన్దేశేయా ప్రదృష్టా ఛాయాతత్రాక్షభాభవేత్॥ ఇతి సూర్యః॥

సిద్ధాంత విద్వచ్ఛిఖామణులనెల్లరికినీ వి॥ లు॥

ఆర్యమహాశయులారా॥

ఈ త్రిః ప్రశ్నాధ్యాయమునందు మొట్టమొదట కొంతవఱకు శంకుస్థాపన దిక్సాధన విషువచ్ఛాయా సాధనాదులం జెప్పబడియుండుటచే నిక్కాలపు గ్రంథ కర్తలలోననేకులా విషయమును గురుముఖంబుగ తెలిసికొనవలసినదని పెద్దపెద్ద యక్షరములలో స్ఫుటముగవ్రాయించెదరుగానీ పీఠికయందు మాత్రి మీగ్రంథ రాజము గురువుతోనగత్యములేనిది! కల్పవృక్షాయమానమైనది!! యనునీమొదలగు వాక్యములను మాత్రము వదలలేదు.

మఱియూ గ్రంథవిస్తరభయముచే టీక వ్రాయబడదనియూ! ఈ విషయము సర్వులకూ నుపయుక్తములేనందునటీకింపబడదనియూ!! ఈ గణితము సరివచ్చుట లేనందున తాత్పర్యము చూపబడదనియూ!!! అచ్చటచ్చట సుకపముతో వ్రాయించెదరు.

అయితే అట్టి గ్రంథవిస్తర భీతిగలవారలేమికారణముచే పనికి మాలి యుండు శ్లోకములను మాత్రమువ్రాసి తమపాండిత్యమును వెదజల్లెదరో............

గనుక నేనునూ నా విషయమునుగూర్చి విప్పిచెప్పుదునని వ్రాయనారంభించుటకు సంకోచపడియుండినను ఆ విషయము సర్వులకు నుపయుక్తముగనుండుటచేతనూ మర్మముగ నిలిచి శిథిలమైపోయియుండుటచేతనూ తెలియగోరువారికి బాధ గురువులే దప్ప బోధగురువులగుబడకుండుటచేతనూ నా నల్పమతికి తగినట్లు తాత్పర్యోదాహృతములను సవర్ణింపుతో వ్రాయబూనితిని గనుక అందు నాపొరబాటు వలనగానీ మరియేనితర గారణములచేతగానీ తప్పితములేమైనను గలిగియుండినంతట వాటినన్నిటినీ లెక్కగొనక క్షమించి తెలియజేయవలయుననిగోరెడి.

సుజన విధేయుడు. [ గ్రంథకర్త ]



స॥తా॥] మేషాయన దినమునందుగానీ లేక తులాయన దినమునందుగానీ నీ కింద జెప్పబోవు విధముగ శంకుస్థాపనచేసి దిక్సాధనములలో నగువానిని సాధించి యుంచుకొనవలసినది.

## శంకుస్వరూపము.

12అంగులముల పొడుగునూ దానియడుగుభాగమునందలి నడ్డకొలక(వ్యాసము= డయామ్ నేటరు ) రెండంగులములునూ యుండునట్లు గుండ్రమునగా రూలర్= రూలువోణ్ణె రూపముగయుండునట్లునూ దాని చివర భాగము ( కొన ) సూదివలెనన గా మైణపువర్తినాకారముసు బోలియుండునట్లునూ మంచిమానియందు నేరముగా జెక్కించబడిన దారువను ద్వాదశాంగుళ శంకువని చెప్పబడును. శంకువు,,




శంకువు ఈ మీది చిత్రమును బోలియుండవలయునని తెలియవలసినది.

## శంకు వృత్త సాధనము.

ఎంతైననూ మంచి విశాలమగు ప్రదేశమున రెండుగజముల చదరముగా మంచి వజ్రగార ( సీమెంట్ )ను జేసి నీరుమట్టమున కనగా నొకటే సమానమగు లెవలుగానుండునట్లు భూమిని సరిపోల్చియుంచుకొని యుండవలయును.

అట్టిస్థలమునందలి మధ్యరాష్ట్రమునందొక సన్నని బిందువు నుంచగానది శంకు మూల మధ్యబిందువనబడును. ఇందు బిందువనగా నొక సన్నని గురుతును తెలియజేయుచుక్క ( ● ) ఇటువంటిది.

దానిని మొదలుబెట్టి నొకయంగుల ప్రమాణముగల తివారముతో ( కంపాసుతో ) నొక వృత్తమును ( గుండ్రముగ ) వ్రాయగానది శంకువృత్తమన బడును.

### ఛాయావృత్తసాధనము.

పైచెప్పియుండు శంకుమూల మధ్యబిందువునే మొదలుజేసి నయిదంగులముల ప్రమాణముగల తివారములో వేరొకవృత్తమును విసరగా నది ఛాయావృత్తమగును.

ఉదాహ.

శంకువృత్తము




(*N. B.* పైగన్న ఛాయా శంకు వృత్తము గుండ్రముగా ఉండవలసినది బ్లాకు దొరకనందున బాదమి ఆకారము వేసినాము.)

వృత్తమనగా గుండ్రముగానుండుసున్నను బోలియుండుచిత్రము.

### ఛాయాబిందు సాధనము.

ప్రాతఃకాలమునందు శంకువృత్త మధ్యమమున నీమీద చెప్పియుండు ద్వాదశాంగుళ శంకువు నుంచుకొనియుండి మధ్యాహ్నమునకు పూర్వమనగా ప్రాక్కపాలమునందలి శంకుచ్ఛాయ ఛాయావృత్తమురెండునూ పశ్చిమదిక్కునసంధించు చోటనగ. శంకుయొక్క నీడకొన ఛాయావృత్తమువందలి పశ్చిమభాగములో సరిగానెందు చేరునోనందొక గురుతునూ అదే విధమున మధ్యాహ్నోత్పరమనగా ప్రత్యక్కపాలమునందలి శంకు చ్ఛాయ ఛాయావృత్తములు రెండును ప్రాగ్దిశయందెందు కలియునో నందొక గురుతునూ యుంచుకొనగా నవిరెండునూ ఛాయాబిందువులగును.



ఇట్లు ఛాయాబిందువుల రెంటినీ సాధించి యుంచుకొనినవెనుక శంకువును వేరుబెట్టి నీక్రింద వ్రాయబోవు 1, 2, 3, విధములలో నే విధముగ నయిననూ దిక్సాధనమును చేయనగును.

### (1) వ విధము.

10 అంగుళముల ప్రమాణముగల తివారముతో ఛాయాబిందువులరెంటినీ వేరువేరుగ మొదలుజేసి రెండువృత్తములను వ్రాయుచూ నారెండు వృత్తములునూ సంధించు చోట్లలో పూర్తి చేయగ నందు దక్షిణోత్తరముఖ పుచ్ఛములుగల మత్స్యమొకటినుద్భవించును. దానిముఖ పుచ్ఛములకు సరిగా నొకసూత్రమును బట్టగా దక్షిణోత్తరదిక్కులు స్ఫుటములగును.

పిమ్మట దక్షిణోత్తర దిశాసూత్ర ఛాయావృత్తములు రెండును పూర్వపశ్చిమ దిక్కులయందెచ్చట సంధించియుండునో నారెండు సంధి స్థానములయందును వేరువేరుగ రెండు బిందువులనుంచగా నవిరెండునూ దిక్సాధన గురుతులగును. వానిరెంటినీ మొదలుబెట్టి మీదిక్రమములుగనే వేరువేరుగ మరల రెండువృత్తములను వ్రాయుచూ నావృత్తద్వయ సంధిలో నిలుపగ పూర్వ పశ్చిమముఖ పుచ్ఛములుగల మీన మింకొకటి గలుగును. వానికి సరిగా సూత్రమును బట్ట పూర్వపశ్చిమ దిక్స్ఫుటములగును. మీదవచ్చియుండు ఛాయా బిందు ద్వయదిక్సాధన బిందు ద్వయములగు 4 గురుతులనూ మొదలుజేసి 5 అంగుళముల ప్రమాణముగల తివారము తో వేరువేరుగ వృత్తార్ధముల నర్ధచంద్రాకారముగ విసరగా నవన్నియునూ కలసి అగ్ని నిరుతి వాయు ఈశాన్య దిక్కులయందు వరుసగా 4 కోణమీనములుదయించును. వానిముఖపుచ్ఛములకు సరిగా సూత్రములనుబట్టి నాగ్నేయాద్యవిచతుర్దిక్కులగును.

### (2) వ విధము.

1 వ, విధమున జూపియుండు మీదిక్రమములుగనే 10 అంగుళముల ప్రమాణముగల తివారములో దక్షిణోత్తర పూర్వ పశ్చిమ దిక్కులను స్ఫుటీకరించునపుడు వ్రాయబోవు 4 వృత్తములనూ క్రమముగ పూర్తిజేయు నష్టదిక్కులయందును 8 మీన

ములగును. వానిముఖ పుచ్ఛములకు సరిగా సూత్రములనుబట్టి నింద్రాద్యష్టదిక్ స్ఫుటములను తెచ్చుకొనవలసినది.

(3) వ విధము.

గమనింపు:— మీదవచ్చియుండు ఛాయా బిందువుల రెంటి మీదనూ నేరముగ ధారమునుబట్టగ నదియే పూర్వ పశ్చిమ దిశాసూత్రమగును.

అట్టి దిశాసూత్రమయినది శంకు వృత్తమునందలి మధ్య బిందువుమీద సరిగా వెళ్ళియుండినచో 3, వ విధమగు క్షేత్ర గణితముయొక్క సవర్ణ సూత్రమునుపయోగింపవలసినది.

* సూ|| ఛాయా వృత్తమునందలి ఛాయా బిందువుల రెంటిలో దేనినయిన నొకటిని మొదలుజేసి 3 అంగుళములు 1 అంగుళమును 10 భాగములు చేసినందులోని భాగముల ప్రమాణముగల ($3\frac{8}{10}=3\frac{4}{5}=3.8$) కైవారముచేఛాయా వృత్తమునందలిలో భాగమున అనగా ఛాయా వృత్తముననే నణగియుండునట్లు అర్ధచంద్రాకారమగు ధనువును వ్రాసిదాని రెండుమొనలునూ ఛాయావృత్త రేఖకు తగిలింపవలసినది.

తరువాత ఛాయా వృత్తమునూ మీదవ్రాసియుండు ధనువునూ కలసియుండు సంధి స్థానములయందు మొదలుజేసి మీదిక్రమముగనే వరుసగ ధనువులును వ్రాయుచుండిన నా ఛాయా వృత్త గర్భముననే నష్టరేఖలతో నొక చిత్రమగుబడును. అందలి రేఖలే నింద్రాద్యష్ట దిక్కులనూ; మధ్య కోణములేవిదిక్కులనూ జూపునదగునని తెలియవలసినది. (తివారము=కైవారము=వృత్తమును వ్రాయుకంపాసు.)

---

*రూల్,, వ్యాసార్ధవర్గముయొక్క ద్విగుణమునకు మూలము నెత్తగాని నా వృత్తమునందలి చతుర్థాంశధను జ్యాయగును. చతుర్థాంశ ధను జ్యార్ధ వర్గమునూ చతుర్థాంశ ధను జ్యార్ధ వ్యాసార్ధాంతర వర్గమునూచేర్చి మూలము నెత్తగానది నా వృత్తమునందలి నష్టాంశ ధను జ్యాయగును. (ధనువనగ బిల్లు దబ్బనంటిదనియు జ్యాయనగ బిల్లును బిగించియుండు సూత్రము వంటిదనియు తెలియవలసినది.)

ఉదా,, ఛాయా వృత్త వ్యాసము 10 దీని దళము 5 దీని వర్గద్విగుణమూలము 7.0 దీని దళవర్గము 12.25 దీనిమూలవ్యాసార్ధాంతర వర్గము 2.25 వీనియోగమూలము 3.8, బుద్ధిమంతులు నీసూత్రార్థమునూహింపగలరు,,



హెచ్చరిక:— మేషాయన తులాయన దినములలో నొకదినము నాటికి తత్పూర్వ దినమున నీ మీద జెప్పబడియుండు 3 విధములలో నే విధముగనయినను దిక్సాధనమును జేసియుంచుకొనియుండి రెండవ దినమున నీముందుజెప్పబోవు విధిక్రమములచే విషుచ్ఛాయాదులను సాధించుకొనవలసినది.

విషువచ్ఛాయాసాధనము.

పైజెప్పబడియుండు క్రమములతో దిక్సాధనమును జేసియుంచుకొని యుండు నాటికి రెండవ దినమగు మేషాయన తులాయన దినములలో నొక నాటియుదయకాలమున శంకు వృత్తమున శంకు స్థాపనమనగా శంకువును బెట్టి చూడగా మధ్యాహ్నకాలమగు పూర్వ పశ్చిమ దిశాసూత్రముమీద ఛాయాశూన్యమైయుండునప్పుడు దక్షిణోత్తర దిక్సూత్రముమీద నెన్నియంగుళ వియంగుళములు ఛాయవ్యాపించియుండునో నదియే విషువచ్ఛాయయగును.

ఉదా,,— ఉదాహృత దేశమున కట్లు గ్రహింపగా రెండంగుళములు 14 వియంగుళములు ఛాయవచ్చెను గనుక అంగుళాది 2-14 ఫలభాయగునని తెలియవలసినది.

గమనింపు,, అంగులములోని ప్రతి పదియవ భాగమునకునూ నొక్కొక్క భాగమునకారారు వియంగులములచొప్పున లెక్కింపవలసినది.

అనంతర మక్షకర్ణానయనమాహ.

మూ|| శంకోత్తాశ్చాక్ష ప్రభాయాశ్చ ముభయోర్వర్గ సంయుతే।
మూలంభవేదక్ష కర్ణ మిత్యేవం నిశ్చితో బుధైః ||

తా|| స్వదేశ విషువచ్ఛాయా వర్గమునూ శంకు వర్గమునూ చేర్చి మూలము నెత్తగానది స్వదేశ విషువత్కర్ణమగును.

---

నో|| 60 వియంగులములొక యంగులమగుననియూ, దీనిగణిత క్రమములంతయూ కలాది గణితక్రమముల నే తప్పక పోలియుండుననియూ తెలియవలసినది.

ఉదా,, స్వదేశ విషువచ్ఛాయ 2-41 దీని వర్గము 7-12 శంకు ప్రమాణము 12-0 దీని వర్గము 144-0 ఈ రెండు వర్గములనూ చేర్చి గణితాధ్యాయమునందలి 22-వ పాఠక్రిమమున మూలమెత్తగానయిన స్వదేశ విషువత్కర్ణాంగుళాది 12-18.

*N. B.* ఈ విషువచ్ఛాయకునూ విషువత్కర్ణమునకునూ మార్పులేదు.

## అథ సూర్యోదయాది ఘటికానయనార్థ మాదౌ భాజ్యానయనమాహ.

మూ॥ దశఘ్నా త్పభయాప్తస్య చరస్యైవకృతిస్సదా ॥
ద్వినిఘ్నా స్వశరాంశాఢ్యా స్యాద్భాజ్యో వేదరుద్రియుక్ ॥

స॥ తా॥ పదిచే గుణింపబడిన విషువచ్ఛాయయగు నాది చరఖండముచే నిష్టదినముయొక్క చరార్ధ వినాడికలను భాగింపగావచ్చు కలాది ఫలమును వర్గించుకొని వావర్గమును ద్విఘ్నించివచ్చిన మొత్తమును రెండు ప్రతులుగ దలచియందొక దానిని 5-చే భాగించి తెచ్చిన లిప్తాదిఫలము నింకొక దానిలోచేర్చి అందు 114-ను కలుపగా భాజ్యమగును.

లేక మీదతెచ్చియుండు వర్గఫలమునే 12-చే పెంచివచ్చిన మొత్తమును 5-చే భాగింపగావచ్చు కలాదిఫలములో 114-ను చేర్చిననూ భాజ్యమగును ఇది గణిత సూత్రము.

ఉదా:—వెనుక స్ఫుట ధ్యాయమునందొచ్చియుండు చారార్ధ వినాడికలు 48-దీనిని ప్రథమ చరఖండమగు 27-చే భాగింపగావచ్చిన లిప్తాదిఫలము 1-44 దీని వర్గము 3-0 దీనిని రెట్టింపగా 6-0 దీనిని రెండుప్రతులుగ దలచి నొకదానిని 5చే భాగింపగవచ్చిన కలాది ఫలము 1-12-ను మరొకదానిలో చేర్చగా 7-12 లేక వర్గమగు 3-0-ను 12-చే పెంచివచ్చిన మొత్తమగు 36-0-ను 5-చే భాగింపగా వచ్చిన కలాది 7-12 దీనిలో 114-ను చేర్చగానైన భాజ్యము కలాది 121-12.

## అథ మధ్యహారానయనమాహ.

మూ॥ శరభక్తా చ్చరాల్లబ్ధ ముద్గో శంద్రభూయుతం ।
మధ్యహారో భవే ద్యావ్య గోశంతువియు తంయది ॥



తా॥ అహస్సాధనమునందలి చరార్ధ వినాడికలను 5-చే భాగించి తెచ్చిన కలాదిఫలమును దిన మానము 30-0 లకంటెను మించియుండునపుడు 114-లో చేర్చగనూ తగ్గియుండునపుడు తీసివేయగనూ మధ్యహారకమగును.

ఉదా:—మీదవచ్చియుండిన చరార్ధ వినాడికలగు 48-ని 5 చే విభజింపగా వచ్చిన కలాదిఫలము 9-36 దీని దినమానము 30-ఘడియలకంటెను మించియుండుటచే 4- 11లో కలుపగానైన మధ్యాహారకము 123-36.

## అథ అభిమతహారానయనం.

మూ॥ ఇష్టచ్ఛాయాకృతియుతా చ్ఛంకువర్గాచ్చ యత్పదం ।
స్యాదిష్ట కర్ణస్తద్భక్తాద్భాజ్యా దభిమతోహరః ॥

స॥ తాత్పర్యము॥ సూర్యోదయాది కాలమును తెలియవలసిన సమయమునందు ద్వాదశాంగుళ శంకువుయొక్క నీడ ఎన్నియంగుళములుండునో దాని ఇష్టచ్ఛాయయని చెప్పబడును. అట్టి నిష్టచ్ఛాయావర్గమునూ శంకు వర్గమగు 144 నూ చేర్చి మూలమునెత్తగానది ఇష్టకర్ణమగును. దానిచే మీద తెచ్చియుండు భాజ్యమును భాగింపగావచ్చు లిప్తాదిఫలమే ఇష్ట హారకమగును.

ఉదా:— నేడుప్రాక్కపాలమునందనగా మధ్యాహ్నాత్పూర్వమున ద్వాదశాంగుళ శంకు చ్ఛాయాంగుళములు 20 వచ్చెను అప్పటికి సూర్యోదయాని ఘడియలేమి. ఇందిష్టచ్ఛాయయగు 20-0-లయొక్క వర్గములో 144-0 లను చేర్చి మూలమునెత్తగావచ్చిన ఇష్టకర్ణము 23-19 దీనిచే మీదతెచ్చియుంచుకొనియుండు భాజ్యమగు 121-12-లను భాగింపగ వచ్చిన స్ఫుట హారకము 5-12,,

## అథనతసాధనాక్రమమాహ.

మూలం॥ అక్షకర్ణహతా ద్భీష్టహారో మధ్యాద్విశోధితః ।
భవేత్సమాఖ్యస్త ద్విగుణం వేదాం కాఙ్గాధికం యది ।
తదాపృథక్ని వేశ్యాబ్ధి గోభూహీనం గుణో ధృతం ।
ఫలం సంయోజ్య తన్మూల మర్థ నాడీ నియుగ్నతం ॥

స్యాద్వేదాంకధరాల్పస్యాత్సమాఖ్యా ద్విగుణస్యతు ।
మూలమేవనతం హ్యేత ద్దర్ధనాడీ విశోధితం ॥

తా॥ పైచెప్పిన స్ఫుటహారకమును స్వదేశ విషువత్కర్ణముచే పెంచి వచ్చిన మొత్తమును మధ్యహారకములో తీసివేయగానిలుచు శేషము సమాఖ్యయనబడును.

అట్టి సమాఖ్య నుద్విఘ్నింపగా వచ్చు మొత్తము 194 కంటెను తగ్గియుండు నపుడందేమియూ చేర్చనక్కఅలేదు, 194 కంటెను మించియుండునపుడు ఎంత మించియుండునో దాని తృతీయ్యాంశమునగా మూడవ వంతును మరల దానికే చేర్చవలసినది.

ఇట్లు తెచ్చిన ద్విగుణిత సంస్కృతమగు సమాఖ్యకు మూలము నెత్తి వచ్చిన ఘటికాదిలో 30 వినాడికలను తీసివేయగానిలుచు శేషము నతఘటి కాదియగును.

ఉదా:—స్ఫుట హారకము 5-12 దీనిని అస్మద్దేశీయ్యాక్షకర్ణమగు 12-18-చే పెంచి వచ్చిన 63-58-ని పూర్వసాధితమధ్యా హారకమగు 123-36-లలో తీసివేయగా నిలిచిన సమాఖ్య 59-38-దీనిని ద్విఘ్నింపగా 119-16 ఇది 194-0 కంటెను తగ్గియుండుటచే దాని తృతీయ్యాంశమును కలుపనక్కఅలేదు గనుక 119-16లకే మూల మెత్తగా వచ్చిన ఘటికాదియగు 10-55-లలో నరఘడియను తీసివేయగా నిలిచిన నతఘడియలు 10-25.

ఇష్టచ్ఛాయాసాధనినతా దిష్టఘటికాశ్చాహ.

మూలం॥ నతే నైవోనితం చాహర్దళం పూర్వాపరార్ధయోః ।
అభీష్టచ్ఛాయయా జాతం ఘటికా ద్యమితీరితం ॥

తా॥ మధ్యాహ్నాత్పూర్వమనగా నిష్టకాలము ప్రాక్కపాలములోచేరియుండునపుడు నా నతమును దినార్ధంలో తీసివేయగనూ మధ్యాహ్నాత్పరమనగా ఇష్టకాలము ప్రత్యక్కపాలములో చేరియుండునపుడట్టినతమును దినార్ధంలో చేర్చగనూ సూర్యోదయాదీష్టకాలమువఱలో గత ఘటికాదియగును.



మూలం॥ సూర్యోదయాదిఘటికాః ప్రాక్కపాలే వ్యయన్నతాః ।
పశ్చాత్కపాలే సూర్యాస్త ఘటికాశ్చోన్నతాస్సదా ।
తాభిరున్నత నాడీభిః రూనాహర్దళ నాడికాః ।
నతనాడ్యో భవంత్యేతాః ప్రాక్పశ్చిమ కపాలయోః ॥

తా॥ మధ్యాహ్నాత్పూర్వము గతకాలమగు సూర్యోదయాదీష్టకాల పర్యంతమగు కాలమునూ; మధ్యాహ్నాత్పరమున గమ్యకాలమగు ఇష్టకాలప్రభృతి సూర్యాస్తమాన పర్యంతము నిలిచియుండు దివా శేషమునూ సదాయున్నతకాలమని చెప్పబడును. అందు గతకాలోన్నతము ప్రాక్కపాలోన్నతమనియూ గమ్యకాలోన్నతమును పశ్చాత్కపాలోన్నతమనియూ తెలియవలసినది.

అట్టి యున్నతములలో దేనినిగానీ దినార్ధములో తీసివేయగా నిలిచినవి క్రమముగ ప్రాక్పశ్చిమకపాలములయందలి నతములగును.

ఉదా:—మీదవచ్చియుండు నతము పూర్వనతమగుటచే సూర్యోదయాదీకాలము మొదలు దినార్ధాంతమువఱకూగల అంతరాళమగును గనుక దానిని దినార్ధమగు 15-48 లలో తీసివేయగా నిలిచిన సూర్యోదయాది గత ఘడియలు 5-23 ఇదే ఇష్టకాలము.

(2)వ ఉదా:—మధ్యాహ్నాత్పరమున శంకుచ్ఛాయాంగుళాది 216-2 వచ్చెను అప్పటికి సూర్యోదయాది కాలమేమి. భాజ్యమధ్యాహారకములోకే దినమునకు మారుటలేదు గనుక మీదవచ్చియుండు 121-12,, 123-36 ఇవియేనిపుడునూ భాజ్య మధ్యాహారకములగును. ఇది మధ్యాహ్నాత్పరమగుటచే పశ్చిమకపాలచ్ఛాయయని తెలిసెను గనుక 216-2-ను వర్గించుకొని అందు 144-ను చేర్చి మూల మెత్తగా నయిన ఇష్టకర్ణము 216-22 దీనిచే పూర్వోక్త భాజ్యమగు 121-12-లను భాగింపగా వచ్చినస్ఫుట హారకము 0-34 దీనిని విషువత్కర్ణముచే గుణించి వచ్చిన 6-58 లను మధ్యహారకములో తీసివేయగా నిలిచిన సమాఖ్య 116-38 దీనిని రెట్టింపగా 233-16 ఇది 194 కంటెను 39-16 ఎక్కువగానుండుటచే 39-16 యొక్క మూడవ భాగమగు 13-5-ను 233-16-లకే చేర్చుకొనగా నైన 246-21-లకు మూలమెత్తగావచ్చిన ఘటికాది

15-42 దీనిలో 30 విఘడియలను తీసివేయగా నిలిచిన పశ్చాన్నతము 15-12 ఇది మధ్యాహ్నము మొదలు ఇష్టకాలపర్యంత కాలమగుటచే దీనిలో సూర్యోదయాది మధ్యాహ్నపర్యంత కాలమగు దినార్ధముచేర్చగానైన సూర్యోదయాది కాలము31-0

***N. B.*** ఈ మాదిరిగనుముగనే ద్వాదశాంగుళ శంకుచ్ఛాయచేత సూర్యోదయాది కాలమును సిద్ధాంత గణిత రీతిగా స్ఫుటీకరింప వలసినదియే తప్ప పాద చ్ఛాయాది తప్పు దోవలలో కాలనిర్ణయమును చేయకూడదు. ఇదివఱలో నీ యధ్యాయము వ్రాసియుంచియుండు మూలశ్లోకములను ప్రాచీన శ్రీగణకానంద మునుండియు గ్రహించినదని తెలియవలసినది.

మఱియూ నీ మీద కనుపఱచియుండు గణితక్రమములను విపరీతముగా గణించి సూర్యోదయాదీష్టకాలముచే శంకుచ్ఛాయ నెత్తవచ్చును.

అందు ఈ మీదచెప్పియుండు విధముగనే మధ్యహారక భాజ్యములరెంటినీ తెచ్చియుంచుకొన వలసినది.

ఉదా. మధ్యహారకము 123-36 భాజ్యము 121-12.

## హారక స్ఫుటము.

సూ॥ సూర్యోదయాదీష్టకాలము దినార్ధాల్పముగనుండునపుడు దినార్ధలోనిష్ట కాలమును తీసివేయగ నిలుచు శేషము పూర్వనతమునూ; దినార్ధాధికముగా నుండు నపుడు నాయిష్టకాలముననే దినార్ధముతీసివేయగా నిలుచు శేషము పశ్చాన్నతమునూ యగును. అట్టినతములలో దేనినిగాని ఘటికాది 0-30, లలో చేర్చి అయినదానిని వర్గించుకొని నావర్గము నర్ధీకరింపగా నతము 13-30 లకు తగ్గియుండు నపుడదియే సమాఖ్యయగును. 13-30 లకు మించియుండునపుడు ఎంతమించియుండునో దాని చతుర్గుణముననగా నాలుగింతలను మీది వర్గార్ధముననే తీసివేయగా నిలిచినది సమాఖ్యయగును. ఇట్లేర్పడినసమాఖ్యను మీద తెచ్చియుండు మధ్యా హారకములో తీసివేయగా నిలిచిన దానిని అక్షకర్ణముచే భాగింపగావచ్చు కలాదిఫలమే స్ఫుట హారకమగును.

ఉదా. ఉదయాది 5 28 లకు శంకుచ్ఛాయ ఎంత?



5-23 ఘలను ఇష్టకాలము దినార్ధాల్పముగనుండుటచే దినార్ధలో నిష్టకాలమును తీసివేయగానైన పూర్వనతఘటికాది 10-25 దీనిలో వరఘడియను చేర్చివర్గింపగా 119-10 దీనిలో సగము 59-40 నతము 13-30 లకంటెను తగ్గియుండుటచే నిదియే సమాఖ్యయగును గనక దీనిని మీదవచ్చియుండు మధ్యహారకమగు 123-36 లలో తీసివేయగా నిలిచిన 63-56 లను విషువత్కర్ణముచే విభజింపగావచ్చిన స్ఫుట హారకము 5-12.

## ఇష్టచ్ఛాయాసాధనము.

సూ॥ స్ఫుట హారకముచే భాజ్యమును భాగింపగావచ్చు కలాదిఫలమే నిష్టకర్ణమగును దానిని వర్గించి అందులో 144-ను తీసివేసి మిగిలిన దానికి మూలము నెత్తగావచ్చు కలాది ఫలమే నిష్టచ్ఛాయాంగుళాదియగును. (వ్యుత్క్రమగణితవిధి)

ఉదా.—మీదవచ్చియుండు భాజ్యమగు 121-12 ను ఇష్టహారకమగు 5-12 చే భాగింపగావచ్చిన నిష్టకర్ణము 23-19 దీనివర్గము 543-40 దీనిలో 144-0 ను తీసివేయగా నిలిచిన 399-40లకు మూలమెత్తగా వచ్చిన నిష్టచ్ఛాయాంగుళాది 20-0

2వ ఉదా.

ఉదయాది కాలం 31-0 లకు శంకుచ్ఛాయాంగుళములెన్నివచ్చును. ఇందలి నిష్టకాలమగు 31-0 లు దినార్ధాధికముగనుండుటచే నిష్టకాలములో దినార్ధము తీసివేయగానయిన నపరనతము 15-12 దీనిలో 30-విఘడియలనుచేర్చి వర్గింపగా 246-29 దీని దళము 123-15 ఇందులో నతమగు 15-12 లకునూ 13-30 లకునూగల నంతరాళమగు 1-42 లను 4-చే గుణింపగావచ్చిన 6-48 లను తీసివేయగానైన సమాఖ్య 116-27 దీనిని మధ్యాహారకముగు 123-36 లలో తీసివేయగా నిలిచిన 7-9 ని నక్షకర్ణముచే భాగింపగావచ్చిన స్ఫుటహారకము 0-35 దీనిని బట్టి మీదిక్రమముగనే గణించి ఇష్టచ్ఛాయాంగుళములగు 216-2 లకు గణితవిధిని సరిపోల్చిచూడుము.

గమనింపు, ఈ గణితక్రమములలో వినాడికలే నత్యల్పమగు నంత్య స్థానమును బొందియుండుటచే కాలోచితముగ నర్ధోత్తర రీత్యానొక వినాడికగానీ లేక నొకవినాడికకునేర్పడు ఛాయాప్రమాణాంగుళములుగానీ కొన్ని సమయముల యందెచ్చు తగ్గులగునని తెలియవలసినది.

అథ చరార్ధానయనక్రమః.

శ్లో॥ నాడ్యా ఘ్నచ్ఛాయయా ప్రథమశ్చ భఘ్నా పైర్మద్వితీయ్యకం ।
ఆదిఖండస్త్రిభాగోష్టః మంత్యశ్చరమితిక్రమాత్ ॥

తా॥ స్వదేశవిషువచ్ఛాయాంగుళాదిని 10-చే పెంచగావచ్చు సర్ధోత్తరాంగుళ లబ్ధము ప్రథమ చరఖండమనియూ; దానిని 4-చే పెంచి నయిదుచే భాగింపగావచ్చు సర్ధోత్తర లబ్ధము ద్వితీయ్యచరఖండమనియూ; ప్రథమచరఖండమును 3-చే భాగింపగావచ్చు సర్ధోత్తరఫలమును తృతీయ్యా చరఖండమనియూ జెప్పబడును.

ఉదా:—స్వదేశ విషువచ్ఛాయాంగుళాది 2-41 దీనిని 10-చే గుణింపగా నయిన సర్ధోత్త రాంగుళములగు ప్రథమచరార్ధము 27, దీనిని 4-చే పెంచివచ్చిన 108-ని 5-చే భాగింపగవచ్చిన సర్ధోత్తరఫలము 22 ఇది ద్వితీయ్యా చరార్ధమగును ప్రథమచరఖండమును 27-దీనిని 3-టు భాగింపగావచ్చిన లబ్ధము 9 గనుక వరుసగా 27,, 22,, 9,, చర దళములగును.

లంకోదయములు.

శ్లో॥ దాసరుంధ్ర ధర్తైగాంక్తైగోః క్రమాద్వ్యుత్క్రమేణచ ।
ఏవం ద్వాదశరాశీనాం లంకోదయవినాడికాః ॥

తా॥ 278, 299, 323, 323, 299, 278, 278, 299, 323,
323, 299, 278, ఇవివరుసగా మేషాది రాసులకు లంకా లగ్న ప్రమాణ వినాడికలగును.

స్వదేశలగ్న ప్రమాణానయనం.

శ్లో॥ క్రమాత్ఖండత్రయశోధ్యం వ్యుత్క్రమాత్క్రమయుక్సదా ।
తతోవ్యుత్క్రమహీనంస్యా త్స్వదేశోదయాస్మృతాః ॥

తా॥ లంకాలగ్న ప్రమాణ వినాడికలలో నీ దిగువ వ్రాయబోవు విధముగ స్వదేశ చరఖండములను సంస్కరింపగా స్వదేశ లగ్నప్రమాణ విఘడియలగును.





సంస్కారక్రమము:-మీన మేషములయందు ప్రథమ చరఖండమునూ; వృష కుంభములయందు ద్వితీయ్య చరఖండమునూ; మిథున మకరములయందు తృతీయ్య చరఖండమునూ తీసివేయవలసినది.

కటక ధనుస్సులయందు తృతీయ్యచరఖండమునూ; సింహవృశ్చికముల యందు ద్వితీయ్య చరఖండమునూ; కన్యాతులలయందు ప్రథమ చరఖండమునూ చేర్చవలసినది.

ఈ క్రమముగ స్వదేశ చరఖండములను నీ మీదచూపియుండు లంకోదయ ప్రమాణములలో సంస్కరింపగా స్వోదయములగును.

ఉదా:—స్వదేశ చరఖండములగు 27, 22, 9,ని మీద్క్రమముగ లంకాలగ్న ప్రమాణములయందు సంస్కరింపగానైన స్వదేశలగ్న ప్రమాణములు, 251, 277, 314, 332, 321, 305, 305, 321, 332, 314, 277, 251, ఇవి క్రమముగ మేషాది రాశిప్రమాణ వినాడికలగును.

అథ స్ఫుట గ్రహ తాత్కాలిక్రమః.

సూ॥ సూర్యోదయా దిష్టకాల వినాడికలచే నాయాగ్రహ స్ఫుటగతి లిప్తలను గుణించి వచ్చిన మొత్తమును 3600 చేత భాగింపగావచ్చు కలాది ఫలమును సవ్యగతిగల గ్రహములలో చేర్చుగనూ నపసవ్యగతి (వక్రగతి) గల గ్రహములలో తీసివేయుగనూ ఇష్టకాల గ్రహములగును.

ఉదా:— సూర్యోదయా దిష్టకాలము 29.20 లకు రవి చంద్రపాతలను తాత్కాలింపుము.

పాతః కాలికద్రుక్ స్ఫుట రవిః 3-9-10-17 గ 57-8 చంద్రః 9-2-37-42 గ 800-3 పాతః 2-12-11-49 గతిః 3-11 సూర్యోదయాదిష్టకాలము 29-20 దీని వినాడికలు 1760 దీనిచే రవిచంద్రపాతల గతి స్ఫుటములను వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను వరుసగా 3600 చేత భాగించి తీసిన కలాది ఫలములు రవికి 27-52 చంద్రునికి 420.27 లేక భాగాది 7-0-27 పాతకు 1-33 ఇవి నాయాగ్రహ

ములకు తాత్కాలిక చాలిత ఫలములగును గనుక దీని సాయనాస్ఫుట గ్రహములలో చేర్చగానైన తాత్కాలిక దృక్స్ఫుటగ్రహములు రవిః 3-9-38-9 గ 57-3 చంద్రః 9-9-38.9 గ 860-3 పాతః 2-12-13-24 ఈ విధముగనే తక్కిన గ్రహస్ఫుటములనూ వారివారి స్ఫుట గతులచేత నిష్టకాలమునకు తాత్కాలించుకొనవచ్చును.

అథ మధ్యగ్రహ తాత్కాలకీకరణమాహ.

రవ్యాదిగ్రహ ధృవకా క్షరవాక్యాని, రవేర్ఘాతకః, సోమేక్షురః, కుజే ధనః, సౌమ్యేశామః, జీవేభయః, శుక్రేపానః, మందేస్తనః, తుంగే జపః, పాతే ధూళిః, జీవార్కార్కిచతుంగానాం పాతేచాయుతభాజకం। వక్రిస్సోమ్యేచ సాహస్రం శేషేశత విభాజితం॥ నతఘ్నమిష్టనాడీస్యా త్క్రిమాధ్రువక తాడితాః। హారా భక్తస్తథాసాధ్య మిచ్ఛాఫలభవేత్కలాః। గతైర్వేర్ణధనం కర్యాత్తత్ఫలం గ్రహమధ్యమే। తదాదీష్టభవేన్మధ్య ఖేటాస్స్యాద్దృక్స్ఫుటోభవేత్ ॥

తా॥ రవికి 164 చంద్రునకు 22 కుజునికి 9 బుధకేంద్రమునకు 52 గురునకు 14 శుక్ర కేంద్రమునకు 1 శనికి 6 తుంగకు 18 పాతకు 9 గుణకములగును.

సూర్యోదయాదీష్టకాల వినాడికలను వారివారి గుణకములచే వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను వరుసగా రవి గురు శని తుంగ పాతలకు 10000-చేతనూ కుజ బుధ కేంద్రమునకు 1000-చేతనూ చంద్ర శుక్ర కేంద్రములకు నూరుచేతనూ భాగించి తీసిన కలాదిఫలములను ఆయా స్వదేశీయ ప్రాతః కాలిక దృఙ్మధ్యగ్రహములలో చేర్చుకొని పిమ్మట నీవెనుకటి క్రమములుగనే స్ఫుటీకరింపగా నిష్టకాలమునకు శుద్ధస్ఫుటములగును.

ఉదా:—ఉదయాది ఘడియలు 29-20 ఇదే యిష్టకాలము దీని విఘడియలు 1760 దీనిని రవి గుణకమగు 164-చే హెచ్చించివచ్చిన 288640-ని ఘదివేలుచే భాగించి తీసిన కలాది ఫలము 28-52 ఇదే విధముగ చంద్రగుణకమగు 22-చే తనిష్టకాల వినాడికలను హెచ్చించి 100-చే భాగింపగా వచ్చిన కలాదిఫలము 387-12 దీని భాగాది 6-27-12 (ఈ విధముగనే తక్కిన గ్రహములకునూ వారివారి గుణాహారకములచే తాత్కాలిక ఫలములను తెచ్చుకొనవలసినది.) ఈ తాత్కాలిక ఫలములను ఆయా



ప్రాతః కాలిక దృఙ్మధ్యగ్రహములలో చేర్చగానైన తాత్కాలిక మధ్యమార్కః 3-10-30-12 మధ్య చంద్రః 9-9-37-55.

*N. B.* జాతకా దీష్టకాలములయందు గ్రహస్ఫుటములను నిర్దోషముగ తెలియగోరిన ఎడల నీమీద జెప్పియుండు క్రమముగనే స్ఫుటాధ్యాయోక్తమగు. స్వదేశీయ ప్రాతః కాలిక దృఙ్మధ్యగ్రహాదులను ఇష్టకాలమునకు తాత్కాలించుకొని పిమ్మట వెనుకటివలెనే స్ఫుటీకరించి యుంచుకొనవలసినది. అందు సూర్యడు దప్ప తక్కిన చంద్రాదిషడ్గ్రహములలో స్ఫుటగ్రహతాత్కాలికీకరణ మొకంటెను మధ్యగ్రహతాత్కాలికీకరణముజేసి పిమ్మట వానిని స్ఫుటీకరించుట సాధుమార్గము.

లగ్నస్ఫుటక్రమః.

శ్లో॥ తాత్కాలిక స్సాయనార్క కలాభోగ్యహతోదయైః ।
వినాడికాసుకుర్వీత రాశిలిప్తాప్తయోః ఫలం ।
ఇష్టనాడ్యో వియుక్తేషే స్తదనంతరమేవచ ।
ఏవం క్రమాద్విశోధ్యేష్టం సర్వదా గతరాశిభిః ।
తతోర్ధ్వరాశిమానేన హృతాభాద్యాత్ఫలంనయ।
ఏవం భోగ్యాది సర్వంస్యాత్ఫలము గ్లగ్న సాయకం ।
అయనాంశ విహీనంస్యాత్ స్ఫుటలగ్నమితీరితః ।
రాత్రౌ॥ సషడ్భస్సాయనార్కేచ అస్తాదీష్టవినాడికాః ।
వినిక్షిప్యస్తమో రాత్రౌ సాధయేత్పూర్వవత్క్రమాత్ ॥

స॥ తా॥ లగ్నస్ఫుటమును తెలియవలసిన కాలమునకు దృక్స్ఫుటరవిని తెచ్చి అందయన భాగలనుకలుపగా తాత్కాలికసాయనార్కుడగును. అట్టి తాత్కాలిక సాయనరవియందలి భాగాదిని 30 భాగలలో తీసివేయగా నిలుచు శేషము భోగ్య భాగాదియగును. దానిసర్ధోత్తర లిప్తలుజేసి వచ్చిన కలలను సాయనార్కుడుండు స్వదేశలగ్నప్రమాణ వినాడికలచే హెచ్చించి వచ్చిన దానిని రాశికలా సంఖ్యయగు 1800-చే తవిభజింపగావచ్చు సర్ధోత్తర లబ్ధమగు భోగ్యకాల వినాడికలను సూర్యో

దయాదీష్టకాల వినాడులలో దీసివేసి భోగ్య భాగాదిని సాయనార్కునియందు చేర్చవలసినది.

పిమ్మట భోగ్యకాలమును తీసివేసియుండు నిష్టకాలవినాడులలో సాయనార్కస్థిత లగ్నమునకు తరువాత రాగల లగ్నప్రమాణములను వరుసగా నెన్ని తీసివేయుటకు సాధ్యమగునో వాటిని క్రమముగ తీసివేసి నన్నిరాసులను భోగ్య భాగాదితో చేరియుండు సాయనార్కునిలో చేర్చి అయిన దానిలో నిష్టకాల శేషవినాడికలను 30-ట పెంచి తదనంతర రాశి ప్రమాణమును తీసివేయుటకు పోని రాశి మాన విఘటికలచే భాగించి తెచ్చిన నంశాదిఫలమును కలుపగా సాయన లగ్నమగును. అందయనాంశములను తీసివేయగా స్ఫుట లగ్నమగును (తనుభావము.)

ఇష్టకాలము రాత్రిలో చేరియుండెనేని నపుడు తాత్కాలిక సాయనార్కునియందు ఆరురాసులను చేర్చుకొనగానగు సషడ్భ స్సాయనార్కునినుండియును నీ విమాద్రిక్రమముగనే భోగ్యభాగాదిని తెచ్చి సూర్యాస్తమానాదీష్టకాలమును బట్టి వెనుకటివలెనే లగ్నస్ఫుటమును చేయవలసినది.

ఉదా:—సూర్యోదయాదీష్టకాలము 29-20 తాత్కాలిక దృక్స్ఫుటార్కః 3-9-38-0 అయనాంశలు 21-31-44 తాత్కాలిక సాయనార్కుడు 4-1-9-53 ఇందలి భాగాదియగు 1-9-53 లను రాశిభాగలగు 30-లలో తీసివేయగా నిలిచిన భోగ్యభాగాది 28-50-7 దీని నర్ధోత్తరలిప్తలు 1730 దీనిని సాయనార్కుడు సింహరాశిలోనుండుటచే స్వదేశలగ్నప్రమాణములయందలి సింహప్రమాణ వినాడికలగు 321-చే పెంచివచ్చిన 555330-ని 1800-చే భాగింపగావచ్చిన నర్ధోత్తర లబ్ధమగు భోగ్యవినాడికలు 309 దీనిని సూర్యోదయాదీష్టకాల వినాడికలగు 1760 లలో తీసివేయగా నిలిచిన భోగ్యకాలరహితయిష్టకాలము 1451 ఇపుడు సాయనార్కుడగు 4-1-9-53 లలో భోగ్యాంశలగు 28-50-7 లను చేర్చగాసైనది 5-0-0-0.

తరువాత భోగ్య కాలమును తీసివేసిన నిష్టకాల వినాడికలగు 1451 లలో సాయనార్కస్థితలగ్నమున కవతల వరుసగా రాగల కన్యాలగ్నప్రమాణము 305 తులాలగ్నప్రమాణము 305 వృశ్చిక ప్రమాణము 321 ధనుః ప్రమాణము 332 వీనిని వరుసగా తీసివేయగాసైన నిష్టకాల శేషము 188 దీనిలో మకర రాశి ప్రమాణమగు



3-14 ను తీసివేయుటకు పోదు కనుక ఇపుడు కన్య మొదలు వరుసగా 4 లగ్న ప్రమాణములను తీసివేసియుండుటచే భోగ్యాంశాద్యుతార్కుడగు 5-0-0-0 లలో 4 రాసులను చేర్చగాసైన 9 రాసులలో నిష్టకాల శేషమగు 188 ని 30 ట పెంచి వచ్చిన 5640 ని పోనిరాశి ప్రమాణమగు 314-చే భాగించి తెచ్చిన భాగాది ఫలమగు 17-57-44 లను చేర్చగానయిన సాయనలగ్నము 9-17-57-44, ఇందులోనయన భాగలనుతీసివేయగాసైన లగ్నస్ఫుటము రాశ్యాది 8-26-26-0.

(2) వ ఉదా,, సూర్యోదయాదీష్టకాలము 32-0,, తాత్కాలిక స్ఫుటార్కః 8-9-40-38 రాత్రికాలమునకు అస్తాదీష్టకాలము కావలెనుగనుక 32-0,లో అహస్సును తీసివేయగా నిలిచిన నస్తాదీష్టకాలము 0-24 దీని వినాడికలు 24

తాత్కాలిక స్ఫుట రవియందయన భాగలనూ నారురాసులనూ చేర్చుకొనగానయిన సషడ్భస్సాయనార్కుడు 10-1-12-22 ఇందలి భోగ్య భాగాది 28-47-38 దీని నర్ధోత్తరలిప్తలు 1728 దీనిని బట్టి మీాద్రిక్రమముగనే సషడ్భస్సాయనార్కస్థిత రాశిప్రమాణమగు కుంభప్రమాణ వినాడికలచే సాధింపగా వచ్చిన భోగ్యకాల వినాడికలు 266 ఇది ఇష్టకాలవినాడికలగు 24 లో తీసివేయుటకు పోదుగనుక నీయిష్టకాలమగు 24 వినాడికలనే ఇష్టకాల శేషముగనేగి 30-ట గుణింపగానయిన 720 ను సాయనార్క స్థితరాశి ప్రమాణమగు 277-చే భాగింపగావచ్చిన భాగాదిఫలము 2-35-57 దీనిని సషడ్భస్సాయనార్కునిలో కలుపగాసైన సాయనలగ్నము 10-3-48-19 దీనిలోనయనాంశములను తీసివేయగానిలిచిన లగ్నస్ఫుటము 9-12-16-35 అర్ధోత్తరలిప్తాంతము 9-12-17,

గమనింపు,, ఇష్టకాలములో భోగ్యకాలమును తీసివేయుటకు పోని తరుణములయందంతయూ నీవిమాద్రిక్రమముగనే ఇష్టకాల వినాడికలను 30-ట పెంచివచ్చిన దానిని సాయనార్క స్థితరాశి ప్రమాణముచే భాగింపగావచ్చు భాగాది ఫలమునే సాయనరవియందు కలిపి సాయన లగ్నమును తెచ్చుకొనవలసినది.

— :లగ్నస్ఫుటమునుచూచి ఇష్టకాలమును తెలియుట. :—

సూత్రము,, తాత్కాలిక సూర్య స్ఫుటమునకునూ, లగ్నస్ఫుటమునకునూ నయనాంశలను కలుపగా సాయనార్క సాయన లగ్నములగును. అందు సాయన రవినిబట్టి నీవిమాద్రిక్రమములగనే భోగ్యకాలవినాడికలను తెచ్చియుంచుకొనవలసినది

తరువాత సాయన లగ్నమునందలి భుక్త భాగాదిన గత భాగాదిని షష్ఠ్యోత్తర లిప్తలుచేసి దానిని సాయనలగ్నముయొక్క రాశిప్రమాణముచే పెంచివచ్చిన మొత్తమును 1800 చే భాగింపగా వచ్చు షష్ఠ్యోత్తరలబ్ధముభుక్తకాల వినాడికలగును.

ఇట్లు తెచ్చిన భుక్తభోగ్యకాలముల రెంటినీ కలియగూర్చి అందు సాయనార్క-సాయన లగ్నములనడుమనుండెడు రాశిప్రమాణములను వరుసగా చేర్చుకొనగా నగు మొత్తమే సూర్యోదయా దిష్టకాల విఘటికలగును.

ఉదా:—తాత్కాలిక స్ఫుటార్కః 3-9-38-9, స్ఫుట లగ్నం 8-26-26-0 అయన భాగాది 21-31-44 సాయనలగ్నం 9-17-57-44 సాయనార్కః 4-1-9-53 ఈ సాయనార్కునకు మీదిక్రమముగనే భోగ్యభాగాదిని తెచ్చి దానిచే భోగ్యకాలము నెత్తగా వచ్చిన సింహలగ్నమందలి భోగ్యకాల వినాడికలు 309.

తరువాత సాయన లగ్నమందలి గతభాగాదులగు 17-57-44 లను షష్ఠ్యోత్తర కలలుచేయగానైన 1078-ని సాయనలగ్నము మకరరాశిని పొందియుండుటచే మకరప్రమాణమగు 314-చే పెంచివచ్చిన మొత్తమగు 338492 ను 1800-చే భాగించి తీసిన షష్ఠ్యోత్తర లబ్ధము 188 ఇది మకర లగ్నమునందలి భుక్తకాల వినాడికలగును.

ఇట్లు తెచ్చిన భోగ్య భుక్త కాలముల రెంటినీ కలియగూర్చగానైన 497 లో సాయనార్క స్థిత సింహరాశికినీ సాయన లగ్నస్థిత మకరరాశికినీ నడుమనుండు కన్యారాశి మొదలు వరుసగా నాలుగు రాశిప్రమాణ వినాడికలగు 305,, 305,, 321,, 332,, వీనిని చేర్చి మొత్తముజేయగానైన సూర్యోదయా దిష్టకాల వినాడికలు 1760 దీనిఘటికాది 29-20.

గమనింపు:—

సాయనార్క- సాయన లగ్నములు రెండునూనొకే రాశిగతమైయుండునపుడు సాయన లగ్నములో సాయనార్కునుని తీసివేయగా నిలుచు సాయనార్క-సాయన లగ్నాంతర భాగాదిని షష్ఠ్యోత్తరలిప్తలుచేయగా నయిన దానిని సాయనార్క స్థిత రాశిప్రమాణముచే పెంచి వచ్చిన మొత్తమును 1800 చేత భాగింపగావచ్చు షష్ఠ్యోత్తర లబ్ధమే ఇష్టకాల విఘడియలగును.



మరియు నిష్టకాలము రాత్రిలో చేరియుండెనేనిపుడు తాత్కాలిక సాయనార్కునియందారు రాసులనుచేర్చుకొనగానగు షడ్భసాయనార్కుని చేతనూ ; సాయన లగ్నముచేతనూ మీదిక్రమముగనే సాధింపబడిన నష్టాదిష్టకాలమును దినమానములోగలుపగా సూర్యోదయా దిష్టకాలమగునని తెలియవలసినది.

ఉదా:—రాత్రి స్ఫుట లగ్నం 9-12-16-35 తాత్కాలిక స్ఫుట రవిః 3-9-40-38 సాయనార్కః 4-1-12-22 ఇది రాత్రికాలమగుటచే సాయనార్కునియందారు రాసులను చేర్చుకొనగానైనషడ్భసాయనార్కుడు 10-1-12-22 సాయన లగ్నం 10-3-48-19 ఇందు సాయనార్క సాయనలగ్నములు రెండునూ నొకే రాశిని పొందియుండుటచే సాయనలగ్నములో సాయనరవిని తీసివేయగా నిలిచిన రవిలగ్నాంతర భాగాది 2-35 57 దీనిషష్ఠ్యోత్తరకలలు 156 దీనిని సాయనరవికుంభ రాశిని పొందియుండుటచే కుంభప్రమాణ వినాడికలగు 277-చే పెంచివచ్చిన దానిని 1800-టు భాగింపగానయిన షష్ఠ్యోత్తర లబ్ధమగు నష్టాదిష్టకాల విఘడియలు 24 దీని సహః ప్రమాణమగు 31-36 లలో కలుపగానైన సూర్యోదయాదిష్టకాలము 32-0.

హెచ్చరిక॥ ఇందలి తాత్కాలిక సాయనార్క సాయన లగ్నములగు 4-1-12-22,, 10-3-48-19 లలో సాయనార్కునికి భోగ్యకాలమునూ ; సాయనలగ్నమునకు భుక్తకాలమునూ తెచ్చివానినుండియు 1-వ ఉదా, చొప్పున నిష్టకాలమును సరిపొల్చి మాడుడు:—

అథ దేశాంతర యోజన సాధనక్రమః ॥ సౌరోపనిషత్

మూలం॥ యోజనాని శతాన్యష్టౌ భూకర్ణో ద్విగుణానితు। తద్వర్గతో దశగుణాత్పదం భూపరిధిర్భవేత్। లంబజ్యాఘ్నస్త్రిజీవాప్తం స్ఫుటభూపరిధి స్వకః। అతీత్యో న్మీలనాదిందోః దృక్సిద్ధం కరణాగతాత్। యదాథవేత్త ద్రాప్రోచ్యాం స్వస్థానం మధ్యతోథవేత్। అప్రాప్యవాథవే త్పశ్చా దేవం వాపినిమీలనాత్। తయోరంతర నాడీభి హతా న్యాద్భూపరిధింస్ఫుటం। షష్ట్యావిభజ్యల బ్ధైస్తుయోజనైః ప్రాగథాపరే। స్వదేశపరిధి ర్జేయః కుర్యాద్దేశాంతరంపి తైః॥ (దీని తాత్పర్యోదాహృతములను ముందు సవర్ణింపుతో విస్తారముగా వ్రాయబడుటచేనింకు మూలమును మాత్రము వ్రాయబడియె).

# ఇతి శ్రీ సిద్ధాంత రహస్యే గ్రహతంత్రే త్రిప్రశ్నాధ్యాయోనామపంచమోధ్యాయః

## అథ సిద్ధాంత రహస్యే చంద్రగ్రహణాధ్యాయః.

### గ్రహణ సంభవజ్ఞానము.

శ్లో॥ పర్వాంతార్కేచ యుక్త్వాత స్సపాతార్కో భవిష్యతి।
సపాతార్క భుజాంశాది ర్గ్రహణాంస్యాన్మయాల్పకం ॥

స॥ తా॥ ప్రాతఃకాలిక స్ఫుటార్కునియందు పర్వాంతకాల ఘటికా రూపమగు లిప్తాదినిన్నీ పాతనున్నూ చేర్చగా పర్వాంతకాలిక సపాతార్కుడగును దానిని రవి మందకేంద్రముగ తెలిసి మీదిక్రమముగనే భుజను తెచ్చిచూడగా నా భుజారాశిస్థానమున శూన్యమైయుండి భాగలు 15-లకు తగ్గియుండెనేని నా పర్వాంత కాలమునకు గ్రహణము గలుగునని స్థూలముగ దెలసికొని తరువాతనీ క్రింది గణితక్రమములచే గ్రహణ నిర్ణయములను స్థిరీకరింపవలసినది.

ఉదా:—ప్రాతఃకాలిక సిద్ధాంత స్ఫుటరవిః 3-9-5-29 దీనిలో పూర్ణిమాతిథ్యంత ఘటికాదియగు 30-48-లను లిప్తాదిగ తెలిసిచేర్చగానైన తాత్కాలిక స్థూల రవిః 3-9-36-17 దీనిలోపాత 2-12-11-49-లను చేర్చగానయిన పర్వాంతకాలిక సపాతార్కః 5-21-48-6 దీనిని రవిమందకేంద్రముగ తెలిసి భుజాసాధనమును జేయుటకై నారురాసిలలో తీసివేయగా నిలిచిన సపాతార్కభుజా 0-8-11-54 దీనిలో రాసులు శూన్యమై భాగలు 15-లకు తగ్గియుండుటచేత నీ పర్వాంత కాలమునకు సోమోపరాగము గలుగునని స్థూలముగ తెలిసెను.

ముఖ్య గమనింపు:—మీద తెచ్చియుండు పర్వాంతకాలిక సపాతార్కునియందు భాగాది 15 30-లను తీసివేయగా గతపర్వాంతమునకునూ; చేర్చగా నేష్య పర్వాంతమునకునూ సపాతార్కుడగును.



దానిచే మీదిక్రమముగనే భుజను తెచ్చిచూడగా గతైష్య పర్వములయందలి గ్రహణములు స్థూలముగా తెలియును.

ఉదా:—ఇప్పుడు పూర్ణిమా పర్వాంతకాలిక సపాతార్కుడగు 5-21-48-6 లలో భాగాది 15-30-లను చేర్చగానయిన ముందురాబోవు అమావాస్యాపర్వాంతకాలిక సపాతర్కుడు 6-7-8-6 దీనిభుజా 0-7-18-6 గనుక ఆషాఢ బ 30-కి సూర్యగ్రహణముగునని స్థూలముగా తెలిసెను.

## అథ స్ఫుట పర్వ సాధనమాహ.

శ్లో॥ దృక్సిద్ధ రవి చంద్రేణ సాధయేత్పర్వనాడికాః।
రవి చంద్రౌస్తథాపాత కృత్వాపర్వాంత చాలనం॥

తా॥ మీదచూపియుండు విధముగ స్థూలగ్రహణముగలుగబోవు పర్వాంతకాలమును దృక్సిద్ధ స్ఫుటరవి చంద్రులచే గణించి తెచ్చియుంచుకొనగా నదియే మధ్యపర్వమగును, తాత్కాలికమునకు దృక్సిద్ధ స్ఫుట రవి చంద్రపాతలను తాత్కాలించియుంచుకొనవలసినది. మధ్య పర్వమే గ్రహణ మధ్యకాలము.

### ఉదాహరణము.

ప్రాతఃకాలిక దృక్స్ఫుటార్కః 3-9-10-17 గతిః 57.3 స్ఫుట చంద్రః 9-2-37-42 గతిః 860-8 వీనివి బట్టి మీదిక్రమముగనే తిథినిసాధింపగావచ్చిన పూర్ణిమాతిథ్యంత ఘటికాది 29-20 ఇదే మధ్యపర్వము, తాత్కాలికమునకు వెనుకటి వలెనే రవి చంద్రపాతలను గతి స్ఫుటములచే తాత్కాలించుకొనగానైన స్ఫుట రవి 3-9-38-9 గ 57-3 చంద్రః 9-9-38-9 గ 860-3 పాతః 2-12-13-24 గతిః 3-11

### అథ బింబసాధనక్రమః.

శ్లో॥ పాపఘ్నమర్క భుక్తిస్స్యార్కఖాబ్ధైర్మాన రుచ్యతే।
గోఘ్నచ్ఛశిర్భుక్తి భాసై ర్భక్తాబింబకలాస్మృతాః।
శశినోర్మాన హీనఘ్నె స్సభక్త్వచ్ఛాయయాభవేత్ ॥

తా॥ రవిస్ఫుట గతిని 11-చే పెంచివచ్చిన మొత్తమును 20-చే భాగింపగా వచ్చుకలాదిఫలము రవి బింబమునూ; చంద్ర స్ఫుట గతిని 3-చే గుణించివచ్చిన మొత్తమును 74-చే భాగింపగావచ్చు లిప్తాదిఫలము చంద్రబింబమునూ; చంద్ర బింబమును 18-చే పెంచి వచ్చిన దానిని 7-చే భాగింపగావచ్చు కలాదిఫలము ఛాయా బింబమునూయగును. ఛాయాబింబమనగా భూమినీడ.

ఉదా:—చంద్రగ్రహణానయనమునందు సూర్యబింబమక్కరలేదు చంద్రస్ఫుటగతికలాది 860-3 దీనిని 3-చే పెంచివచ్చిన మొత్తమును 74-చే భాగింపగా వచ్చిన చంద్రబింబ కలాది 34-52,, దీనిని 18-టి గుణించివచ్చిన 627-36-లను 7-చే భాగించితీసిన ఛాయా బింబ కలాది 89-39.

అథ చంద్ర శరసాధనమాహ.

శ్లో॥ పాంసవై ర్ద్వాంతవై శ్శైషభః క్రమాత్ర్పవకస్మృతాః ।
సపాత చంద్ర బాహుస్యాస్మనోపాశ్శైక చాల్పకం ।
భాకాదిస్యాత్కలీకృత్య క్రమాధృవక తాడితాః ।
భక్తంస్యాత్తవహ స్సేణసోమేశర కలాస్మృతాః ॥
తత్ర దిక్పద సంజ్ఞానాహ ॥
అజాదికే చోత్తరంచ దులాదౌచయమస్తథా ।
ఓజయుగ్మ జయుగ్మస్యాత్క్రిమాచ్చక్రే పదస్మృతాః ॥

స॥ తా॥ తాత్కాలిక చంద్రునియందు పర్వాంత పాతను చేర్చగా సపాత చంద్రుడగును. దానిని బట్టి చంద్రమందకేంద్రమునుండియు భుజాసాధనమును జేసియుండు మాదిక్రమముగనే భుజను తెచ్చియుంచుకొని నా భుజను అర్ధోత్తర లిప్తలు చేసివచ్చిన దానిని సపాత చంద్ర భుజాంశములు 5-లకు తగ్గియుండు నపుడు 471 చేతనూ 5-లకు మించి 10-లకు తగ్గియుండునపుడు 468 చేతనూ అంత కంటెను మించియుండునపుడు 465-చేతనూ గుణించివచ్చిన మొత్తమును 6000 ఆరు వేలుచే భాగింపగావచ్చు కలాదిఫలమును చంద్ర శరమనియూ విక్షేపమనియూ చెప్పబడును.



అందు సపాతచంద్రుడు మేషాదిలోనుండినయుత్తరశరమనియూ తులాదిలో నుండిన దక్షిణశరమనియూ, 3 రాసులకు తగ్గిగానీ లేక 9-రాసులకుతగ్గి నారు రాసులకుమించిగానీ యుండునపుడు ఓజపదమనియూ; 3 రాసులకుమించి నారు రాసులకు తగ్గిగానీ లేక 9 రాసులకు మించిగానీ యుండునపుడు యుగ్మపదమనియూ తెలియవలసినది.

*N. B.* ఈదిక్పద నిర్ణయక్రమమును జాగ్రతగా పాఠము చేసియుంచుకొని యుండవలసినది.

ఉదా:—తాత్కాలిక చంద్రుడగు 9-9-38-9 లలో పర్వాంత కాలపాత యగు 2-12-13-24.లను చేర్చగానైన సపాత చంద్రః 11-21-51-33 దీని భుజా 0-8-8-27 దీనినర్ధోత్తరకలలు 488 దీనిని సపాత చంద్ర భుజాంశములు 5-లకు మించి 10-లకు తగ్గియుండుటచే 468-టి పెంచివచ్చిన మొత్తమును 6000చే భాగించి తెచ్చిన కలాదిఫలము 38-4 ఇది సపాత చంద్రుడు 9 రాసులకుమించి తులాదిలో నుండుటచే యుగ్మపద దక్షిణశరమగును 38-4.

అథ గ్రాసాంశసాధనమాహ.

సర్వాంత శశివిక్షేపం గ్రాహ్యచ్ఛాయాక్షి బింబయోః । యోగార్ధశోధ్య శేషంస్యా చ్ఛన్నలిప్తాః ప్రకీర్తితాః ॥ తాపఘ్నచ్ఛన్న లిప్తాస్యుచ్ఛశిమానాప్తయోః ఫలం । తోయభాగ్యై సదాసోమేముపరాగ ప్రమాణకం । తపోధికస్తత్రపూర్ణే సదాఖండే తపాల్పకం । ప్రమాణం గ్రహణౌ మేవ రవి చంద్రవినిశ్చితం ॥

తా॥ చంద్రఛాయా బింబములరెంటినీ కలియగూర్చి దాని నర్ధింపగా బింబ యోగార్ధమగును. దానిలో నీ మీద తెచ్చియుండు చంద్రశరమును తీసివేయగా నిలుచు శేషమే గ్రాసకలలగును. దానిని 16-చే పెంచి వచ్చిన మొత్తమును. చంద్ర బింబముచే భాగింపగా షోడశాంశారూపమగు గ్రాసాంశములగును. అది 16-కంటెను మించియుండునపుడు పూర్ణగ్రహణమనియూ; తగ్గియుండునపుడు ఖండగ్రహణమనియూ బింబయోగర్ధమునకంటెను శరమధికముగా వచ్చియుండు నపుడు గ్రహణాభావమనియూ తెలియవలసినది.

ఉదా.—చంద్రబింబ కలాది 34-52 ఛాయా బింబ కలాది 89-39 ఈ రెండు బింబములనూ చేర్చి సర్ధీకరింపగానైన బింబయోగార్ధము 62-16 దీనిలో పూర్వ సాధిత శరమగు 38-4-లను తీసివేయగానిలిచిన గ్రాసలిప్తలు 24-12 దీనిని 16-చే పెంచివచ్చిన మొత్తమును చంద్రబింబముచే భాగింపగావచ్చిన గ్రాసవిసములు 11-6 ఇది 16 లకంటెను తగ్గియుండుటచే ఖండగ్రహణమని తెలిసెను.

గమనింపు:-గ్రాసకలా సవర్ణమును 100-చే పెంచివచ్చినదానిని చంద్ర బింబ సవరణచే భాగింపగా 100-లోని భాగములగును. ఈక్రమముగనే 1, 10, 100, 1000, ఈ మొదలగువానియందలి భాగములనూహించునది ఉదా, 100-లో 70 ఇందుకు $\frac{70}{100} = \frac{7}{10}$.

అథ స్థిత్యర్ధసాధనక్రమః.

శ్లో॥ బింబైక్య దళవర్గేణ శరవర్గోనితం పదం ।
సతఘ్నుస్థితిగత్యాప్తం మధ్యేస్థిత్యర్ధనాడికాః ॥

తా॥ బింబయోగార్ధ వర్గమునందు శరవర్గమును తీసివేయగానిలుచు వర్గాంతర మునకు మూలమెత్తి వచ్చిన లిప్తాదిఫలమును విలిప్తలుజేసినయినదానిని తిథిగతి లిప్తలచే భాగింపగా వచ్చు లబ్ధము నాడికాదిగ మధ్యస్థిత్యర్ధమగును.

ఉదా:—బింబయోగార్ధమగు 62-16-లను వర్గింపగానయిన 3877-8-లలో శరమగు 38-4-లను వర్గింపగానైన 1449-4-లను తీసివేయగానిలిచిన వర్గాంతరము 2428-4 దీని మూలము 49-16 దీనిని విలిప్తలుచేయగానైన 2956-లను తిథిగతి లిప్తలగు 803-చే భాగించి తీసిన నాడికాదిఫలము 3-41 ఇదే మధ్యస్థిత్యర్ధము.

అథ స్పర్శమోక్షదళానయనక్రమః.

శ్లో॥ సచంద్ర పాత బాహుస్స్యా దంశాస్త్రిఘ్నస్సమంపలాః ।
మోజే ధనర్ణ మధ్యేతు స్థితియుగ్మే విపర్యయః ।
ప్రవేశనిర్గమాంతతో క్రమాత్ స్థిత్యర్ధ మీరితః ॥



తా॥ సపాత చంద్ర భుజాంశాదిని ద్విఘ్నింపగావచ్చు సర్ధోత్తరాంశ ములను వినాడికలుగ తెలిసి దానిని శరము ఓజపదములోనుండునపుడు మధ్యస్థిత్యర్ధ ములో చేర్చగ స్పర్శస్థితి దళమునూ; తీసివేయగా మోక్షస్థితి దళమునూ యగును యుగ్మ పదశరముగనుండునపుడు మీదిక్రమమునకు విపరీతముగ ననగా మధ్య స్థిత్యర్ధములో తీసివేయగ స్పర్శ స్థితి దళమునూ చేర్చగా మోక్షస్థితి దళమునూ యగును

ఉదా:—సపాత చంద్ర భుజాభాగాది 8-8-27 దీనిని రెట్టింపగావచ్చిన అంశాది 16-16-54 దీని సర్ధోత్తరాంశములగు వినాడికలు 16-దీనిని చంద్రశరము యుగ్మపదములో నుండుటచే మధ్యస్థిత్యర్ధమగు 3-41 లలో తీసివేయగానైన స్పర్శ స్థితి దళము 3-25, చేర్చగానైన మోక్షస్థితిదళము 3-57.

పూర్ణగ్రహణే విమర్దార్ధాద్యానయనక్రమః.

శ్లో॥ మానాంతరార్ధ కృతమోక్షేపవర్గోనితం పదం ।
శేషం పూర్వోక్తవిధినా సర్వం మార్దవ కార్యకం ॥

స॥ తా॥ ఛాయాబింబములో చంద్రబింబమును తీసివేయగానిలుచు దాని సర్ధీకరించి వర్గింపగా నగుబింబాంతరార్ధ వర్గములో శరవర్గమును తీసివేసి మిగిలిన దానికి మూలమెత్తివచ్చిన కలాదిఫలమును విలిప్తలుచేసినయిన దానిని వ్యర్కేందు గతి లిప్తలచే భాగింపగావచ్చు నాడికాది ఫలమే మధ్యవిమర్దార్ధమగును.

పిమ్మట మధ్య స్థిత్యర్ధమునుండియు స్పర్శమోక్ష స్థితి దళములను తెచ్చి యుండు నీ మీదిక్రమములుగనే సపాత చంద్ర భుజాంశములచే నెత్తబడు వినాడి కలను ఓజయుగ్మ పదశరమును బట్టి మధ్యవిమర్దార్ధములలో వెనుకటి వలెనే క్రమ ముగ ధన ఋణ ఋణ ధనముల న్యాయములో సంస్కరించి వరుసగా స్పర్శమోక్ష విమర్ద దళములను తెచ్చియుంచుకొనవలసినది.

ఉదా:—ఖండగ్రహణముగుటచే విమర్దార్ధలు జనింపవు.

## అథ స్పర్శాది కాలానయనక్రమః.

శ్లో॥ పర్వాన్తస్యా స్థితిదళౌ క్రమాదృణధనం భవేత్ ।
ప్రవేశ నిర్గమౌమధ్యే మార్ధ ఖండేస్తథైవచ ॥

స॥ తా॥ మధ్యపర్వమే గ్రహణమధ్యకాలమగును గనుక దానియందు స్పర్శస్థితి దళమును తీసివేయగా స్పర్శకాలమునూ ; మోక్షస్థితి దళమును చేర్చగా శుద్ధ మోక్షకాలమునూ యగును. పూర్ణగ్రహణమునందదే విధమున స్పర్శవిమర్ద దళమును తీసివేయగ నిమీలనకాలమను బింబముపూర్తిగా గప్పబడు కాలమునూ, మోక్షవిమర్ద దళమును చేర్చగానున్మీలనకాలమను కానరాకుండిన బింబము మరల కనుపించుటకారంభించు కాలమునూయగును.

మరియూ మధ్యవిమర్దార్ధా ద్విగుణము బింబాదర్శనకాలమగు బింసశూన్యకాలమునూ మధ్యస్థిత్యర్ధా ద్విగుణము గ్రహణాద్యంత కాలమగు స్పర్శాది మోక్షాంత కాలమునూ యగునని తెలియవలసినది.

ఉదా:—స్ఫుట దృక్పర్వకాలమగు మధ్యపర్వము 29.20 ఇదేగ్రహణమధ్య కాలమగును గనుక దీనిలో స్పర్శ స్థిత్యర్ధమగు 3.25-లను తీసివేయగానైన స్పర్శ కాలము 25-55 మోక్షస్థితి దళము 3-57-లను చేర్చగానైన మోక్షకాలము 33-17 ఇందు గ్రహణాద్యంత కాలము 7-22 ఘటికాదియగును.

## ఆథ దిగ్వర్ణాదయః.

మూ॥ చంద్రస్య గ్రహణే సౌమ్య శరాద్దక్షిణ గోళతః ।
నిమీలనంతు వాయువ్యా మీశాన్యే న్మీలనంభవేత్ ।
సర్వగ్రాసే ఽథోర్యామ్య శరశ్చేత్సౌమ్య గోళతః ।
నైరుత్యాం మీలనం వహ్నేః ద్దిశ్యున్మీలన మేవహి ॥
బింబస్యోం దోః పూర్వభాగే స్పర్శః పశ్చాద్విమోచనం ॥
దక్షిణే శరసవ్యంస్యాదుత్తరే మపసవ్యకం ॥
సూర్యస్యపశ్చిమే స్పర్శః ప్రాచ్యాం మోక్షస్సదాభవేత్ ॥
ధూమ్రః కృష్ణః పింగళోల్పార్ధసర్వగ్రస్తశ్చందోర్కస్తుకృష్ణస్సదైవ॥



తా॥ ప్రాక్స్పర్శః, ప్రత్యఙ్మోక్షః, తతోత్తరశరే దక్షిణ గోళం వాయవ్య నిమీలనం, ఈశాన్యోన్మీలనం దక్షిణశరే ఉత్తరగోళం నైరుత్యాం మీలనం ఆగ్నేయోన్మీలనం.

ఖండగ్రహణమునందు. ఉత్తరశరమగునపుడాగ్నేయస్పర్శమున్నూ నిరరుతి మోక్షమున్నూ దక్షిణశరమగునపుడీశాన్యస్పర్శమున్నూ వాయవ్య మోక్షమున్నూ గలుగును. పరియూ శరము దక్షిణ దిక్కుగానుండునపుడు సవ్యగ్రహణమనియూ నుత్తర దిక్కుగానుండునపుడపసవ్యగ్రహణమనియూ ; రవిచంద్రులకు సమీపమున రాహువుండిన రాహుగ్రస్తమనియూ ; కేతువుండిన కేతుగ్రస్తమనియూ రవి చంద్ర గ్రహణముల రెంటియందునూ తెలియవలసినది.

పాదగ్రాసే ధూమ్రవర్ణః, దళగ్రాసే నీలవర్ణః, తదుపరి పింగళవర్ణః ఇట్లు చంద్రగ్రహణము నందలి వర్ణములనూహింపనగును.

ఉదా:—ఈ గ్రహణము దక్షిణ విక్షేపముగల చంద్ర ఖండగ్రహణమగుటచే ఈశాన్యస్పర్శమున్నూ వాయువ్య మోక్షమున్నూగల సవ్యగ్రహణమునూ దళగ్రాసాల్పాధికమగుటచే నీలపింగళమిశ్రవర్ణమునూ చంద్రునకు సమీపమున రాహువుండుటచే రాహుగ్రస్తమునూ మరియూ స్పర్శకాల ఘడియలు పగటిలోచేరి మోక్షకాలము రాత్రిలోచేరియుండుటచే గ్రస్తోదయమనియూ తెలిసెను గనుక

భావసంఆషాఢ శు 15 స్థాన్ గురు వాసరే రాహు గ్రస్తగ్రస్తోదయ సోమోపరాగః మిశ్రవర్ణం ఉత్తరగోళే సవ్యగ్రహణం ఈశాన్యేస్పర్శకాల ఘటికాః 25-55 మధ్యకాల ఘటికాః 29-20 శుద్ధ మోక్షకాల ఘటికాః 33-17 గ్రాసాంశాః 11-6 గ్రహణాద్యంత పుణ్యకాల ఘటికాః 7-22 యగునని తెలిసెను.

## అథ చంద్రోదయకాల సాధనక్రమము.

శ్లో॥ సషడ్భస్తార్క చంద్రేచ వివరం స్యాత్కలీ కృతం ।
నార్తాండభిర్భక్తలబ్ధ ముహూర్తాంతర నాడికాః ॥
అర్కాద్యదాధికశ్చంద్రేస్త దా దినయుతం కృతం ।
విపర్యయత్వా ద్వివర శ్చంద్రోదయమితీరితః ॥

తా॥ అస్తకాలమునకు రవిచంద్రులను తెచ్చి రవిలో నారురాసులను చేర్చికొనగానగు రవికినీ తాత్కాలిక చంద్రునికి నీనడుమనుండు అంతరాళమును లిప్తలు చేసివచ్చిన దానిని 360-ట భాగింపగావచ్చు ఘటికాదిఫలమును మీఁదిరవిచంద్రులలో రవి తక్కువగానుండునపుడహర్మానములో ధనమునూ చంద్రుడు తగ్గియుండునపుడు ఋణమునూ చేసికొనగా సూర్యోదయాదిగ చంద్రోదయకాలమగును.

ఉదా:—అహః 31-36 ఇదే అస్తకాలము ఈ కాలమునకు రవిచంద్రులను దెచ్చి రవిలో వారు రాసులను చేర్చకొనగానైన అస్తకాలగ్రహములు రవిః 9-9-40-15 చంద్రః 9-10-11-25 వీని అంతర భాగాది 0-31-10 దీనిలిప్తలు 31 దీనిని 360-ట భాగింపగావచ్చిన ఘటికాదిఫలము 0-6 దీనినిసూర్యుడు తగ్గియుండుటచే దినమానములో చేర్చగానైన చంద్రోదయకాలము 31-41 అనగా సూర్యాస్తమానానంతరం చంద్రోదయమగుటకు 5-విఘడియలగునని తెలియవలసినది.

సూర్యోదయాదికాల ఘంటాద్యానయనక్రమః.

శ్లో॥ రాత్రిమానం విలిప్తాస్యు ర్భాజయే ర్నగైః క్రమాత్ ।
లబ్ధం పరదినే ప్రాతః కాలఘంటాము దీరయేత్ ॥

తా॥ రాత్రిప్రమాణ వినాడికలను 300-చే భాగించి కలాదిఫలమువలెనే సాధింపగావచ్చునదియే సూర్యోదయాదికాలమునకు ఘడియారమునందలి ఘంటలగును.

ఉదా:—దినమానమునరువదిలో తీసివేయగా నిలిచిన రాత్రి ప్రమాణ ఘటికాది 28-24 దీని విఘటికలు 1704 దీనిని 300-చే భాగింపగావచ్చిన కలాది ఫలమగు ఘంటాది 5-41 దీనిని చూచి నేఁడుదయకాలమునకు 5-ఘంటలు 41 నిముషములగునని తెలిసెను.

గమనింపు—ఒక ఘంట కాలమునకు రెండున్నర ఘడియలగును గనుక ఇష్టకాల ఘటికాదిని విఘడియలుచేసి వచ్చిన మొత్తమును 150-చే భాగింపగా నిష్టఘడియలకు ఘంట్యాదికాలమగును, దానిని సూర్యోదయాది కాలఘంటాదిలో సంస్కరించి సూర్యోదయాదీష్టకాలమును ఘంటలలో జూనవచ్చును. నిముషము 1-కి విఘడియలు రెండున్నరలగుననియూ నొకవిఘడియకు 24 సెకండ్లగుననియూ తెలియవలసినది.



ఉదా—అహః 31-36 దీని వినాడికలు 1896 దీనిని 150-ట భాగింపగా వచ్చిన అహర్మాన ఘంటాది 12-38 దీనిని వుదయకాల ఘంటలగు 5-41-లలో చేర్చగానైన అస్తకాలఘంటలు 6-19 అదే విధమున సూర్యోదయాది మోక్షకాల ఘటికాదియగు 33-17-లను ఘంటాదిచేయగానైన 13-19 అనగా 1-19-లను వుదయకాల ఘంటలలో కలుపగానయిన మోక్షకాల ఘంటాః 7-0.

ఈ క్రమముగనే తక్కిన కాలములనూ ఘంటాదిగజేయవచ్చునని నూహింపవలసినది.

## ఇతి శ్రీ సిద్ధాంత రహస్యే గ్రహతంత్రే చంద్రగ్రహణాధ్యాయోనామషష్ఠః

## అథ సిద్ధాంత రహస్యే రవిగ్రహణాధ్యాయః.

శ్రీ సూర్యనారాయణస్వామినే నమః.

గ్రహణము గలుగబోవు అమావాస్యా పర్వమును దృక్స్ఫుట రవిచంద్రులచే తెచ్చినా పర్వాంతకాలమునకు రవిచంద్రపాతలను నీ వెనుకటివలెనే తాత్కాలించియుంచుకొనవలసినది.

ఉదా:—భావసంవత్సరాషాఢకృ 30-లు శుక్రవారమునాటికి స్థూలముగ సూర్యగ్రహణముగలుగునని నీ వెనుకనే తెలసియున్నది గనుక నాటిగ్రహణానయనమును గూర్చి వుదాహరణ గణితక్రమముజూపపడును.

లంకాప్రాతఃకాలిక దృఙ్మధ్య గ్రహములు రవిః 3-24-19-9 చంద్రః 3-21-0-0, తుంగః 8-9-8-4, పాతః 2-12-59-30 వీనిని బట్టి వెనుకటివలెనే

స్ఫుటీకరింపగానైన స్వదేశ ప్రభాతకాలిక దృక్ స్ఫుట గ్రహములు రవిః 3-23-28-16 గతిః 57-22 చంద్రః 3-19-39-19 గతిః 722.26 పాతః 2-12.59-30 గతి 3-11 అహరర్ధము 15-38 అహః 31-16 అయనాంశములు 21-31-44 ఇందు దృగ్గణిత పర్వాంతమగు అమావాస్యా తిథ్యంతకాల ఘటికాది 20-39-లగుసు. తాత్కాలిక స్ఫుటార్కః 3-23-48-25 గ 57-22 చంద్రః 3-23-48-25 గ 722-26 పాతః 2-13-0-36 ఇట్లు దృక్ స్ఫుట తిథ్యంతకాలమునకు రవిచంద్రపాతలను తెచ్చియుంచు కొనవలయును.

## అథ ద్యుగత ఘటికాసాధనక్రమః.

హా॥ మహతార్కేన లగ్నంస్యాత్త్రిఘ్నాంశాద్యుగతంసదా ॥

తా॥ పర్వాంత కాలమునకు సాయనార్క సాయన లగ్నములను తెచ్చి యుంచుకొని సాయన లగ్నములో సాయ నరవిని తీసివేయగానిలుచు రవిలగ్నాంతర రాశ్యాదిని 6-చే పెంచి తత్స్థానములెత్తి రాశ్యాదిగజేసి (ఇందు భగణశోధనములేదు) అంచలి భాగాదిని ద్విఘ్నింపగా రాశ్యాది గణితముపోయి ద్యుగతఘటికాదియగును.

ఉదా:—స్ఫుట పర్వాంత కాలము 20-39 తాత్కాలిక స్ఫుట రవిః 3-23-48-25 అయనాంశయుత సాయనార్కః 4-15.20-9 దీనిని బట్టి లగ్నస్ఫుట మున చూపియుండు మీదిక్రమముగనే భోగ్యభాగాదిని తెచ్చి లగ్నస్ఫుటమును చేయగావచ్చిన సాయన లగ్నము 8-13-38-40 దీనిలో సాయన రవిని తీసివేయగా నిలిచిన రవి-గ్నాంతర రాశ్యాది 3-28-18-31 దీనిని 6-చే పెంచి తత్స్థానములనెత్తి రాశ్యాదిగ చేయుగానైనది 19-21-32-35 దీని భాగాదిని ద్విఘ్నింపగావచ్చిన ద్యుగత ఘటికాది 19-43-5-10 దీనినర్ధోత్తర వినాడికాంతఫలము 19-43 ఘటికాదియగును.

## అథ మధ్యలంబన సాధనక్రమః:

శ్లో॥ ఘటికాద్యుగతం లంకాది నాడ్యా ద్వివరం నతం ।
నతోనిత నష్టైశ్శేషం నతేన గుణితం దళం ।
కృత్వాస్యాదక్ష కర్ణాప్తం సదా లంబననాడికాః ॥



సవర్ణీకృత తా॥ మీద తెచ్చియుండు ఘటికాది ద్యుగతము 15 0-లకు తగ్గియుండునపుడా ద్యుగతమునే 15-0-లలో తీసివేయగనూ ; 15-0-లకు మించి 30-0-లకు తగ్గియుండునపుడా ద్యుగతమునసే 15-0-లను తీసివేయగనూ ; ద్యుగతము 30-0-లకు మించి 45.0 లకు తగ్గియుండునపుడా ద్యుగతమును 45.0లలో తీసివేయగనూ, 45.0-లకు మించియుండు ద్యుగతమునసే 45-0 లను తీసివేయగనూ లంకానతమగును.

అట్టి నతమును 20-0 ఘడియలలో తీసివేయగా నిలుచు శేషమును అదే నతముచే పెంచివచ్చిన మొత్తము నర్ధీకరింపగానయిన దానిని స్వదేశ విషువత్కర్ణముచే విభజింపగావచ్చు కలాదిఫలమే నాడికాదిగ మధ్యలంబనమగును.

ఉదా:—ద్యుగతఘటికాది 19-43 ఇది 15-0-లకు మించి 30-0-లకు తగ్గియుండుటచే 15-లను తీసివేయగానైన నతఘడియలు 4-43 దీనిని 20-ఘడియలలో తీసివేయగా నిలిచిన 15-17-లను నతమగు 4-43 చే గుణింపగావచ్చిన కలాది 72-5 దీనిలో సగము 36-2 దీనిని విషువత్కర్ణమగు 12-18 లచే భాగింపగావచ్చిన నాడికాది మధ్యలంబనము 2-56.

## అథ మధ్య లంబన సంస్కార క్రమః.

శ్లో॥ క్రమాత్కపాలభేదేన మధ్యేఋణాధనం స్మృతం ।
దృక్పర్వ స్ఫుట మధ్యంస్యాస్తథా చంద్రార్కచాలనం ॥

స॥ తా॥ మీద తెచ్చియుండు మధ్యలంబనమును ప్రాక్పర్వముగనుండునపుడు పర్వములో ఋణమునూ పశ్చాత్పర్వముగనుండునపుడు ధనమునూ చేసికొనగా లంబన సంస్కృతమగు మధ్యపర్వమగును. ఇదే గ్రహణమధ్యకాలము.

---

నోట్॥ ప్రభాతకాలమున పూర్ణఫలమిచ్చిన నతము వక్రగతిచే మధ్యాహ్న కాలమున శూన్యమై మరల వృద్ధి క్రమమున నస్తకాలమున పూర్ణఫలమిచ్చుటచే అస్త కాలమున పూర్ణఫలమిచ్చిన నతము వక్రగతిచే మరల నిశీథకాలమున శూన్యమై మరల వృద్ధికెక్కుచుండునని గమనించి తెలియవలసినది.

తరువాత రవి చంద్రుల స్ఫుట గతులను లంబనముచే వేరువేరుగా హెచ్చించివచ్చిన దానిని 60-ట భాగించి తెచ్చిన లిప్తాదిఫలములను ప్రాక్పర్వముగనుండునపుడు ఆయాపర్వాంత గ్రహములలో తీసివేయగనూ; పశ్చాత్పర్వముగనుండునపుడు చేర్చగనూ మధ్యపర్వాంత గ్రహములగుదురు. పాతకు లంబన చాలిత తాత్కాలిక ఫలము మిగుల స్వల్పముగ వచ్చుటచే తాత్కాలికీ కరణము చెప్పలేదు.

ఉదా:—దృక్పర్వకాలము 20-39 ఇది పశ్చాత్పర్వములో చేరియుండుటచే దీనియందు మధ్యలంబనమగు 2-56 లను చేర్చగాసైన లంబన సంస్కృత మధ్య పర్వమగు గ్రహణ మధ్యకాలము 23-35.

ఇందలి లంబన నాడికాదియగు 2-56-లచే రవి చంద్రుల స్ఫుటగతులను వేరువేరుగా గుణించివచ్చిన మొత్తములను వరుసగా 60-ట భాగించి తెచ్చిన తాత్కాలిక ఫలములు కలాది రవికి 2-50 చంద్రునకు 35-25 ఈ ఫలములను పర్వాంత కాలిక రవి చంద్రులలో పశ్చాత్పర్వమగుటచే చేర్చగాసైన మధ్యపర్వాంత కాలిక స్ఫుటగ్రహాః రవిః 3-23-51.15 గతిః 57-22 చంద్రః 3-24.23 50 గతిః 722-26.

నతసాధనమాహ.

శ్లో॥ ఖమధ్య గ్రహయోర్మధ్య కాలోయస్సనతో భవేత్ ॥ *

* ఇంద్రీక్రమము చెల్లదని కొందరభిప్రాయ పడినను, ఈ సందర్భము నందీక్రమము దప్ప గ్రస్తోదయాదులను సరిచెప్పు వేరుక్రమములగుబడదు గాకనూ 1 రాశి కానీ, లేక, క-మ, గతులకు సంబంధపడిన మూడు రాసులుకానీ, అథవా నుత్తర దక్షిణదిక్సంబంధములుగల నారురాసులుగానీ అది తప్పినగ తైష్యభేదమగు చక్రరాసులుగానీ ఫలసాధన గణితక్రమములలో పరమఫలాద్యంత ప్రమాణము గల హైయ్యుం డునేదప్ప అందెప్పుడునూ భాగాంశములొచ్చుటలేదు. (గ్రంథాంత చక్రమను చూడుము, ఇది గ-సూ, మగుటచే బాగుగ యోచింపవలెను.) ఇందు మీద ప్రత్యక్ష విరోధము లేని గ్ర, స్తోదయాదులను సరిచెప్పు గణిత క్రమము నుభయవాదులునూ అంగీకరింపవలసిన దనుట సర్వవాదాంశ మైయుండును.



తా॥ లంబన సంస్కృతమగు మధ్యపర్వము ప్రాక్కపాలములో చేరియుండునపుడు పర్వాంతకాలము మొదలు రాబోవు మధ్యాహ్నపర్యంతముగల భోగ్యకాలము ప్రాఙ్నతమనియూ; ప్రత్యక్కపాలములో చేరియుండునపుడు మధ్యాహ్నము మొదలు పర్వాంతమువరకూ గతించియుండు భుక్తకాలమును పశ్చాన్నతమనియూ తెలియవలసినది.

ఉదా.—ఇందలి మధ్యపర్వ ఘటికాదియగు 23-35-లు పశ్చాత్కపాలములో చేరియుండుటచే మధ్యాహ్నము మొదలు పర్వాంతకాలమువఱలో గతించియుండు భుక్తకాలము కావలయును గనుక పర్వఘటికలలో దినార్ధను తీసివేయగాసైన పశ్చాన్నత ఘడియలు 7-57.

ఖార్కానయనం.

శ్లో॥ మహ్యాతానత భాద్యాదిస్తత్కాలార్కేవియుగ్యుతం ।
క్రమాదభీష్ట ఖార్కస్స్యాత్పూర్వాపరనతే స్ఫుటా ॥

తా॥ మీదవచ్చియుండు నతమునందలి ఘడియలనదే విధముగనుంచుకొని వినాడికల నర్ధీకరింపగా ఘటికాది న్యాయమువిడిచి రాశ్యాదియగును. దానినయిదుచే భాగింపగావచ్చు రాశ్యాదిఫలమును పూర్వనతముగానుండునపుడు పర్వాంతార్కునియందు ఋణమునూ, అపరనతముగా నుండునపుడు ధనమునూ చేసికొనగా ఖార్కుడగును.

ఉదా:—అపర నతఘటికాది 7-57 ఇందలి విఘటికల నర్ధీకరింపగాసైన రాశ్యాది 7-28-30 దీనినయిదింట భాగింపగావచ్చిన రాశ్యాదిఫలమగు 1-17-42 లను పశ్చాన్నతమగుటచే పర్వాంతార్కునియందు చేర్చగాసైనఖార్కః 5-11-33-15.

ఖార్కావనతి సాధనం.

శ్లో॥ చలాంశ సహితో ఖార్కాత్స్వదేశచరమానయేత్ ।
గౌరాప్తచర లిప్తాస్స్యుఃస్తత్ఫలంనతి లిప్తకాః ।
ఖార్కసాయన మేషాది క్రిమాశ్చోత్తర దిక్సదా ॥

తా॥ ఖార్కునియందయన భాగలను చేర్చగా సాయన ఖార్కుడగును. దానిని బట్టి స్వదేశ చరఖండములచే (స్ఫుటాధ్యాయమునందలి అహర్దళ సాధనక్రమములను చూడుము) చరఫల కలాదిని తెచ్చి దానిని 3-చే విభజింపగావచ్చు లిప్తాదిఫలము ఖార్కావనతియగును. అందు సాయన ఖార్కుడు మేషాదిలో నుండునపుడుత్తరావనతియనియూ ; తులాదిలోనుండునపుడు దక్షిణావనతియనియూ తెలియవలసినది.

ఉదా :— ఖార్కునితోనయనాంశలను కలుపగానయిన సాయన ఖార్కుడు 6-?-4-59 దీని భుజా 0-3-4-59 దీనినర్ధోత్త లిప్తలు 185 దీనిని సాయన ఖార్క భుజా రాశి స్థానము శూన్యమగుటచే ప్రథమ చరఖండమగు 27-చే పెంచి వచ్చిన దానిని 1800-చే భాగింపగావచ్చిన కలాదిఫలము 2-46 దీనిని 3-చే పాలుగొట్టగానైన ఖార్కావనతి కలాది 0-55 దీనిని సాయన ఖార్కుడు తులాదిలోనుండుటచే దక్షిణావనతియని తెలియవలసినది.

## స్వదేశ దక్షిణావనతి సాధనం.

శ్లో॥ నామాంతరా మకుబింబ స్త్రిఘ్నచ్ఛాయేనతాడితాః ।
శూరభిర్భక్త లబ్ధంస్యాన్నతి లిప్తాహియామ్యదిక్ ॥

తా॥ 50-0 లలో విషువచ్ఛాయను తీసివేయగా నిలుచు శేషమును రెంటిచే గుణింపబడిన విషువచ్ఛాయచే పెంచివచ్చిన మొత్తమును (అర్థింపగా లంకా స్వదేశ మధ్యస్థిత దక్షిణయోజనములగును.) 25-ట పాలుగొట్టగావచ్చు లిప్తాది ఫలమును స్వదేశ దక్షిణావనతియని చెప్పబడును. (దీనికి మార్పులేదు)

ఉదా.—50-0 లలో విషువచ్ఛాయయగు 2-41-ని తీసివేయగా నిలిచిన 47-19-లను రెంటిచే గుణింపబడిన విషువచ్ఛాయయగు 5-22-చే పెంచివచ్చిన మొత్తమును 25-ట భాగింపగావచ్చిన స్వదేశ దక్షిణావనతి కలాది 10-9 ఈ స్వదేశ దక్షిణావనతికి మార్పులేదని తెలియవలసినది,



శ్లో॥ యామ్యదిగ్వనతీఖార్కాద్వనతీర్యగ్నమైకదిక్ ।
ధనంస్యాదన్యథాతేచరంతరేధిక దిక్తథా ॥

తా॥ ఖార్కావనతియూ స్వదేశదక్షిణావనతియూ నీ రెండునూ నేక దిక్కుగనుండునపుడు రెంటినీ చేర్చగనూ భిన్నదిక్కులుగనుండునపుడధికములో నల్ప మును తీసివేయగనూ అవనతి స్ఫుటమగును. అందెపుడునూ అధికావనతియొక్క దిక్కునె స్ఫుటావనతి పొందియుండునని తెలియవలసినది.

ఉదా:—దక్షిణఖార్కావనతి 0-55 స్వదేశ దక్షిణావనతి 10-9 ఈ రెండవనతులునూ నొకేదిక్కునుపొందియుండుటచే నీ రెంటినీ చేర్చగానయిన దక్షిణ స్ఫుటావనతి కలాది 11-4.

## శరసాధనము.

శ్లో॥ దృక్సిద్ధ స్ఫుట పర్వాన్త శ్చంద్ర విక్షేపసాధయేత్ ।
సంస్కారనతి దిగ్భేదాచ్ఛరస్యా స్ఫుటమీరితః ॥

తా॥ మధ్యపర్వాంత కాలిక చంద్రునిలో పాతను చేర్చి చంద్రగ్రహణాధ్యాయమునందు చెప్పియుండు వెనుకటి క్రమములుగనే విక్షేపమును తెచ్చియుంచుకొని నావిక్షేపమునూ స్ఫుటావనతియునూ ఏకదిక్కుగానుండునపుడవి రెంటినీ కలియ కూర్చగనూ భిన్నదిక్కులుగానుండునపుడధికములో నల్పమును తీసివేయగనూ సపాతచంద్ర దిక్పదములతో చేరియుండు స్ఫుటశరమగును.

ఉదా:—లంబన సంస్కృత మధ్య పర్వాంతకాల సోమః 3-24-23-50 దీనిలో పాతను చేర్చగానైన సపాత చంద్రః 6-7-24-26 తద్భుజా 0-7-24-26 దీని నర్ధోత్తరలిప్తలు 444 దీనిని 468-చే పెంచివచ్చిన మొత్తమును నాలువేలుచే విభజింపగావచ్చిన కలాది విక్షేపము 34-38 సపాతచంద్రుడు తులాదిలో నుండుటచే నీ విక్షేపము దక్షిణదిక్కుగలదైయుండును గనుక స్ఫుటావనతి విక్షేపములు రెండునూ నేకదిక్కునే పొందియుండునని తెలసి నీ రెంటినీ చేర్చగానైన ఓజపద దక్షిణ స్ఫుట శరకలాది 45-42.

## అథ బింబసాధనాది క్రమః.

శ్లో॥ బింబానామర్క చంద్రేణ భవాయాప్తశరంఫలం ।
స చంద్ర పాత బాహుస్త్రీఘ్నాంశవత్సంస్కారేదిహ ।
శేషంగ్రాసాది సర్వం స్యాత్సాధయే చ్ఛీతరశ్మివత్ ॥

ఇందుకు తా॥ ను సవర్ణింపుతో తెలుపబడును.

తా॥ చంద్రగ్రహణాధ్యాయమునందు చెప్పియుండు మీదిక్రమముగనె రవి చంద్రులకు బింబ ప్రమాణకలాదులను దెచ్చివాని రెంటినీ చేర్చి వర్ధీకరింపగా సూర్యగ్రహణా నయనమందలి బింబయోగార్ధమగును. దానిలో స్ఫుటశరమును తీసివేయగా నిలిచినది గ్రాసకలలగును.

ఉదా:—రవి స్ఫుటగతిని 11-చే పెంచివచ్చిన దానిని 20-చే భాగింపగా వచ్చిన సూర్య బింబ ప్రమాణ కలాది 31-33 అదేవిధమున చంద్ర స్ఫుటగతిని 3-చే పెంచి 74-చే భాగించి తెచ్చిన చంద్ర బింబప్రమాణ కలాది 29-18 ఈ రెండు బింబములనూ చేర్చి వర్ధీకరింపగానయిన బింబయోగార్ధము 30-26 దీనిలో స్ఫుట శరమగు 45-42-ను తీసివేయగా నిలుచునది గ్రాసలిప్తలగును. ఇందు బింబయోగార్ధములో స్ఫుట శరమును తీసివేయటకు పోదు గనుక నీ పర్వమునకు గలుగబోవు సూర్యోపరాగము మనదేశమునకు కానరాదని తెలిసెను.

*N.B.* అయిననూ అధ్యాయస్యోదాహృతము నందలి భంగమునుగూర్చి స్ఫుటశరము 12-20 అని కల్పించు కొనిముందుదాహరణ గణితక్రమములను చూపబడును గనుక బింబయోగార్ధములో కల్పిత స్ఫుట శరమును తీసివేయగా నిచిలిన గ్రాసలిప్తలు 18-6.

### గ్రాసాంశాదయః.

తా॥ గ్రాసలిప్తలను 16-చే పెంచివచ్చిన మొత్తమును సూర్యబింబముచే భాగింపగా షోడశాంశా రూపమగు గ్రాసాంశములగును. అది 16-కంటెను మించియుండి సర్వగ్రహణమనియూ తగ్గియుండిన ఖండగ్రహణమనియూ తెలియవలసినది.



ఉదా:—గ్రాసకలలు 18-6 దీనిని 16-ట గుణించివచ్చిన మొత్తమును సూర్య బింబముచే విభజింపగావచ్చిన గ్రాసవీసములు 9-10 ఇది 16-ల కంటెను తగ్గియుండుటచే ఖండగ్రహణమని తెలిసెను. మరియూ గ్రాసలిప్తలను రవిబింబముచే భాగించి చంద్రగ్రహణాధ్యాయమునందు చెప్పియుండు మీదిక్రమముగనే 100-లోని భాగములనెత్తగా 58 వచ్చును.

### మధ్యస్థిత్యర్ధ సాధనక్రమము.

తా॥ రవిచంద్ర బింబయోగార్ధ వర్గములో స్ఫుటశరవర్గమును తీసివేయగా నిలుచు వర్గాంతరమునకు మూలమెత్తివచ్చిన దానిని విలిప్తలచేసి నయిన మొత్తమును రవిచంద్ర గత్యంతర లిప్తలచే భాగింపగా నాడికాది మధ్య స్థిత్యర్ధమగును.

ఉదా:—రవిచంద్ర బింబయోగార్ధమగు 30-26-లను వర్గింపగానైన 926-11 లలో స్ఫుటశరవర్గమగు 152-7-ను తీసివేయగా నిలిచిన వర్గాంతరము 774-4 దీని మూలము 27-49 దీని విలిప్తలు 16-69 దీనిని రవిచంద్ర గత్యంతరార్ధోత్తర కలలచే భాగింపగావచ్చిన నాడికాది మధ్య స్థిత్యర్ధము 2-30.

### అథ స్పర్శమోక్ష స్థితిదళానయనక్రమః.

తా॥ స్ఫుట శరమును 144-చే భాగింపగావచ్చు నాడికాదిఫలమును ఓజపద శరముగనుండునపుడు మధ్య స్థిత్యర్ధములో చేర్చగా స్పర్శ స్థితిదళమునూ; తీసివేయగా మోక్షస్థితిదళమునూ యుగ్మపదశరముగ నుండునపుడు మధ్య స్థిత్యర్ధమునందు తీసివేయగా స్పర్శస్థితి దళమునూ; చేర్చగా మోక్షస్థితి దళమునూయగును.

అందు స్ఫుటావనతి చంద్రశరములు రెండునూ భిన్నదిక్కులను పొంది యుండి అవనతిలో శరమును శోధించి (వ్యవకలించి) స్ఫుట శరమును తెచ్చియుండునపుడు శరగతి విపరీతమగుటచే నీ మీదిక్రమములకు వ్యుత్క్రమముగనే సంస్కరించి స్పర్శమోక్షస్థితి దళములను తెచ్చుకొనవలసినది.

ఈ అర్థమునుగూర్చి,, యుతోనితస్యాప పత్తిర్యథాతే,, అనువాక్యము మొదలు,, మర్దార్థే అపికార్యమిత్యుప పన్నం'' అనువాక్యము వఱకుగల శ్రీమల్లారి దైవజ్ఞకృత వ్యాఖ్యానుజూడగవిశదమగును. ఇందలి తాత్పర్యమును సవరణముతో వ్రాసియుండుటచే నావ్యాఖ్యానమిందు జూప నక్కఱలేదు.

ఉదా:—ఓజపద దక్షిణ స్ఫుట శరకలాది 12-20 దీనిని 144-చేత భాగింపగా వచ్చిన శరఫల కలాది 0-5 ఇది ఓజపద శరమునుండియు వచ్చియుండుఫలమగుట చేతనూ స్ఫుటావనతిలో శరమును శోధింపబడి పదగతిభిన్నింపకుండుటచేతనూ మధ్య స్థిత్యర్ధమగు 2-30-లలో కలుపగానైన స్పర్శస్థితిదళము 2-35 తీసివేయగానైన మోక్షస్థితి దళము 2-25.

## పూర్ణగ్రహణే విమర్దార్ధానయనక్రమః.

తా॥ రవిచంద్ర బింబాంతరార్ధ వర్గములో స్ఫుట శరవర్గమును తీసివేయగా నిలుచు శేషమునకు మూలమెత్తి వచ్చిన కలాదిఫలమును విలిప్తలుచేసి అయిన దానిని రవిచంద్ర గత్యంతరార్ధోత్తర లిప్తలచే విభజింపగా నాడికాదిగ మధ్య విమర్దార్ధమగును.

దానిని బట్టి మధ్యస్థిత్యర్ధమునుండియు స్పర్శ మోక్షస్థితి దళములను తెచ్చి యుండు మీదిక్రమములుగనే శరఫల సంస్కారములచే వరుసగా స్పర్శమోక్ష విమర్దార్ధలను తెచ్చియుంచుకొనవలసినది.

ఉదా:—ఖండగ్రహణమగుటచే విమర్దార్ధలులేవు.

## అథ స్పర్శ మోక్షలంబనానయనక్రమః.

వాక్యం,, మధ్యలంబనవత్స్పర్శ మోక్ష లంబనసాధయేత్ ॥
సవర్ణీకృతతా ॥

లంబన సంస్కృతమగు మధ్యపర్వములో స్పర్శస్థితి దళమును తీసివేయగ స్పర్శకాలమునూ మోక్ష స్థితి దళమును జేర్చగ మోక్ష కాలమునూయగును.

అదే విధమున లంబన సంస్కృత మధ్య పర్వాంత రవిలో స్పర్శస్థితి దళముచే రవిస్ఫుటగతిని గుణించి వచ్చిన మొత్తమును 60-ట విభజింపగావచ్చు కలాది ఫలమును తీసివేయగ స్పర్శకాలరవియూ రవిస్ఫుటగతిని మోక్ష స్థితి దళముచే పెంచి వచ్చిన దాని నరువదింట పాలుగొనగా వచ్చు లిప్తాదిఫలమును జేర్చగ మోక్షకాల రవియూయగును.



స్పర్శకాలమునకు తాత్కాలిక సాయనార్క సాయన లగ్నములచేతనూ ; మోక్షకాలమునకు తాత్కాలిక సాయనార్క సాయనలగ్నములచేతనూ మధ్య లంబనము తెచ్చియుండు మీదిక్రమములుగనే వరుసగా ద్యుగతఘటికాదులను దెచ్చి వానిచే స్పర్శమోక్షలంబనములను వరుసగా సాధించి యుంచుకొనవలసినది.

ఉదా:—లంబన సంస్కృత మధ్య పర్వము 23-35 దీనిలో స్పర్శస్థితి దళమగు 2-35-లను తీసివేయగానైన స్పర్శకాలము 21-0,, అదే విధమున మోక్ష స్థితి దళమగు 2-25-లను చేర్చగానైన మోక్షకాలము 26-0.

మధ్య పర్వాంత రవియగు 3-23-51-15 లలో రవిస్ఫుటగతిని స్పర్శస్థితి దళముచే పెంచివచ్చిన దానిని 60-ట భాగింపగావచ్చిన లిప్తాదిఫలమగు 2-27-లను తీసివేయగానైన స్పర్శకాల రవిః 3-23-48-48:

అదే విధమున రవిస్ఫుటగతిని మోక్షస్థితి దళముచే గుణించి 60-ట పాలు గొట్టగా వచ్చిన కలాదిఫలమగు 2-19-లను చేర్చగానైన మోక్షకాల రవిః 3-23-53-34.

ఉదయాది స్పర్శకాలము 21-0 తాత్కాలిక స్ఫుటార్కః 3-23-48-48 అయనాంశయుతసాయన రవిః 4.15-20-32 సాయనలగ్నము 8-15.32-34 రవిలగ్నాంతర రాశ్యాది 4-0-12-2 దీనిని 5-చే గుణింపగానైనది 20-1-0.10 ఇందలి భాగాదిని రెట్టింపగానైన నర్ధోత్తరద్యుగత ఘటికాది 20-2 దీనిలో 15-0-లను తీసివేయగా నిలిచినసత ఘడియలు 5-2 దీనిని 20-0 లలో తీసివేయగా నిలిచిన దానిని నతముచే పెంచి వచ్చిన మొత్తము 75.20 దీనిలో సగము 37-40 దీనిని విషువత్కర్ణమగు 12-18-చేత విభజింపగా వచ్చిన నాడికాది స్పర్శలంబనము 3-4.

అదే విధమున మోక్షకాలము 26-0 తాత్కాలిక సాయనార్కః 4-15-25-18 సాయనలగ్నం 9-13-34-1 ద్యుగత ఘటికాది 24.41 మోక్ష లంబన ఘటికాః 4-4 వచ్చును. దీనిని చక్కగపరిశీలించి చూడుము.

## అథ సంస్కారక్రమః.

శ్లో॥ అనులోమవిలోమేచ తన్మధ్యహరిజాంతరం ।
స్థితి మార్ధవఖండౌ చకార్యంస్యా స్ఫుటసాధనే ॥
ఏవం క్రమా స్థితిదళౌమార్ధ ఖండౌ చసర్వదా ।
సంస్కారేదత్రబహుభిః ర్మతాంతరముదాహృతం ॥

స॥ తా॥ స్పర్శకాలము పాక్కపర్వములో చేరియుండునపుడు స్పర్శమధ్య లంబనాంతరమును స్పర్శస్థితి దళములో చేర్చవలసినది. మోక్షకాలము పూర్వకపాలములో చేరియుండునపుడు మధ్య మోక్షలంబనాంతరమును మోక్షస్థితి దళములో కూర్పవలసినది.

స్పర్శకాలము పశ్చాత్కపాలములో చేరియుండునపుడు స్పర్శమధ్య లంబనాంతరమును స్పర్శస్థిత్యర్ధములో తీసివేయవలసినది. మోక్షకాలమపరకపాలములో వ్యాపించియుండునపుడు మధ్యమోక్ష లంబనాంతరమును మోక్షస్థిత్యర్ధములో తీసివేయవలసినది.

మరియూ స్పర్శ మధ్య మోక్షములగు మూడుకాలములలో నేదైన రెండేసి కాలములొక కపాలమందు జేరి మరియొక టేభిన్నకపాలమును బొందియుండునపుడు రెండు చేరియుండువానిలో స్పర్శముండిన స్పర్శమధ్య లంబనాంతరమునూ మోక్షముండిన మధ్య మోక్ష లంబనాంతరమునూ తెచ్చి మీదిక్రమముగనే కపాల భేదమెరిగి అందుండు స్పర్శమోక్ష స్థిత్యర్ధములలో నొకదానికి సంస్కరించి స్పర్శ మోక్షములలో నొకటే వేరుకపాలమును బొందియుండు దానికి (దాని లంబనమునే దానికి) వెనుకటిక్రమములుగనే కపాల భేదముచే తల్లంబమునేసంస్కరింపవలసినది.

అందు లంబన సంస్కృత మధ్య పర్వమే దినార్ధముగ వచ్చియుండునపుడు స్పర్శమోక్ష లంబనములనే స్పర్శమోక్ష స్థిత్యర్ధములయందు వెనుకటి వలెనే కపాలభేదములనెరిగి వరుసగా సంస్కరించుకొనవలసినది.



ఇట్లు చేయుటచే సూర్య గ్రహణానయనమునందలి స్పర్శమోక్ష స్థితిదళములు దృక్ స్ఫుటములగును. అదేవిధముగ పూర్ణగ్రహణమందలి స్పర్శ మోక్ష విమర్దార్ధములకునూ నీ మీదిక్రమములుగనే లంబనములను దెచ్చి కపాల భేదముల నెరిగి స్పర్శమోక్ష విమర్దార్ధములను స్ఫుటీకరించియుంచుకొనవలసినది.

ఉదా:—స్పర్శలంబనము 3.4 మధ్యలంబనము 2-56 వీనియంతరము 0-8 దీనిని స్పర్శకాల మపర కపాలములో చేరియుండుటచే స్పర్శస్థితిదళమగు 2-35-లలో తీసివేయగానైన స్ఫుట స్పర్శస్థిత్యర్ధము 2-27, మధ్యలంబనము 2-56 మోక్ష లంబనము 4-4 వీని యంతరము 1-8 దీనిని మోక్షకాలము ప్రత్యక్కపాలములో జేరియుండుటచే మోక్షస్థితిదళమగు 2-25-లలో తీసివేయగానైన స్ఫుట మోక్ష స్థితిదళము 1-17.

## స్పర్శాది కాలానయనం.

తా॥ లంబన సంస్కృతమగు తిథ్యంతమే గ్రహణ మధ్యకాలమగును గనుక దానిలో స్ఫుట స్పర్శస్థిత్యర్ధమును తీసివేయగా స్పర్శకాలమునూ స్ఫుట మోక్ష స్థిత్యర్ధమును చేర్చగా శుద్ధ మోక్షకాలమునూ యగును.

అదే విధమున పూర్ణగ్రహణమునందలి స్ఫుట స్పర్శ మోక్ష విమర్దార్ధములచే వరుసగా నిమీలనోన్మీలన కాలములను తెచ్చుకొనవలసినది.

సూర్యగ్రహణమునందు స్ఫుట స్పర్శ మోక్ష స్థిత్యర్ధముల మొత్తమే గ్రహణాద్యంత కాలముగనూ స్ఫుట విమర్దార్ధములయోగమే బింబాదర్శన కాలముగనూ లెక్కింపబడును.

ఉదా:—స్ఫుట మధ్య పర్వము 23-35 దీనిలో స్ఫుట స్పర్శస్థిత్యర్ధమగు 2-27-లను తీసివేయగానైన సూర్యోదయాది స్పర్శకాల ఘడియలు 21-8 మోక్ష స్థిత్యర్ధ స్ఫుటమగు 1-17-ను చేర్చగానైన మోక్షకాల ఘడియలు 24-52 ఇందుకు గ్రహణాద్యంత పుణ్యకాల ఘడియలు 3-44 వచ్చును.

అథ దిగ్వర్ణాదయః.

పూర్ణగ్రహణే,, పశ్చిమ దిక్ స్పర్శః,, ప్రాగ్మోక్షః,, ఖండగ్రహణోత్తర శరే వాయువ్యదిక్ స్పర్శః, ఈశాన్యేమోక్షః తత్ర దక్షిణశరే నిరృతి దిక్‌స్పర్శః ఆగ్నేయది మోక్షః,, సదాకృష్ణవర్ణం. సవ్యాప సవ్యాదులను నీ వెనుక చంద్ర గ్రహణాధ్యాయముననే విస్తారముతో వ్రాసియుండుటచే నిందు తెలుపనక్క అలేదు. ఉదా:—స్పష్టం.

అథ చిత్రగ్రహణం.

శ్లో॥ శశాంక బింబాదధికం భానోర్బింబంభవేద్యది ।
మధ్యకాలే శరాభావే చిత్రగ్రహణ సంభవః ॥

తా॥ చంద్రబింబమున కంటెను సూర్య బింబ మధికమై గ్రహణ మధ్య కాలమునందు విక్షేపశూన్యమయ్యె నేని నపుడాగ్రహణమునందు చిత్ర విచిత్రములగు బడును. దీనికి చిత్ర గ్రహణమనియూ కంకణ గ్రహణమనియూ జెప్పబడును.

*N. B.* స్పర్శ మోక్ష లంబనానయన సంస్కారములయందు స్థిత్యర్ధేనోని తాద్వ్యక్తాత్పర్వాంతాత్క్రమశః పృథక్ ॥ గ్రస్తోస్తమయస్యేతి ప్రాక్కపాలగ్రహణోక్త స్ఫుటీకరణమేవ గ్రస్తాస్తసమయసంభవేపి గ్రాహ్యం, ఈ మొదలగు వచన వ్యాఖ్యార్థములను జూడగా, లంబన రహితమగు తిథ్యంతముచే మీదిక్రమములుగనే స్పర్శమోక్ష లంబనములను దెచ్చి లంబనాంతర సంస్కారమునుజేయవలసినదని కొందరునూ లంబన రహితమగు తిథ్యంతమునుండియే స్పర్శమోక్ష లంబనములను దెచ్చి దానినంతయూ (సర్వలంబన సంస్కారము) సంస్కరింపవలసినదని మరికొంధరునూ, అదే విధమున ప్రాక్పర్వ పశ్చాత్పర్వ సంస్కార క్రమభేదములచే సంస్కరింపవలసినదని నింకా మరికొంధరునూ, భిన్న భిన్నాభిః ప్రాయములతో నొకటి కొకటి జేరనీయక గ్రహణానయనక్రమముల నిర్ణయించియుండెదరు. గనుక నే నిప్పటి కాలములో గ్రహణములు సరివచ్చుటలేదని వారివారి నేత్రానుభవములనుండియే తెలుసుకొనవచ్చును.



పై మతాంతరములచే సంస్కరింపబడియుండునట్లుగుబడు సిద్ధాన్త పారిజాతోక్తమగు " ప్రాచీన శ్రీ తాళపత్ర గ్రంథమునుండియు సంగ్రహించిన లంబనానయన సంస్కారక్రమములనిందు సవర్ణింపుతో వ్రాయబడియె.

శ్లో ॥ సూర్యగ్రహేతునాశ్నీయ్యాత్పూర్వంయామచతుష్టయం ।
చాంద్రేయామత్రయం తద్వద్బాలవృద్ధాన్వినాజనాః ॥
కించ। గ్రస్తోదయే విధోః పూర్వంనాహర్భోజనమాచరేత్ ।
పరేగ్రస్తాస్తమయతో నదివాభోజనాచరేత్ ॥

# ఇతి శ్రీసిద్ధాన్తరహస్యే గ్రహతంత్రే రవిగ్రహణాధ్యాయోనామసప్తమోధ్యాయః

పాతాధ్యాయ ప్రారంభః.

పాతస్వరూపము,, సూర్యేందు కిరణాన్యోన్య ఘాతేనక్రాంతి మండలే ।
పాతస్సంజాయతేవ్యప్ర వైధ్రభేదోజ్వలాగ్నివత్ ॥

తా॥ క్రాంతి మండలమునందు రవి చంద్ర కిరణములన్యోన్యముగ కలియుటచే దావాగ్నివంటి రూపముతో వ్యతీపాత వైధృతి భేదముగల పాతోత్పత్తియగును.

పాతోత్పత్తిని స్థూలముగ దెలియుట.

వా॥ వ్యతీపాతోగండయోగా ద్వైధృతి శ్శుభయోగతః తా. గండయోగమునకు సమీపమున వ్యతీపాతస్వరూపమగు వ్యతీపాతమునూ శుభయోగమునకు సమీపమున వైధృతి స్వరూపమగు వైధృతిపాతమునూ జనించునని స్థూలముగా తెలియవలెను.

ఉదా.—భావసం॥ ఆషాఢ కృ,, 8 గురువారమునాడు గండయోగము దయించుటచే నాటికి వ్యతీపాతమగునని స్థూలముగ తెలిసెను.

## పాతనిర్ణయము.

శ్లో॥ ఏకాయనగతౌభిన్న దిక్స్థౌసూర్యనిశాకరౌ ।
సంయోగాచ్చక్ర తుల్యౌచేత్తదావైధ్రుతసంభవః ॥
ఏకదిక్సం స్థితౌసూర్య చంద్రౌ భిన్నపదాయనౌ ।
సత్ర్యోగాదార్ధ చక్రేణ సమావ్యతీపాతసముద్భవేత్ ॥
ఏవం పూర్వోక్తసకల లక్షణాన్యత్రసంత్యపి ।
రవి చంద్రమసోఃక్రాంతి సామ్యాభావాన్న సంభవేత్ ।
ఉత్తరాయణ మాద్యంత మధ్యేదక్షిణమేవచ ॥

స॥ తా॥ సాయనార్క సాయన చంద్రులు ఏకాయనమునందలి భిన్న దిక్కులను పొందియుండునపుడు వారిద్దరి స్ఫుట మొత్తము 12 రాసులకు సమీపించియుండి వారిరువురికినీ క్రాంతిసామ్యముగలిగినయెడల అపుడు మహావైధృతీయోగము బుట్టును. (వైధ్రుతః) అదే విధమున ఏకదిక్కునందలి భిన్నపదాయనములలో చేరియుండు సాయన రవి చంద్రుల స్ఫుట మొత్తమారు రాసులకు సమీపించియుండి వారికి క్రాంతి సామ్యమగునపుడు మహావ్యతీపాతయోగముదయించును. (వ్యతీపాతః) అందు క్రాంతిసామ్యము తప్పిపోయిన పాతాభావమగునని తెలియవలసినది. గాకనూ కర్కాట్యాది దక్షిణాయనమనియూ మకరాది ఉత్తరాయణమనియూ తెలిసి పాఠముచేసియుండవలసినది, తక్కిన దిక్పదములను చంద్రగ్రహణాధ్యాయమున పాఠమయినది.

## అథ రవిచంద్రక్రాంతి సాధనక్రమః.

శ్లో॥ సాయనార్కేందుభిర్బాహు స్సాధయేత్పూర్వవత్కృతం
భుజేన సాధయేత్క్రాంతి పదకం ఫలమాందవత్ ॥
ఏవంస చంద్రపాతేన క్రమాద్విక్షేపమానయేత్ ।
దిగ్భేదశరసంస్కారాచ్చంద్రక్రాన్తిర్భవేత్ స్ఫుటం ॥



తా॥ రవి చంద్రుల కయనాంశలను చేర్చగా సాయనార్క సాయనచంద్రులగుదురు. వారిని క్రాంతి కేంద్రములుగనెరిగి మందకేంద్రములచే మందభుజా పదక ఫలాదులను తెచ్చియుండు మీదిక్రమములుగనే క్రాంతి కేంద్రములనుండియు భుజాసాధనమును జేసి క్రాంతి పదక ఫలములను తెచ్చియుంచుకొనగా రవికి స్ఫుట క్రాంతియూ చంద్రునికి మధ్య క్రాంతియూనగును.

తరువాత చంద్ర స్ఫుటమునందు పాతనుచేర్చగానగు సపాత చంద్రునికి మీదిక్రమములుగనే భుజాపదకములను సాధింపగనది విక్షేప పదకములయందలి పదక సంఖ్యయగును. దానిమీద వెనుకటివలెనే విక్షేపమును తెచ్చియుంచుకొని మధ్య క్రాంతి విక్షేపములు రెండునూ ఏకదిక్కును పొందియుండునపుడు రెంటినీ చేర్చగనూ భిన్నదిక్కును పొందియుండునపుడధికములో నల్పమును తీసివేసి నంతరింపగనూ చంద్రునికి స్ఫుటక్రాంతియగును. అపుడు క్రాంతి విక్షేపముల రెంటిలో నధికముగ నేదియుండునో దాని దిక్కునే స్ఫుటక్రాంతి పొందియుండునని తెలియవలసినది.

ఉదా.—కృష్ణాష్టమీ గురువారమునాటి ప్రాతః కాలిక దృక్ స్ఫుటః గ్రహాః రవిః 3-15-50-5, ✕ 57-11 చంద్రః 0-10-17-40 ✕ 793-10 పాతః 2-12.34-4 ✕ 3.11 సాయనార్కః 4-7-21-49 ఇది కర్కాట్యాదిలోనుండుటచే దక్షిణాయనమని తెలిసెను. దీనిభుజా 1-22-38-11 దీనిని భాగాదిగ మార్చగా 52.38-11 గనుక క్రాంతి పదకము 52-ది 1121-39 అ 16 ఈ క్రాంత్యంతరమగు 16-చే శేష లిప్తలను గుణింపగావచ్చిన విలిప్తలను మానమెత్తగానయిన అంతర ఫలకలాది 10-8 దీనిని పదక కలాదిలో చేర్చగానైన క్రాంతి లిప్తలు 1131-47 ఇది సూర్యునికి యుగ్మపదోత్తర స్ఫుట క్రాంతి యగును.

అదే విధమున చంద్రునికి గణింపగా సాయన చంద్రః 1-1-49-24 ఉత్తరాయణము ఇదే భుజా గనుక దీని క్రాంతి పదక సంఖ్య 31-ది 725-31 అ 21 శేష కలా నర్థోత్తరము 49-కి అంతర ఫలకలాది 17.9 దీనిని పదక కలలలో చేర్చగానైన ఓజపదోత్తర చంద్ర మధ్యక్రాంతిః 742-40.

సపాత చంద్రః 2-22-51-44 ఇదే భుజా దీని భాగాది 82-51-44 విక్షేప పదకము 82-ది 267-22 అ 1-కి అంతర ఫలకలాది 0-52 దీనిని పదక కలలలో కలుపగానైన ఓజపదోత్తర విక్షేప కలాది 268-14 ఇందు మధ్య క్రాంతి విక్షేపములు రెండునూ ఏకదిక్కునే పొందియుండుటచే నారెంటినీ చేర్చగానైన ఓజపదోత్తర చంద్ర స్ఫుట క్రాంతిః 1010-54.

### క్రాంతిగత్యానయనం.

శ్లో॥ పదాంతర కలాః క్రాంతి స్ఫుట భుక్తి శరేనచ ।
క్రాంతి సాధనవద్భుక్తి సాధయేద్రవిసోమయోః ।

తా॥ రవి చంద్ర స్ఫుట గతులను వారివారి క్రాంతి సాధనకాలమునందలి క్రాంత్యంతరములచేత గుణించి వచ్చిన మొత్తములను 60-ట విభజింపగా రవికి స్ఫుట క్రాంతి గతియూ చంద్రునికి మధ్య క్రాంతిగతియూనగును.

తరువాత చంద్ర స్ఫుట గతిని చంద్ర విక్షే పాంతరముచే పెంచి 60-ట భాగింపగావచ్చు విక్షేపగతిని మధ్య క్రాంతిలో విక్షేపమును సంస్కరించి క్రాంతి స్ఫుటమును తెచ్చియుండు క్రమముగనే దిక్కులనెరిగి మధ్య క్రాంతిగతిలో సంస్కరింపగా చంద్రునికి స్ఫుట క్రాంతిగతియగును.

ఉదా:—రవి స్ఫుట గతియగు 57-11-లను క్రాంత్యంతరమగు 16-చే పెంచి వచ్చిన దానిని 60-ట భాగింపగావచ్చిన రవి స్ఫుట క్రాంతి గతికలాది 15—15.

అదే విధమున చంద్ర స్ఫుట గతిని చంద్రక్రాంత్యంతరమగు 21-చే పెంచి 60-చే పాలుగొట్టగావచ్చిన చంద్ర మధ్య క్రాంతిగతి కలాది 277-47 చంద్ర స్ఫుట గతిని విక్షేపాంతరమగు 1-చే పెంచి 60-చే భాగించి తెచ్చిన విక్షేపగతి కలాది 13-13 దీనిని మధ్య క్రాంతి విక్షేపములు రెండునూ ఏకదిక్కునే పొందియుండుటచే మధ్య క్రాంతి గతిలో చేర్చగానైన స్ఫుటక్రాన్తిగతి కలాది 291-0.

### అథ పాతగతైష్యస్వరూపమాహ.

శ్లో॥ యుగ్మపాదస్థితేక్రాన్తిశ్చంద్రేరల్పాతు చేద్గతః ।
అధికాచేదేష్యపాత మోజపాతేన్యథాక్రమం ॥
శశిక్రాంత్యానితంక్షేపం వక్రపాతస్య లక్షణం ।



యుగ్మపదమును బొందియుండు చంద్ర క్రాంతి రవిక్రాన్తి కంటెను తగ్గియుండిన గతమనియూ మించియుండిన నేష్యమనియూ ; ఓజపదమునందలి చంద్రక్రాన్తి రవిక్రాన్తికంటెను తగ్గియుండిన ఏష్యమనియూ మించియుండిన గతమనియూ తెలియవలసినది.

అందు విక్షేపములో మధ్యక్రాంతిని శోధించి స్ఫుట క్రాన్తిని తెచ్చియుండునపుడు వక్రగతిచే నీమీాది గతైష్యక్రమములకు విపరీతముగా గతైష్యములను బొందియుండునని తెలియవలెను.

ఉదా:—ఇందు ఓజపదమునందలి చంద్ర స్ఫుట క్రాన్తి రవిక్రాంతి కంటెను తగ్గియుండుటచే పాత ఏష్యముగనుండునని తెలిసెను.

### గతైష్యనాడికా సాధనము పాతస్థిరము.

శ్లో॥ సాయనార్క స్తథాసోమే రేకాయనయుతం గతిం ।
భిన్నాయన త్వాద్వివరం గతైష్యో హారక స్ఫుటే ॥
హారేణాప్తస్తయోః క్రాన్తి రంతరేగత మేష్యయోః ।
దినాదిస్యా త్ఫలం సాధ్య స్తాత్కాల గ్రహచాలనం ॥
ఏవం తయోః క్రాంతిసామ్య త్పర్యంతానయనం క్రమాత్ ।
కృత్వాపూర్వోక్త విధినా సర్వం కార్యం పునః పునః ॥

స॥ తా॥ సాయన రవి చంద్రులు ఏకాయనమునందుండునపుడు వారిరువురి క్రాంతి గతులను చేర్చగనూ భిన్నాయనములయందుండునపుడు చంద్ర క్రాంతి గతిలో రవి క్రాంతి గతిని తీసివేయగనూ వారిరువురికినీ క్రాంత్యంతరమునకు హారమగును. దానిచే రవి చంద్ర క్రాంత్యంతరమును, భాగింపగా గతైష్య సంబంధమగు దినాదిఫలమగును.

దానిని నాటి వారాదిలో క్రమముగ ఋణధనములు చేసికొని తత్కాలమునకు గ్రహచాలనమునుచేసి మరల మీాదిక్రమములుగనే క్రాంతులను తెచ్చిచూడవలసినది.

అందునూ క్రాంతి సామ్యము కలుగకుండినంతట మరల గతైష్యములను తెలసి క్రాంత్యంతరమునకు హారకమును దెచ్చి నీమీది క్రమములుగనే క్రాంతిసామ్యమగు వఱలో మాటిమాటికినీ గతైష్యకాలములకు గ్రహతాత్కాలికము చేసి వరుసగా క్రాంతులు తెచ్చుచూ చివరకు క్రాంతిసామ్యమును పొందింపగా నదియే పాతమధ్య కాలమగును.

అందలి గ్రహతాత్కాలికీకరణమునం దెపుడైననూ గతైష్యములలోదినములు లేక ఘటికాది మాత్రమేవచ్చి యుండునపుడు స్ఫుటగ్రహ తాత్కాలికమునే జేసి కొనవలయుననియూ దినములు నైతము వచ్చియుండునపుడు మధ్య గ్రహ తాత్కాలికముచేసి స్ఫుటీకరించి యుంచుకొనవలయుననియూ అందెపుడైననూ ఏష్యఫలము ధనముగనూ గతఫలము ఋణముగనూ యుండునని యూ తెలియవలసినది.

## గ్రహతాత్కాలిక క్రమమునందలి విశేషము.

*N.B.*—మధ్యగ్రహ విషయమై మధ్యగతిచేతనూ స్ఫుటగ్రహ విషయమై స్ఫుటగతిచేతనూ గతైష్య సంబంధములగు నిష్టఘటికాదిని గుణించివచ్చిన మొత్తమును 60 ట భాగింపగావచ్చు కలాదిఫలముల నాయా గ్రహములలో నేష్యమగునపుడు ధనమునూ గతమగునపుడు ఋణమునూ వక్రగతిగల గ్రహములలో నీమీది ధనఋణ క్రమములకు విపరీతముగనూ సంస్కరించుకొనగా ఇష్టకాల గ్రహణములగును. ఇదొకపద్ధతి.

## ఉదాహరణమును బాగుగపరిశీలించిచూడుము.

ఇందలి రవి చంద్రులు భిన్నాయనములను పొందియుండుటచే చంద్రక్రాంతి గతిలో రవిక్రాంతి గతిని తీసివేయుగా నిలిచిన క్రాంత్యంతర హారము 275-45 దీనిచే రవి చంద్రక్రాంత్యంతరమగు 120-53-లను భాగింపగావచ్చిన నేష్యఫలది నాది 0-26- 8 దీని ఘటిగాది 26-18 ఇందు దినములు శూన్యమగుటచే స్ఫుట గ్రహ తాత్కాలికీ కరణమే విధియగును గనుక నీ యిష్ట ఘటికాదియగు 26-18-లచే రవి చంద్రపాత స్ఫుట గతులను వేరువేరుగా పెంచివచ్చిన మొత్తములను వరుసగా 60-ట భాగింపగా వచ్చిన తాత్కాలిక ఫల కలాదులు రవికి 25-4 చంద్రునకు



భాగాది 5-47-52 పాతకు 1-24 ఈ తాత్కాలిక చాలిత ఫలములను ఏష్యమగుటచే నాయా స్ఫుట గ్రహములయందు చేర్చికొనగానయిన ఇష్టకాలగ్రహములు అనగా ఉదయాది 26-18 కాల స్ఫుటగ్రహములని తెలియవలసినది. రవిః 3-16-15-9 చంద్రః 0-16-5-32 పాతః 2-12-35-28 (స్ఫుటగ్రహ చాలితమునందొకే దినము వ్యాపించియుండుటచే అందెపుడునూ స్ఫుట గతులు మారదని తెలియవలెను.) దీనిని బట్టి మీదిక్రమముగనే క్రాంతి సాధనమును జేయగా సాయనార్కః 4-7-46-53 భుజా 1-22-13-7 క్రాంతిప 52ది 1121-39 అ 16 వీనిచే యుగ్మపదోత్తర సూర్య స్ఫుట క్రాంతిః 1125-7 వచ్చును.

సాయన చంద్రః 1-7-37-16 క్రాంతి 37 ప 850-7 అ 20 దీనిచే ఓజపదోత్తర చంద్ర మధ్య క్రాంతిః 862-27 వచ్చును. సపాత చంద్రః 2-28-41-0 విక్షేప పదకం 88 ది 269-51 అం ఓజపదోత్తర విక్షేపము 269-51 విక్షేప సంస్కృత ఓజపదోత్తర చంద్ర స్ఫుట క్రాంతిః 1132-18 ఇందు ఓజపద చంద్ర క్రాంతి రవి క్రాంతి కంటెను మించియుండుటచే పాతగతమని తెలిసెను. గనుక మీదిక్రమములుగనే మరల రవి చంద్రులకు స్ఫుట క్రాంతిగతులను దెచ్చి వానినుండియు క్రాంత్యంతర హారకమును సాధింపగావచ్చిన 249-18-లచే ఇపుడు గలిగియుండు క్రాంత్యంతరమగు 7-11-లను భాగింపగావచ్చిన గతఫలదినాదిలోని ఘటికాది 1-44 దీనిచే రవి చంద్రపాతల స్ఫుటగతులను గుణించి 60-ట భాగింపగావచ్చిన చాలితఫల కలాదులు రవికి 1-36 చంద్రునకు 21-58 పాతకు 0-6 ఇది గతఫలములగుటచే దీనిని 26-18 కాల స్ఫుట గ్రహములలో తీసివేసి 26-18-లలో గత ఘటికాదియగు 1-44-లను తీసివేయగానయిన సూర్యోదయాది 24-34 కాలస్ఫుట గ్రహములు.

రవిః 3-16-13-33 చంద్రః 0-15-43-34 పాతః 2-12-35-22 వీనిని బట్టిమరల మీదిక్రమములుగనే క్రాంతులనెత్తగా యుగ్మపదోత్తర సూర్య స్ఫుటక్రాంతిః కలాది 1125-39 ఓజపదోత్తర చంద్ర స్ఫుటక్రాంతిః కలాది 1124-58 ఇందు పాత నేష్యముగనున్నదని తెలిసెను. గనుక మీదిక్రమముగనే మరల క్రాంత్యంతరమునకు హారమునుదెచ్చి సాధింపగావచ్చిన ఏష్యఫలనాడికాది 0-10 దీనిని మీది యిష్టకాలమగు 24-34-లలో చేర్చగానైన సూర్యోదయాదికాలము 24-44 తత్కాలమునకు గ్రహతాత్కాలికమునుజేసి వానినుండియు మీదిక్రమములుగనే స్ఫుటక్రాంతు

లనెత్తగావచ్చిన కలాదిఫలములు యుగ్మపదోత్తర రవి క్రాంతిః 1125-39 (దక్షిణాయనము) ఓజపదోత్తర చంద్రక్రాంతిః 1175-39 (ఉత్తరాయణము) ఇందు రవిచంద్రులకు క్రాంతిసామ్యము గలిగినది గనుక నిదియే పాత మధ్య కాలమగునని తెలియవలసినది.

అథ ప్రవేశనిర్గమానయన క్రమః.

శ్లో॥ అర్కేందుగతి సంయుక్తం సప్తైరాప్తం కలాదికం ।
బింబయోగార్ధయోస్స్యాతాం హారేణాప్తం దినాదికం ॥
ధనర్ణంస్యాన్మధ్యకాలే మోక్ష స్పర్శమితీరితః ।

తా॥ రవి చంద్ర స్ఫుటగతులనుచేర్చి నయిన మొత్తమును 27-చేత విభజింపగావచ్చు రవి చంద్ర బింబయోగార్ధమును హారరుపురి క్రాంతిసామ్య కాలమునందలి క్రాంత్యంతర హారకముచే భాగింపగావచ్చు దినాదిఫలము పాతస్థితి దళమగును గనుక దానిని మధ్య కాలములో తీసివేయగా ప్రవేశకాలమునూ చేర్చగా మోక్ష కాలమునుయగును.

ఉదా.—రవి చంద్ర స్ఫుటగతుల రెంటినీ చేర్చగానైన 850-51-లను 27-చే భాగింపగావచ్చిన బింబయోగార్ధము 31-31 దీనిని క్రాంతిసామ్య కాలమందలి హారకమగు 249-18-లచే భాగింపగావచ్చిన దినాదిఫలములోని ఘటికాది 7-35 ఇదే పాతస్థిత్యర్ధమగును గనుక దీనిని పాతమధ్య కాలమగు 24-44-లలో తీసివేయగానైన స్పర్శకాలము 17-9 చేర్చగానైన మోక్షకాలము 32-19 ఇది సాయన రవి చంద్రులు ఏకదిక్కునందలి భిన్నపదాయనములలోజేరి వారల సంయోగ మారురాసులకు సమీపించి క్రాంతిసామ్యమైనందున మహావ్యతీ పాతప్రవేశ నిర్గమనకాలములగునని తెలియవలసినది. ఇందొక విశేషముగలదు:—పాతమధ్య కాలమునకు పాతనిర్ణయ యోగము సరిగావచ్చియుండి స్పర్శమోక్ష కాలములయందొక కాలమున యోగ భంగమయ్యేనేని నాయోగ భంగారంభ సంధికాలమే నచటి స్పర్శమోక్షకాలముల యందొక కాలమగునని తెలియవలసినది. అందు పాతమధ్య కాలమున యోగము సంధించి స్పర్శమోక్షములలో భిన్నించుటవలన స్పర్శమోక్షములు భిన్నించుచునే దప్ప పాతయోగము భిన్నింపదని తెలియవలెను.



శ్లో॥ రవి చంద్రా క్రాన్తిసామ్యం నభవేద్యత్కదాతదా ।
పాతాభావా ఇతిజ్ఞేయానిశ్చితం పూర్వ సూరిభిః ॥

తా॥ రవి చంద్రులకు నీ మీదిక్రమములయందలి క్రాంతి కేంద్రములయొక్క పదభేదములచే క్రాంతిసామ్యము తప్పిబోవునపుడు పాతాభావమగును, ఈ అర్ధమునుగూర్చి రవీందోః క్రాంతి పదకాస్సంభవంతియదాంత్యగాః। తథైవాదిగతాశ్చాపితదాపాతోన సంభవేత్ ॥

*N. B.*—తులా కన్యాగతే రాహూ రవౌ చాపమృగేవృషౌ । యమ కర్కటకేవాపినైన పాతస్యసంభవః ॥ కించ - మిథునాయన మారభ్య యావచ్చరతినక్రభే । పాతాభావా ఇతి జ్ఞేయాస్తావత్కాలేన సంశయః। యద్వా - మిథునే కటకేవాపి ధనుర్మకరయోరపి। రవేస్థితేః క్రాన్తిసామ్యం నభవేత్పాత సంభవః (రవే స్థితేః క్రాన్తిసామ్యం భవేత్పాతన సంభవః) వృద్ధియోగే వ్యత్రసం జ్ఞేబ్రహ్మయోగేతువైధృతః ॥ అనురీతిని నిక్కలపుసైద్ధాన్తికులలోన నేకులు పాతాభావములనూహించినను; ఏకద్వాద్వి దశస్థానే షష్ఠసప్తాష్టమేషుచ। సూర్యేందుసంస్థితో రాహుః గ్రహణం ప్రాప్తిరిష్యతి॥ అన్యచ్చ - భానోః కించన శేద్యతే చంద్రమాయదితిష్ఠతి । నిశిశేషేతు పౌర్ణమ్యాం శుద్ధ గ్రహణమాదిశేత్ ॥ మాసాద్యనామ నక్షత్రే షోడశేయది భాస్కరః । దివా శేషమమావాస్యాం శుద్ధ గ్రహణమాదిశేత్ ॥ అనువాక్యముల కెట్లపవాదము గలదో నవ్విధమున నే చల సంస్కృతయోరర్క చంద్రయోర్భిన్న దిక్కయోః । ఏకాయనస్థయోర్యోగే మండలేనైధృతిస్తయోః ॥ వ్యతీపాతస్త్వేకదిశోరతుల్యాయనయోస్తయోః । భష ట్కే క్రాన్తిసామ్యేచ తయోర్భిన్నపదస్థయోః ॥ అను.పాతనిర్ణయాధికార సూత్రములయందు రవి చంద్రులకు దిక్పదాయన నిర్ణయములచే క్రాన్తిసామ్యమును జెప్పి మాసాది భేదములెంమనూ జెప్పబడకుండుట చేతనూ * మేషతులాయనములకు సమీపమున క్రాంతి కేంద్ర పదగతి విశేషములచే రవి చంద్రులకు రెండేసి మాస్ల

*ఆయాగ్రంథారంభ కాలములయందలి రవి చంద్ర క్రాన్తి విక్షేప స్థితి గతులనుబట్టి పాతాభావకాలములను వివిధములతో స్థూలముగ నిర్ణయించియుండినను, గ్రంథవయః కాలమును బట్టి చంద్రపాతయొక్కగతి విశేషములననుసరించి నిక్కలమునకా విధిక్రమములు తప్పిపోవుటచే క్రాంతి గణితముచేయక పైకృతక వాక్యములనేనమ్మి క్రాన్తి సామ్యముదప్పిపోవునని దలచి పాతాభావమనుట గణిత సూత్రములచే నిషేధింపబడును.

క్రాన్తి సామ్యమగుటచే నవిద్విర్భవాఖ్య పాతలనబడును. క్రాంతి సామ్యము తప్పి పోయిన పాతాభావమగును గనుక క్రాంతి సామ్యయోగమునుండియే పాతనిర్ణయ మగుననుటనుగూర్చి,, భవేతాం క్రాన్తి సామ్యేద్వే విషువత్సన్నిధౌయదా । ద్విర్భవాఖ్య స్తదాపాతో వ్యత్యయాత్తద స భవః ॥ అను ప్రమాణములచేతనూ చైత్ర వైశాఖ మాస జాతకునికెన్ని యరిష్టయోగములుండినను - వా దీర్ఘాయుర్ధనికోవసంత సమయే జాతస్సుభోగప్రియః.

అని చింతించునట్లు నీ మీద జెప్పబడియుండు పాతాభావ యోగములకును అపవాదములు తప్పలేదని తెలియవలసినది.

అథ పాతప్రశంసా.

శ్లో॥ అన్యోన్యాభి ముఖార్కేందో ర్వ్యావత్కిరణ సంహతిః ।
తావదగ్నిః ప్రజాతోయం భవేల్లోక వినాశకృత్ ॥
పాతస్యమధ్య కాలేతు క్షీర వృక్షదళాదపి ।
నస్రవంతి పయాం స్యేతస్మాత్ప్రత్యక్ష ప్రమాణకం ॥
పాతప్రవేశమారభ్య యావన్నిర్గమముచ్యతే ।
తత్సంధిర్విషమిత్యాహుశ్శుభ కార్యేషు వర్జయేత్ ॥
అన్యచ్చ॥ వ్యపోత్పత్తి దినే వాథ వైపోత్పత్తి దినేపివా ।
శుభ కార్యాణి సర్వాణి వర్జనీయాని మానవైః ॥
అనంతపుణ్యమాప్నోతి స్త్రత్రస్నానాది కర్మభిః ।
హేమశ్రాద్ధాదికం కార్యం పితౄణాం దత్తమక్షయం ॥
కించ॥ శంఖచక్రగదాపద్మం లంబభ్రూదీర్ఘనాసికం ।
అష్టనేత్రం చతుర్వక్త్రం ఉచ్ఛ్రేయశతయోజనం ॥
దీర్ఘబాహుంమహాశాద్రం తీక్ష్ణదంష్ట్రం మహోదరం ।
వ్యతీపాతర్వపురిదం శోభనే మృత్యుకారకం ॥
ఏకాస్యోత విశాల నేత్ర వదనః పంచాక్షియుక్తశ్చతుః
హస్త్రీ ఖడ్గజపాసృగస్తిముసలం సంకీర్ణ రోమాంచితం ।
విస్తీర్ణాధారసహస్రయోజనవపుః సర్వేషు కార్యేష్వపి క్షిప్రం
మృత్యుకరశ్చ వైధృతి పుమాన్ మత్యుగ్రరూపాన్వితః ॥
ఇతి శ్రీ సిద్ధాంత రహస్యే గ్రహతంత్రే
పాతాధికారో నామ అష్టమోధ్యాయః



గమనింపు,, ఆర్యులారా! ఈ వెనుకటి నష్టాధ్యాయములనూ బాగుగ పరిశీలించి నందులో తేలిన వారికి చులకనగా దెలియునట్లీ క్రిందుదహరింపబోవు సూర్య సిద్ధాంతోక్త గ్రహగణితక్రమ తాత్పర్యమును సవరణలతో శుద్ధముగ వ్రాయబడును.

మఱియూ నచ్చటచ్చట రాబోవు నవీన గణిత క్రమములను గూర్చి సాధ్యమగునంతవఱకు గణిత సూత్రములతోనుదహరింపబడుటయే గాక తాంత్రిక గ్రంథోత్పత్తి నిర్ణయక్రమములనుగూడ గమనింపులలో తెలుపబడును.

గనుక నీగ్రంథమును సాంతముగ పరిశీలించిన పిమ్మట గణిత బాహుళ్యమునకు వెనుదీయక నీ యధ్యాయ క్రమముగ ఏదోనొక నాటికి గ్రహస్ఫుటములను దెచ్చి సరిపోల్చిచూచితిరేని అపుడు నీ సిద్ధాన్త సాంప్రదాయకము తేటబడును.

మఱియూ అందులనే గూర్చి విస్తారముతో తేలినవారికి గమనింపుల సహాయములనుండియు నవీనముగ గ్రంథోత్పత్తి నిజేయగల సామర్థ్యము గలుగక పోదు. గాకనూ నీ యధ్యాయోక్తములగు యావద్విషయములకునూ సమగ్రముగ మూలోదాహృతములను తెలియగోరువారు అస్మత్కృతమగు సిద్ధాన్త జాతక గణితామృతమను గ్రంథమునందుకొనుటకై శ్రీయుత మ॥ రా॥ రా॥ శ్రీ॥ ఉప్పల ఎతిరాజ గుప్త గారు - జయశంకర్ అండుకో, చాకలపేట, మదరాసు. అను విలాసదారులకు వ్రాసి కనుగొనవలయును.

నవగ్రహ ప్రార్థనం.

శ్లో॥ ఆదిత్యం చంద్రభౌమౌ బుధ గురు భృగుజాన్ భానుజం
రాహు కేతూ నత్వానిత్యం త్రిసంధ్యం జగదుదయలయ
స్థైర్యసంపత్తి హేతూన్ ॥ జ్యోతిశ్చక్రేశ్వితారాద్యుడు
గణ సహితాన్మేష రాశ్యాది రాశీ నేతానాసక్తమూర్తీ
న్ఖచర సురవరా న్భక్తితః ప్రార్థయామః ॥

అథాబ్దాయుగ ప్రమాణ నిర్ణయః.

తా॥ ముందు రాబోవు మధ్యమార్క భగణములగు 4320000-నూ చతుర్యుగసముదాయమగు నొక మహాయుగాబ్ద రాశియగును. అందు కలిప్రమాణమెంత

వచ్చునో దాని ద్విగుణము ద్వాపరయుగ ప్రమాణమునూ త్రిగుణము త్రేతాయుగ ప్రమాణమునూ చతుర్గుణము కృతయుగ ప్రమాణమునూ యగును గనుక $1+2+3+4=10$,, $\frac{1}{10}$,, $\frac{2}{10}$,, $\frac{3}{10}$,, $\frac{4}{10}$,, ఈ భిన్నాంశములకు సరివచ్చునట్లు మహాయుగాబ్ద రాశిని పగులగొట్టగానైన కృతయుగ ప్రమాణ సంవత్సరములు 1728000,, త్రేతాయుగ ప్రమాణ సం॥లు 1296000 ద్వాపరయుగ ప్రమాణ సం॥లు 864000,, కలియుగ ప్రమాణ సం॥లు 432000.

## అథ సృష్ట్యాది గతాబ్దానయన క్రమః.

తా॥ మీద చెప్పియుండు చతుర్యుగ ప్రమాణ సంవత్సరముల మొత్తమగు 4320000 సం॥లు నొక మహాయుగమనియూ అట్టి మహాయుగములు 71-కి నొక మన్వంతరమనియూ అట్టి మన్వంతరము లు 14-కు నొక కల్పమనియూ చెప్పబడును.

(1) ఇపుడు వర్తించుచుండు నీ కలియుగము ప్రథమ కల్పంబునందలి 7వ మనువగు వైవస్వతమనువులో 28 యవ మహాయుగమునందు కృతాదిగ యుగత్రయము గతించి 4-వ యుగమగు కలియుగము నడుచుచున్నదని తెలియవలసినది.

అందు జలప్లవమయిన సప్తసంధి ప్రమాణాబ్దములగు 12096000 సం॥లు అధికముగా చెల్లిపోయినదని తెలిసి నీ మీది సంవత్సరముల న్నియునూ గణిత విధులచే క్రమముగ జేర్చి మొత్తముచేయగానయిన కల్పాది గతాబ్దములయందు సృష్ట్యనర్గతమగు 17064000, సం॥లను తీసివేయగా నిలిచినది సృష్ట్యాది గతాబ్దములగును.

(2) లేక సృష్ట్యాదిగ ద్వాపరయుగాంతమగు కల్యాదివఱకు గతించియుండు 1955880000 సంవత్సరములలో కలిగ్గతాబ్దములను చేర్చిననూ సృష్ట్యాది గతాబ్దములగును.

ఉదా:—భావాబ్దాదికి కలిర్గతం 5035 దీనిని 1955880000-లలో చేర్చగానైన సృష్ట్యాది గతాబ్దములు, 1955885035,, దీని తప్పొప్పులను మీది 1-వ విధముగ పరిశీలించిచూడుము.



తా॥ (1) సృష్ట్యాది గతాబ్దములను 12-చే పెంచివచ్చిన దానికి ఇష్టసంవత్సరమునందలి చైత్రాది గతమాసములను చేర్చి అయిన మొత్తమును రెండు ప్రతులుంచియందొక దానిని యుగాధి మాసప్రమాణమగు 1593336-చే గుణించివచ్చిన దానిని యుగార్క మాసప్రమాణమగు 51840000-చే విభజింపగావచ్చు పూర్ణలబ్ధమగునధిమాసముల మరియొక దానిలో చేర్చగా శుద్ధమాసములగును.

దానిని 30-ట గుణించివచ్చిన మొత్తమునకు ఇష్టమాసమునందలి శుక్లప్రతిపదాదీష్టదిన సంఖ్యను చేర్చినయిన మొత్తమును మరల రెండుప్రతులుంచి నొకదానిని యుగక్షయ దినములగు 25082252-చే గుణించి యుగచాంద్ర తిథులగు 1603000080-చే భాగించి తెచ్చిన పూర్ణలబ్ధమగు క్షయదినముల నింకొక దానిలో తీసివేయగా నిలిచినదియే దినగణమగును. దానిని 7-చే భాగింపగా నిలుచు శేషము భానువారాదిగ వారసంఖ్యయగును.

అందిష్టవారము సరిపడని పక్షమున సమయోచితముగ నొకటి రెంటిని ఋణధనములుగా సంస్కరించుకొని వారమునకు సరిపోల్చుకొనగా నదియే ఇష్టదినమునందలి నర్ధరాత్ర కాలమునకు సృష్ట్యాద్యహర్గణమగును.

(2) లేక సృష్ట్యాదిగ ద్వాపర యుగాంతాహర్గణమగు 714402296627-లో నిష్టదినమునకగు కల్యాద్య హర్గణమును చేర్చిననూ నిశీథకాలికమునకు సృష్ట్యాదిగ ద్యుగణమగును.

(3) అథవా నీ గ్రంథోత్పత్తి దినము నాటికగు 714404135674-కు ఈ గ్రంథోక్తాహర్గణమును చేర్చిననూ మీద చెప్పియుండు సృష్ట్యాద్యహర్గణమేవచ్చును.

ఉదా:—భావ సం॥ ఆషాఢ శు 15 గురువారము నాటికి నీ గ్రంథోక్తాహర్గణమగు 133-ను 714404135674-లో చేర్చగానైన నాటి నర్ధరాత్ర కాలమునకు సృష్ట్యాద్యహర్గణము. 714404135807 ఇది సరో లేదోయను దానిని మీది 1, 2, క్రమములచే పరిశీలించిచూడుము.

గమనింపు:—పైజూపియుండు యుగాధిమాస యుగసూర్యమాస ప్రమాణములచే తాంత్రికాహర్గణ గణితక్రమములయందలి నధిమాస సాధనా నిర్ణయములనూ, నదేవిధమున క్షయవాసర చాంద్ర వాసరా ప్రమాణములచే క్షయది

నానయన గణిత క్రమములనూ నపవర్తన గణితవిధి క్రమములననుసరించి వారివారికి తెలిసినంతవఱలో తాంత్రికా హర్గణ గణితవిధిని నిర్ణయించియుండెదరు.

అందు వా- అర్క-సంక్రాంతి రహితః శ్చాంద్ర మాసోధిక స్మృతః అనువిధిచే కలుగబోవునధి మాసము రమారమిగా 32½ మాసములకొకతూరి వరుసగా కలుగక తిథిగత్యంతర భేదములచే కొన్ని సమయములయందు అహర్గణానయన గణితములలో వచ్చు నధిమాసములు కొంత హెచ్చు తగ్గులై మిక్కలి పొరబాటులగుబడును గనుక అర్క-సంక్రాంతి శూన్యమగు చాంద్ర మాసమధికమను నిర్ణయముచే పూర్వోత్తర సందర్భములను గూర్చినధి మాసములను చింతింపవలసినదియే దప్ప కేవల మహర్గణ గణితముననే నిర్ణయింపగూడదు.

మఱియూ నీ గ్రంథోక్తాహర్గణానయన క్రమమునందలి క్షయదిన సాధనములో తిథి రాశిని 64-చే భాగించుటకు మారుగా 41-పేజిలో చూపియుండు క్రమముగ 11-చే గుణించి 703-చే భాగింపగావచ్చు లబ్ధము క్షయదినములగును. ఇట్లు జేయుటచే 36-వ పేజిక్రిందినోటును గమనింపనక్కఱలేదు.

# అథ మధ్యగ్రహసాధన క్రమః

## మహాయుగ భగణములు

### మహాయుగ భగణములు.

| | | | |
|---|---|---|---|
| రవికి | 4320000 | శుక్ర శీఘ్రోచ్చమునకు | 7022376 |
| చంద్రునకు | 57753336 | శనికి | 146568 |
| కుజునకు | 2296832 | తుంగకు | 488203 |
| బుధ శీఘ్రోచ్చమునకు | 17937060 | పాతకు | 232238 |
| గురునకు | 364220 | మధ్యగతి భగణములగును. | |

తా॥ సృష్ట్యాద్య హర్గణమును నీ మీద జెప్పియుండు వారివారి మహర్యుగ మధ్యగతి భగణములచే వేరువేరుగా గుణించివచ్చిన మొత్తములను యుగాహర్గణమగు 1577917828-చే వరుసగా భాగించి తెచ్చిన భగణాది ఫలములలో భగణములను మాత్రము విడిచి రాశ్యాది గ్రహములను వ్రాసికొనగా నాటినర్ధరాత్ర కాలమునకు లంకామధ్య గ్రహములగును.



(1) వారిలో వారివారికి నీ క్రింద జెప్పబోవు మధ్య గత్యర్ధములను తీసివేయగా నిష్టదినమునందలి మధ్యాహ్నకాలమునకు సూర్య సిద్ధాంతానీత లంకా మధ్యగ్రహములగును. అందు గ్రహదిన మధ్యగతి లిప్తాములు రవికి 59-8 చంద్రునకు 790-35 కుజునికి 31-26 బుధ శీఘ్రోచ్చమునకు 245-32 గురునకు 5-0 శుక్ర శీఘ్రోచ్చమునకు 96-8 శనికి 2-0 తుంగకు 6-41 పాతకు 3-11 యగును.

(2) లేక నీ గ్రంథోక్తాహర్గణమునకు వెనుకటించెనే అహర్గణానీత మధ్య గ్రహములను తెచ్చి వాని నీ క్రింద జూపబోవు నాయా గ్రహధ్రువకములలో చేర్చగా నిష్టదినమునకు సూర్య సిద్ధాంతానీత లంకా మధ్యాహ్నకాల మధ్య గ్రహములగును.

అందు బుధ శుక్ర కేంద్రములలో మధ్యమ రవిని చేర్చగా బుధ శుక్ర శీఘ్రోచ్చములగునని నీ వెనుకనే తెలియజేసియున్నది.

మరియూనిందలి గతఫల కాలితోదాహరణమును గూర్చి వెనుక మధ్య గ్రహాధ్యాయాంతమున చూపియుండు రుణాహర్గణ సాధన సంస్కార క్రమముల చొప్పుననేనీ ధ్రువకముల యందుసైతమునూహించుకొన వలసినది.

### గ్రహధ్రువక రాశ్యాదయః.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవికి | 10-29-6-44,, | బు.శీ | 5-13-10-34,, | శనికి | 9-26-26-30,, |
| చం,కి | 10-24-17-52,, | గు,కు | 5-28- 2-14,, | తుంగకు | 2-28-21-4,, |
| కు,కి | 11-6-0-16,, | శు,శీ | 6 -1-43-14,, | పాతకు | 2-1-32-1,, |

ఉదా:__ఈ గ్రంథోక్తాహర్గణమునకేర్పడిన మధ్యమ సూర్యః 4-11-5-7 చంద్రః 10-12-27-17 కుజః 2-9-41-40,, బుధ కేంద్రము 1-23-11-35 దీనికి మధ్యమ రవియగు 4-11-5-7-ను చేర్చగానయిన బుధ శీఘ్రోచ్చము 6-4-16-42, గురుః 0-11-3-6, శుక్ర కేంద్రములో మధ్య రవిని చేర్చగానైన శుక్ర శీఘ్రోచ్చము 7-3-5-8 శనిః 0-4-26-51 తుంగ 0-14-48-50 పా 0-7-2-49 వీనిని నీ మీద చూపియుండు వారి వారి ధ్రువములలో చేర్చగానయిన మధ్యాహ్నకాల సూర్య సిద్ధాంతానీతలంకా మధ్యగ్రహములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవిః | 3-10-11-51 | బుధ శీఘ్ర | 11-17-27-16 | శనిః | 10-0-53-21 |
| చంద్రః | 9-6-45-9 | గురుః | 6-9-5-20 | తుంగ | 3-13-9-54 |
| కుజః | 1-15-41-56 | శుక్ర శీఘ్ర | 1-4-48-22 | పాత | 2-8-34-50 |

ఈ గ్రహములు సరియగునో లేదో 1-వ విధిచొప్పున వారివారి గుణక భాగములచే పరిక్షించిచూడుము.

గమనింపు,, పై చూపియుండు మహాయుగ భగణ సంఖ్యలకునూ యుగాహర్గణమునకునూ (గుణక భాగ సంఖ్యలకు) గల అపవర్తన కారణాంకముల నిర్ణయములచే తాంత్రిక గ్రంథోక్తాహర్గణమునకు మధ్యగ్రహానయన గుణక భాగసంఖ్యలను అనుపాత విధిక్రమములచే నిర్ణయించెదరు.

మరియూ గ్రహాదిన మధ్యగతియుత పదకములను సైతము ఏకాది సంజ్ఞాంకములకు నేర్పడు సంఖ్యలనే అహర్గణముగ తెలిసి వానిని బట్టి నీ మీదిక్రియలుగనే మధ్యగ్రహములను దెచ్చి దానినే పదక ఫలములుగా లిఖియించెదరు.

అందు బుధ శుక్ర మహాయుగ భగణములలో మధ్య మార్క భగణములను శోధింపగా నిలుచునదియే వారికి ప్రిథమ శీఘ్రకేంద్ర భగణములగును. వానిని బట్టియే నీ గ్రంథమునందు బుధ శుక్ర కేంద్ర పదకములను సైతము నవీనముగ గణించి తెచ్చి వ్రాయబడియె.

ఇదియునుంగాక నేదోనొకనాటి కాలమునకు సూర్య సిద్ధాంత రీత్యా గ్రహగణితమును జేసివచ్చిన మధ్యగ్రహములకు పూర్వ ధృవకములను పేరు బెట్టి నాదినము మొదలు వారివారికి నిష్టమగు దినమువఱలోనగు రవివార దినములను లెక్కించుటకై నీ వెనుకటి గమనింపులలో చెప్పియుండు విధముగ నహర్గణ గణిత క్రమములను నిర్ణయించి దాని నుండియు అహర్గణానీత మధ్యగ్రహముల నెత్తుటకై గణిత క్రియములను వారివారికి తెలసినంతవఱలో నిర్ణయించి తాంత్రిక గ్రంథోత్పత్తి నిజేసియుండెదరు.

దేశాంతర యోజన సాధనక్రమము.

త్రిః ప్రశ్నాధ్యాయాంత మూలశ్లోకములకు సవర్ణీకృత తా॥ 41256-ను స్వదేశ విషువత్కర్ణముచేత విభజింపగా స్వదేశమునకు లంబజ్యాయగును. దానిచే 5059-38 నిగుణింపగావచ్చు మొత్తమును 3438-చేత భాగింపగావచ్చు లబ్ధము స్ఫుట భూపరిధి యోజనములగును.



ఉదా:—41256-0-ను స్వదేశ విషువత్కర్ణమగు 12-18-చే విభజింపగా వచ్చిన సర్థోత్తరలబ్ధమగు స్వదేశ లంబజ్యా 3355 దీనిచే 5059-38-ని పెంచి వచ్చిన మొత్తమును 3438-చేత భాగింపగావచ్చిన సర్థోత్తర స్ఫుట భూపరిధియోజనములు 4938,,

స॥ తా॥ దేశాంతర సంస్కారము చేయని చంద్రస్ఫుటమును బట్టినగా 8 లిప్తలను ఋణము చేయని చంద్రుని బట్టి పూర్ణచంద్ర గ్రహణమును గణించి తెచ్చి దానిని ఘటీయంత్రమును బెట్టుకొని చూడగా గణితమునందు వచ్చియుండు భూమధ్య నిమీలనమునకంటెను కంటికగుపడునిమీలనము పిమ్మట యయ్యోనేని భూరేఖకు తూర్పు దేశమనియూ; పూర్వమేయయ్యోనేని పశ్చిమ దేశమనియూ తెలసి వానియంతర వినాడికలచే స్ఫుట భూపరిధినిగుణించి వచ్చిన మొత్తమును 3600-చేత భాగింపగావచ్చు లబ్ధము దేశాంతర యోజనములగును.

అందు నిమీలనము తప్పిపోయినప్రడు ఉన్మీలనముచేతనైననూ మీదిక్రమముగనే జూడవచ్చును.

ఉదా:—ఆంగీరస సంవత్సర భాద్రపద శు 15 బుధవారమునాటి గ్రహణమునందలి దేశాంతర సంస్కారముచేయని భూమధ్యోన్మీలనము 20-14 వచ్చియుండెను నాకాలమును ఘటికా యంత్రముచే జూడగా 20-49-లకు నున్మీలనమగుబడెను. గనుక ఇందలి అంతర వినాడికలగు 35-చేత స్ఫుట భూపరిధియగు 4938-ని పెంచి వచ్చిన దానిని 3600-చేత విభజింపగావచ్చిన సర్థోత్తరలబ్ధము 48 ఇది గణితోన్మీలనముకంటెను దృక్సిద్ధోన్మీలనము పిమ్మట కనుబడియుండుటచే భూరేఖకు ప్రాగ్యోజనములగునని తెలిసెను.

దేశాంతర సంస్కారక్రమము.

తా॥ మీదచూపియుండు నాయాగ్రహాదిన మధ్యగతి లిప్తాదులను దేశాంతర యోజనములచే వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను 4800-చే వరుసగా భాగించి తెచ్చిన లిప్తాదిఫలముల నాయాలంకా మధ్యాహ్నకాల మధ్యగ్రహములయందు పూర్వదేశస్థులు ఋణమునూ పశ్చిమ దేశస్థులు ధనమునూ జేసికొనగా స్వదేశ మధ్యాహ్నకాల మధ్యగ్రహములగును.

గమనింపు,, చంద్రునికి దప్ప తక్కిన గ్రహాదులకు నీ దేశాంతర సంస్కారఫల మత్యల్పముగవచ్చుటచేతనూ చంద్రునికి నీ దేశమునకు 8 లిప్తలు ఋణముగా వచ్చుటచేతనూ నీ వెనుకటి స్ఫుటాధ్యాయమునందలి చంద్ర స్ఫుట క్రమములో చంద్రునికి దేశాంతరఫల ఋణలిప్తలు 8-ని ధృవకముగా జెప్పబడెను. గనుక నిష్టముండినవారలు తక్కిన గ్రహాదులకునూ నీ మీదిక్రమముగనే దేశాంతర సంస్కారమును సంస్కరించుకొనవచ్చును.

ఉదా:—రవి మధ్యగతియగు 59-8.ని ప్రాగ్యోజనములయిన 48-చేత పెంచి వచ్చిన దానిని 4800-చే భాగించి తీసినదే శాంతఫల కలాది రవికి 0-35 అదే విధమున కుజ మధ్యగతిని బట్టి సాధింపగానయిన కుజదేశాంతరఫల కలాది 0-19 ఈ ఫలములను పూర్వదేశమగుటచే నాయాలంకామధ్యాహ్నకాల మధ్యగ్రహములలో తీసివేయగానైన స్వదేశమధ్యాహ్నకాల మధ్యగ్రహములు రవిః 3-10-11-16,, కుజః 1-15-41-37,, ఈ క్రమముగనే తక్కినగ్రహాదులకునూ తెలియవలసినది.

దృక్సంస్కారక్రమము.

తా॥ కలిగతాబ్దములను 3600-చే భాగింపగా నిలుచు శేషము (లబ్ధముచే పనిలేదు) 1800-కు తగ్గియుండునపుడా శేషమేగుణ్యమనియూ 1800 లకంటెను మించియుండునపుడెంత మించియుండునో దానిని 1800-లో తీసివేయగా నిలుచునది గుణ్యమనియూ తెలిసికొని దాని నీ క్రింద జెప్పబోవు నాయాగ్రహ గుణక సంఖ్యలచే వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను వరుసగా 10000-చే భాగించి తెచ్చిన లిప్తాది ఫలములను మానమెత్తివచ్చిన దానిని స్వదేశీయ్య మధ్యాహ్నకాలిక మధ్యగ్రహములయందలి రవి కుజ శని పాతలలో చేర్చగనూ తక్కిన చంద్ర బుధ గురు శుక్ర చంద్రోచ్చములలో తీసివేయగనూ దృక్సంస్కృత (బీజ సంస్కృత) మగు మధ్యగ్రహములగును. ఇందు బుధ శుక్రులనగా బుధ శుక్ర శీఘ్రోచ్చములగునని తెలియవలసినది. (ఇదొక ప్రాచీనమగు దృక్సంస్కారమగును.)

గ్రహగుణక సంఖ్యలు.

రవికి=35, చంద్రునకు=42, కుజునకు-664, బు. శీ. 385, గురునకు-1560, శు.శీ-3140, శనికి-2100, తుంగకు-2410, పాతకు-1530.



ఉదా:కలిగ్గతము 5035 దీనిని 3600-చేత భాగింపగా నిలిచిన శేషము 1435 ఇది 1800 కంటెను తగ్గియుండుటచే 1435 నిదియే గుణ్యమగును గనుక దీనినే రవి కుజ గుణకములగు 35,, 664,, చే వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను వరుసగా పదివేలుచే భాగించి తెచ్చిన లిప్తాదిఫలమును రవికి 5-1 కుజునకు 95-17 దీని భాగాది 1-35-17 ఈఫలముల నాయాస్వదేశ మధ్యాహ్నకాల మధ్యగ్రహములయందు సంస్కరింపగానయిన దృక్సంస్కృత మధ్యగ్రహములు.

రవిః 3-10-16-17 కుజః 1-17-16-54 ఈ క్రమములుగనే తక్కిన గ్రహాదులకునూ దృక్సంస్కారమును సంస్కరించుకొనవలసినది.

గమనింపు,, ఈ దృక్సంస్కారమను బీజసంస్కారమును ఈ గ్రంథమునందలి మధ్యాధ్యాయోక్త పూర్వధృవకములకే కొన్ని శతాబ్దములవఱలో నుపయుక్తమగునట్లు క్రమముగ సంస్కరించి యుండుటచే వెనుక నీ సంస్కారమును తెలుపలేదు. (ఇందలి విశేషక్రమములను ముందుజూపబడును.)

అర్కబాహుఫల సంస్కారము (బాహు=భుజ).

తా॥ ముందుజెప్పబోపు విధముగ రవిని స్ఫుటీకరింపగావచ్చు రవి భుజాఫల కలాదిని వారివారి మధ్యగతులచేత, వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను 21600 చేత వరుసగా భాగించి తెచ్చిన లిప్తాది ఫలముల నాయాబీజసంస్కృత మధ్యగ్రహములయందు రవికి భుజాఫలము ధనముగా వచ్చియుండునపుడు చేర్చగానూ ఋణముగావచ్చియుండునపుడు తీసివేయగనూ శుద్ధ మధ్య గ్రహములగును.

గమనింపు,, ఈ ఫలము నైతము దేశాంతర ఫలమువలెనే చంద్రునకు దప్ప తక్కిన వారల కత్యల్పముగవచ్చుటచే వెనుకటిక్రమములలో సూర్య భుజాఫలమునందలి27-వ వంతును చంద్రునిలో మాత్రము సంస్కరింపవలసినట్లు విధింపబడి తక్కినవారలకీ సంస్కారమును జెప్పబడదయ్యె తక్కినవారికినీ నీ సంస్కారమును సంస్కరింపగోరువార లీక్రమముగనే సంస్కరించుకొనవచ్చును.

ఉదా:—ముందు రవి స్ఫుటమునందు రాబోవు ఋణభుజాఫల కలాది 51-40 దీనిని రవి కుజ దినమధ్యగతులచేత వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను వరుసగా చక్రకలా సంఖ్యయగు 21600-చేత భాగించి తెచ్చిన రవి భుజాఫల భాగ

లిప్తాలుదు రవికికలాది 0-8 కుజునకు కలాది 0-5 ఇది ఋణభుజాఫలమునుండియు వచ్చియుండుటచే దీని నాయా దృక్సంస్కృత మధ్య గ్రహములలో తీసివేయగానయిన శుద్ధ మధ్యగ్రహములు రవిః 3-10-16-9 కుజః 1. 17-16-49 ఈ క్రమముగనే తక్కిన గ్రహాదులకునూ నీ రవి భుజాఫల సంస్కారమును సంస్కరింపగా వచ్చు శుద్ధ మధ్యగ్రహములను వరుసగా వ్రాసియుంచుకొనవలసినది.

అథ మందోచ్చానయన క్రమః.

(1) తా॥ సృష్ట్యాద్యహర్గణమును రవికి 387-చేతనూ, కుజనకు 204 చేతనూ బుధనకు 368-చేతనూ, గురునకు 900.చేతనూ, శుక్రునకు 535-చేతనూ శనికి 39-చే. నూ వేరువేరుగా గుణించి వచ్చు మొత్తములను వరుసగా 1577917828000 చేత భాగింపగా వచ్చు భగణాది ఫలములయందలి రాశ్యాది ఫలములే సూర్య సిద్ధాంతానీత స్ఫుట మందోచ్చములగును.

(2) లేక నీ గ్రంథోక్త ధ్రువాబ్దములను రవికి 116 చేతనూ కుజునకు 61 చేతనూ బుధునకు 110 చేతనూ, గురునకు 270 చేతనూ, శుక్రునకు 160 చేతనూ శనికి 12-చేతనూ వేరువేరుగా గుణింపగావచ్చు మొత్తములను వరుసగా 1000 వెయ్యి చేత విభజింపగా వచ్చు సర్థోత్తర లబ్ధమగు విలిప్తలను ఈ క్రిందజూపు వారివారి మందోచ్చ పూర్వధృవకములలో చేర్చగా సౌరసిద్ధాంతానీత మందోచ్చములగును.

ధృవకములు.

రవికి 2-17-17-33,, కుజునకు 4-10.2-44,, బుధునకు-7-10-28-28, గురునకు 5-21-22-30 శుక్రునకు 2-19-52-28,, శనికి 7-26-37-35.

*N. B.* ఈ మందోచ్చములలో 1,2, లిప్తలు హెచ్చు తగ్గులుగా వచ్చియుండినను ఫలవైషమ్యము జెందకుండుటచేతనూ అందు 1, 2, లిప్తలు హెచ్చు తగ్గులగుటకు అనేక శతాబ్దములే మారిపోవుటచేతనూ వెనుకటి యధ్యాయములయందు కొన్ని శతాబ్దములవఱకు నుపయుక్తమగునట్లు మందోచ్చములను సవర్ణింపుతో నిర్ణయింపబడెనని తెలియవలసినది.

ఉదా:—ఈ గ్రంథోక్తధృవాబ్దములు శూన్యమగుటచే మీదచూపియుండు ధృవకములే స్ఫుట మందోచ్చములగుననుటను నిర్ణయించుటకై మీద 1 వ క్రమము చొప్పున బరీక్షించిచూడుము.



(1) తా॥ సృష్ట్యాద్యహర్గణమును కుజునికి 214 చేతనూ బుధునకు 488 చేతనూ గురునకు 174 చేతనూ శుక్రునకు 903 చేతనూ శనికి 662 చేతనూ వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను వరుసగా 1577917828000 చేత భాగించి తెచ్చిన భగణాది ఫలములయందలి రాశ్యాదిఫలములే కుజాదులకు సూర్యసిద్ధాంతానీతమధ్యపాతలగును.

(2) లేక నీ గ్రంథోక్త ధృవాబ్దములను కుజునికి 64 చేతనూ బుధునకు 146 చేతనూ గురునకు 63 చేతనూ శుక్రునకు 270 చేతనూ శనికి 198 చేతనూ వేరువేరుగా గుణించి వచ్చిన మొత్తములను వరుసగా .1000 వెయ్యిచేత భాగించి తెచ్చిన సర్థోత్తర విలిప్తల నీ క్రింద జెప్పబోవు వారివారి పాత ధృవకములలో చేర్చగా సూర్య సిద్ధాంతానీత మధ్యపాతలగును.

ధృవకములు.

కుజునికి-10-19-56-59,, బుధునికి-11-9-19-29, గురునకు-9-10-19-59 శుక్రునకు 10-0-20-56,, శనికి-8-19-39-28,, పాతధృవకములగును.

ఉదా:—ధృవవాబ్దములు శూన్యమగుటచే మందోచ్చములకు చెప్పియుండు విధముగనే మీదచూపియుండు పాతధృవకములే మధ్యపాతలగుననుటను గూర్చి 1-వ క్రమముచే సరిపోల్చిచూడుము.

గమనింపు,, ఈ పాతలవలన గలుగబోవు ప్రయోజనము ముందుచూపబడును.

సూర్య సిద్ధాంతాయనాంశము.

తా॥ సృష్ట్యాద్యహర్గణమును 600-చే పెంచివచ్చిన దానిని యుగాహర్గణమగు 1577917828 చేత విభజింపగావచ్చిన భగణాది ఫలములో భగణములను విడిచి రాశ్యాదిగవ్రాసుకొనగా నిష్టదినమునాటికి అయన గ్రహమగును.

దానిని రవిమంద కేంద్రముగనెరిగి భుజాసాధనమునుజేసి వచ్చిన రాశ్యాది భుజను భాగాదికి మార్చినయిన దానిని 3-ట గుణించి 10-ట భాగింపగా భాగాదిగ అయనాంశములగును.

అందు అయన గ్రహమారు రాసులకు తగ్గియుండునపుడు ప్రత్యక్చలనమనియూ ఆరురాసులకు మించియుండునపుడు ప్రాక్చలనమనియూ, దెలసి ప్రత్యక్చలనముగనుండునపుడు ఋణాయ నాంశములనియూ; ప్రాక్చలనముగను డునపుడు ధనాయనాంశములనియూ, నిర్ణయించుకొని రవ్యాది గ్రహములయందు తత్తత్కాలోచితముగ సంస్కరించుకొని చరార్ధాదులను సాధించుకొనవలసినది.

గమనింపు,, సంవత్సరమొకటికి 54 విలిప్తగతిగల నయనాంశములు వర్తమానమున ప్రాక్చలనమును బొందియుండుటచే వెనుకటి యధ్యాయములలో సాయనాంశ గణిత విధిని సరిపోల్చి వ్రాయబడియె. అంనయన భాగలు 27 వచ్చువఱలో మీది క్రమము లేనుపయుక్తముగనుండి తదనంతరమున వక్రగతిచే తగ్గుచూవచ్చినయనాంశములు శూన్యమైమరలవృద్ధికెక్కునపుడు ఋణముగా మారునని తెలియవలసినది.

## ఇతి శ్రీ సిద్ధాంత చింతామణి గ్రంథస్థ సిద్ధాంత రహస్యోనామ ప్రథమభాగే సూర్య సిద్ధాంత సంగ్రహే మధ్యాధికారః

### సూర్య సిద్ధాన్తోక్త క్రమజీవలు 24.

| | | |
|---|---|---|
| 1-225 అ 224 | 9-1910 అ ,83 | 17-3084 అ 93 |
| 2-449 అ 222 | 10-2093 అ 174 | 18-3177 అ 79 |
| 3-671 అ 219 | 11-2267 అ 164 | 19-3256 అ 65 |
| 4-890 అ 215 | 12-2431 అ 154 | 20-3321 అ 51 |
| 5-1105 అ 210 | 13-2585 అ 143 | 21-3372 అ 37 |
| 6-1315 అ 205 | 14-2728 అ 131 | 22-3409 అ 22 |
| 7-1520 అ 199 | 15-2859 అ 119 | 23 3431 అ 7 |
| 8-1719 అ 191 | 16-2978 అ 106 | 24-3438 అ 0 |

*N. B.* 24-వ జీవప్రమాణ లిప్తలగు 3438-లను త్రిజ్యయని చెప్పబడును.



తా॥ ఏలిప్తలకు జీవనియ్యవలయునో దానిని 225-ట భాగింపగావచ్చు లబ్ధము జీవసంఖ్యయగును అందలి శేషకలాదిని ఆజీవాంతర లిప్తలచే పెంచి వచ్చిన మొత్తమును 225-ట భాగించి తెచ్చిన లిప్తాదిఫలమును జీవలిప్తలలో చేర్చగాజ్యాలిప్తలగును

ఉదా:—రాశ్యాది 1-8-20-30-లకు జీవనియ్యుము జీవనియ్య వలసిన దానిని లిప్తలేజేయవలయును గనుగ దీనిని కలాదిగజేయగానైన 2300-30-ను 225-ట భాగించ గావచ్చిల లబ్ధము 10 ఇదే జీవసంఖ్య శేష కలాది 50-30 దీనిని 10-వ జీవాంతరమగు 174-చేత గుణించివచ్చిన 8787-0 లను 225-ట భాగించి తెచ్చిన కలాది ఫలమగు 39-3-లను 10-వ జ్యాలిప్తలగు 2093-లలో చేర్చగానైనజ్యాకలాది 2132-3.

### ధనుర్గణితము అనగా ధనువునిచ్చుట.

తా॥ ఏలిప్తలకు ధనువు నివ్వవలయునో దానిలోతీసివేయుటకు పోవుజ్యా ప్రమాణ లిప్తలలో నధికమగు దానిని తీసివేయగా నిలుచు శేష లిప్తాదిని 225-ట గుణింపగా వచ్చిన మొత్తమును తీసివేసియుండు జీవాంతరముచేత భాగింపగావచ్చు లిప్తాది ఫలములో వెనుకనెన్నవ జీవను తీసివేసియుండునో నా జీవ సంఖ్యచే 225-ను పెంచివచ్చిన లిప్తలను చేర్చగా ధనువగును.

గమనింపు,, జ్యాధనుర్గణితములు రెండునూ పరస్పరముగ వైపరీత్యమును పొందియుండుననగా నొకటికొకటి విరుద్ధములుగనుండునని భావము, అందు జీవనియ్యవలసిన లిప్తలుగానీ లేక ధనువునియ్యవలసిన లిప్తలుగానీ 225 లిప్తలకంటెను తగ్గియుండునపుడ వియేక్రమముగ జ్యాధనువులగునని తెలియావలసినది.

ఉదా:—2132-3 కలాదికి ధనువునెత్తుము.

ఈ ధనువు నివ్వవలసిన కలాదియగు ;2132-3-లలో తీసివేయుటకుపోవు జీవ ప్రమాణ లిప్తలలోనధికమగునది 10-వ జీవలిప్తలగు 2093 గనుక దీనిని తీసివేయగా నిలిచిన శేషకలాది 39-3 దీనిని 225-ట గుణింపగా వచ్చిన 8786-15-లను 10-వ జీవాంతరమగు 174-చేత భాగించితెచ్చిన లిప్తాదిఫలము 50-30 దీనిలో వెనుక 10-వ జీవను తీసివేసియుండుటచే 225-ను 10-చే పెంచివచ్చిన లిప్తలగు 2250-లను చేర్చగానయిన ధనుః ప్రమాణ లిప్తలు 2300-30.

ఈ జ్యాధనుర్గణితముల రెంటినీ బాగుగ పాఠముచేసియుంచుకొని యుండవలయును.

## అథరవ్యాది సప్తగ్రహాణాం మందయుగ్మౌజాంతరపరిధి భాగలిప్తాః.

| గ్రహములు | యుగ్మపరిధిభాగలు | అంతర లిప్తలు |
|---|---|---|
| రవికి | 14 | 20 |
| చంద్రునికి | 32 | 20 |
| కుజునికి | 75 | 180 |
| బుధునికి | 30 | 120 |
| గురునకు | 33 | 60 |
| శుక్రునకు | 12 | 60 |
| శనికి | 49 | 60 |

## రవ్యాదిసప్తగ్రహములకు మందఫలసాధనక్రమము.

తా॥ వారివారి మందోచ్చములలో నాయాగ్రహములను తీసివేయగా నిలిచినదియే మందకేంద్రములగును. దానిని బట్టి వెనుక సూర్యస్ఫుటమునందు జెప్పియుండు విధముగనే భుజను తెచ్చియుంచుకొని దానికి జ్యాసాధనమును జేయగానది భుజజ్యాయగును. ఇట్లు తెచ్చిన వారివారి మంద భుజజ్యా కలాదిని నాయాగ్రహములకు నీ మీదచూపియుండు యుగ్మౌజాంతర లిప్తలచే గుణించివచ్చిన మొత్తమును త్రిజ్యచే విభజింపగావచ్చు లిప్తాదిఫలమును మానమెత్తినయిన దానిని వారివారికి చెప్పియుండు యుగ్మపరిధి భాగలలో తీసివేయగా స్ఫుటపరిధులగును. అట్టి పరిధులచే మీదవచ్చియుండు భుజజ్యను (లిప్తాదిని భాగాదిగజేసి ధనాదయనసూత్రములో) గుణింపగా వచ్చిన భాగాదిని కలాదిగజేసినయిన దానిని భగణాంశములగు 360–టం భాగింపగావచ్చు లిప్తాదిఫలము మందఫల జ్యాయగును, దానికిధను విచ్చగా మందఫలమగును.

గమనింపు,, తాంత్రిక గ్రంథములయందలి మందపదకములలో ప్రతి పదక మాన లిప్తలకునూ నీ మీది క్రమములుగనే తత్తద్గ్రహమంద భుజాఫలములను దెచ్చి గతపదక ఫలమునకునూ నేష్య పదక ఫలమునకునూగల అంతరాళమును గతపదకాంతరముగ నిర్ణయించి ననుపాతము నేర్పరచెదరు అందు గతపదక ఫలమున కంటెను నేష్య పదకఫలము తగ్గియుండునపుడు రుణాంతరమని గుర్తించెదరు.

## అథ కుజాది పంచగ్రహాణాం శీఘ్రపరిధ్యంతర భాగ లిప్తాః. 

| గ్రహములు | యుగ్మపరిధి భాగలు | అంతర లిప్తలు |
|---|---|---|
| కుజునికి | 235 | 180 |
| బుధునికి | 133 | 60 |
| గురునకు | 70 | 120 |
| శుక్రునకు | 262 | 120 |
| శనికి | 39 | 60 |

## కుజాది పంచగ్రహములకు శీఘ్రఫలసాధనక్రమము.

తా॥ కుజాది తారాగ్రహములను వారివారి శీఘ్రోచ్చములలో తీసివేయగా నిలిచినది శీఘ్రకేంద్రములగును. దానిని బట్టి వెనుకటివలెనే భుజను తెచ్చి నాభుజను మూడు రాసులలో తీసివేయగా నిలిచినది కోటియనబడును.

అట్టి భుజా కోట్ల రెంటినీ కలాదిగజేసి దానికి వేరువేరుగా జ్యా సాధనములను చేయగానవి వరుసగా భుజజ్యా కలాదియనియూ కోటి జ్యా కలాదియనియూ చెప్పబడును.

తరువాత భుజజ్యా కలాదిని వారివారికి నీ మీద చెప్పబడియుండు యుగ్మౌజపరిధ్యంతర లిప్తలచే గుణించి వచ్చిన మొత్తమును త్రిజ్యచే విభజించినెత్తగా వచ్చిన లిప్తాది ఫలమును మానమెత్తగానయిన దానిని గురుశనుల శీఘ్రయుగ్మపరిధి భాగలలో చేర్చగానూ తక్కిన కుజ బుధ శుక్రుల యుగ్మపరిధి భాగలలో తీసివేయగానూ కుజాదులకు శీఘ్ర స్ఫుటపరిధులగును. అట్టి స్ఫుటపరిధులచే మీద తెచ్చియుండు భుజజ్యా కోటిజ్యలను వెనుకటివలెనే వేరువేరుగా గుణింపగావచ్చు మొత్తములను కలలుచేసి వరుసగా 360–ట భాగించి లిప్తాదిఫలములనెత్తగానవి క్రమముగ భుజ జ్యా ఫలమనియూ కోటి జ్యా ఫలమనియూ చెప్పబడును.

అందు కోటి జ్యా ఫలకలాదిని నాయా శీఘ్రకేంద్రములు మకరాదిలో నుండునపుడు త్రిజ్యా ప్రమాణ లిప్తలగు 3438-0-లలో చేర్చగనూ కర్క్యాదిలో నుండునపుడు తీసివేయగనూ శుద్ధ కోటియగును.

శుద్ధ కోటినిన్నీ మీద తెచ్చియుండు భుజజ్యా ఫలమునున్నూ వేరువేరుగా వర్గించుకొని యా రెండు వర్గములనూ చేర్చి అయిన మొత్తమునకు గణితాధ్యాయము నందలి 22-వ పాఠము చొప్పున మూలమెత్తగానది చలకర్ణ లిప్తాదియగును.

తరువాత పూర్వోక్తమగు భుజజ్యా ఫలమును త్రిజ్యచే పెంచివచ్చిన మొత్తమును చలకర్ణముచే భాగింపగావచ్చు కలాదిఫలమునకు ధనువివ్వగా శీఘ్రఫల కలాదియగును.

గమనింపు,, మందఫల సాధన క్రమమునుబట్టి తాంత్రికమాందఫల పదకములను నిర్ణయించు క్రమమును తెలియజేసియుండు నీ మీదిక్రమములుగనే శీఘ్రఫలసాధనక్రమములయందు సైతము శీఘ్రపదకఫలములను నిర్ణయించియుండెదరు.

అందు నాయా గ్రహతాంత్రిక పదక కలాపరిమాణ నిర్ణయములచే నాయా గ్రంథములయందు ఫలసాధనోపయుక్తమగునట్లు అనుపాతవిధిని బోలియుండునట్టి గణితక్రమములతో ఫలసంస్కారాదులను నిర్ణయించియుండెదరని తెలియవలసినది.

## సూర్య సిద్ధాంతోక్త ఫలసంస్కారక్రమమునందలి సవరణీకృత తాత్పర్యము.

రవి స్ఫుటక్రమము,, రవి మందోచ్చములో దృక్సంస్కృత మధ్య రవిని తీసివేయగా నిలిచినది రవిమందకేంద్రమగును. దానిని బట్టి నీ మీదిక్రమములుగనే రవికి మంద భుజాఫలమును దెచ్చి వచ్చిన దానిని శుద్ధమధ్యమార్కునియందు సంస్కరింపగా సూర్య సిద్ధాంతానీత దృక్సిద్ధ స్ఫుటార్కుడగును.

చంద్రస్ఫుటక్రమము,, శుద్ధతుంగములో శుద్ధమధ్యమ చంద్రుని తీసివేయగా నిలిచినది చంద్రమంద కేంద్రమగును దానినుండియు మీద చెప్పియుండు క్రమములుగనే చంద్రమంద భుజాఫలమును దెచ్చి వచ్చిన దానిని శుద్ధమధ్య చంద్రునియందు సంస్కరింపగా సూర్య సిద్ధాంతానీత దృక్సిద్ధచంద్ర స్ఫుటమగును.

అందు తిథ్యాదులను గణింపవలసినపుడీ రవి చంద్ర స్ఫుటములు పనికిరాదనియూ, నివటిని గ్రహణాది జాతకములలో తప్పకనుపయోగింపవలసినదనియూ,



అందు నీ వెనుక చెప్పియుండు దృక్సంస్కార ఫలములను రవి చంద్ర తుంగములలో సంస్కరింపక స్ఫుటీకరించియుండు రవి చంద్రులచే తిథ్యాదులను గణింపవలసినదనియూ, నీ మొదలగు విషయములను వెనుక స్ఫుటాధ్యాయాంశముననే విస్తారముతో వ్రాసినుదహరింపబడియుండుటచే నిందువ్రాయనక్కఱలేదు.

## కుజాదిపంచ తారాగ్రహములకు.

(1) కుజాది శుద్ధ మధ్యగ్రహములను వారివారి శీఘ్రోచ్చములలో తీసివేయగా నిలిచినది ప్రథమ శీఘ్రకేంద్రములగును, దానిని బట్టి మీదిక్రమములుగనే నాయా గ్రహములకు శీఘ్రఫలమును దెచ్చిదాని నర్ధింపగానగు ప్రథమ శీఘ్రఫలార్ధమును నాయా శుద్ధ మధ్యగ్రహములయందు సంస్కరింపగా ప్రథమ శీఘ్రగ్రహములగును.

(2) ప్రథమ శీఘ్రగ్రహములను వారివారి మందోచ్చములలో తీసివేయగా నిలిచినది ద్వితీయ మందకేంద్రములగును. దానిని బట్టి రవి చంద్రులకు జెప్పియుండు నీ మీదిక్రమములుగనే మంద భుజాఫలమును దెచ్చి నర్ధింపగానగు ద్వితీయ మందఫలార్ధముల నాయా ప్రథమ శీఘ్ర గ్రహములలో సంస్కరింపగా ద్వితీయ మందగ్రహములగును.

(3) ద్వితీయ మందగ్రహములను మరల వారివారి మందోచ్చములలో తీసివేయగా నిలిచినది తృతీయ మందకేంద్రములగును దానిని బట్టి మీదిక్రమముగనే మరల మందఫలమును దెచ్చివచ్చినదాని నంతయూ ప్రథమ శీఘ్ర సంస్కారముచేయని నాయా శుద్ధమధ్యగ్రహములయందే సంస్కరింపగా మందస్ఫుటగ్రహములగును.

(4) మంద స్ఫుట గ్రహములను మరల వారివారి శీఘ్రోచ్చములలో తీసివేయగా నిలిచినదియంత్య శీఘ్రకేంద్రములగును. దానిని బట్టి మీదిక్రమములుగనే మరల శీఘ్రఫలమును దెచ్చివచ్చినదాని నంతయూ నాయా మంద స్ఫుటగ్రహములయందు సంస్కరింపగ సూర్య సిద్ధాంతానీత మధ్యాహ్నకాల దృక్స్ఫుటగ్రహములగును.

అందులో నీ మీద జెప్పియుండు మంద శీఘ్రఫల సంస్కారక్రమముల యందంతటియందునూ వెనుకటి మధ్యాహ్నోక్తములుగనే నాయా కేంద్రములు మేషాదిలోనుండునపుడు ధనముగనూ, తులాదిలోనుండునపుడు ఋణముగనూ తెలియవలసినది.

మరియూ శుద్ధ మధ్యగ్రహములయందలి మధ్య మార్కండే కుజ గురు శనులకు శీఘ్రోచ్చముగనూ బుధ శుక్రులకు శుద్ధ మధ్యగ్రహముగనూ నుండుననియూ అందు వెనుకవచ్చియుండు బుధ శుక్ర శీఘ్రములే మధ్యమార్క రూపమగు బుధ శుక్రులకు శీఘ్రోచ్చములగుననియూ నీ వెనుక నే పాఠమయినది. గనుక నీ సూర్య సిద్ధాంతమునందు బుధ శుక్రులకు శీఘ్రకేంద్రములు జెప్పబడియుండుటచే మీద తెచ్చియుండు బుధ శుక్ర శీఘ్రోచ్చములయందే శుద్ధ మధ్య మార్కనుని తీసివేయగా నిల్చినది బుధ శుక్రులకు ప్రథమ శీఘ్రకేంద్రములగునని నూహింపవలసినది.

## ముఖ్య గమనింపు.

జాతకా దీష్టకాలములకు నీ సూర్య సిద్ధాంతోక్తముగ గ్రహస్ఫుటముల నెత్తవలసినపుడు నీ వెనుక పాతాధ్యాయమునందలి గ్రహతాత్కాలికీ కరణము క్రింద వ్రాసియుండు నో-ప్రకారముగ నీ వెనుక చూపియుండు మధ్యాహ్నకాల సూర్య సిద్ధాంతానీత శుద్ధ మధ్యగ్రహముల నే తాత్కాలించుకొని పిమ్మట స్ఫుటీకరించుకొనవలసినది. (ఇందలి విశేషక్రమములకు ముందుచూడుము.)

## మందఫలానయనోదాహరణము.

రవి మందోచ్చము 2-17-17-33 దీనిలో దృక్సంస్కృత మధ్యమార్కుడగు 1-10-16-17-లను తీసివేయగానైన రవి మందకేంద్రము 11-7-1-16 దీని భుజా 0-22-58-44 దీని కలాది 1378-44 దీనికి జ్యా సాధనముచేయగానైన భుజ జ్యా కలాది 1341-11 దీనిని రవికి చెప్పియుండు యుగ్మౌజపరిధ్యంతర లిప్తలగు 20-చే గుణించివచ్చిన మొత్తమును త్రిజ్యయగు 3438-చే భాగింపగా వచ్చిన కలాది 7-48 దీనిని రవికి యుగ్మపరిధి భాగలగు 14-లలో తీసివేయగా నిలిచిన స్ఫుటపరిధి భాగాదికము 13-52-12 దీనిని మీద వచ్చియుండు భుజ జ్యా కలాదిని భాగాదిగజేయగా నయిన 22-21-11-చే సవప్రతిగా గుణించి వచ్చిన అంశాదిఫలము 310-2-13 దీని కలాది 18602-13 దీనిని 360-ట విభజింపగావచ్చిన మందఫల జ్యా లిప్తాది 51-40 ఇది 225 లిప్తలకు తగ్గియుండుటచే నిదియే ధనువగును గనుక దీనినే రవి భుజాఫలముగ తెలిసి రవి మందకేంద్రము తులాదినిపొందియుండుటచే శుద్ధ మధ్య మార్కుడగు 3-10-16-9-లలో తీసివేయగానయిన సూర్య సిద్ధాంతానీత ఫలసంస్కృత మాధ్యాహ్నకాలిక దృక్సిద్ధ సూర్యస్ఫుటము 3-9-24-29.



గమనింపు. ఈ రవికి చెప్పియుండు క్రమములుగనే చంద్రునికినీ మాంద్యక ఫల సంస్కారమును సంస్కరించి స్ఫుటీకరించుకొనవలయును.

అందు రవికి మందోచ్చ గతిలేదుగాన రవి మధ్యగతియగు 59-8-లే రవికి కేంద్రగతియగుననియూ చంద్ర మధ్యగతిలో చంద్రోచ్చగతిని తీసివేయగా నిలిచిన 783-54-లు చంద్రకేంద్ర గతియగుననియూ తెలిసి దానిని వారివారి స్ఫుట కర్మయందలి జీవాంతరముచే పెంచివచ్చిన దానిని 225-ట భాగింపగావచ్చు లిప్తాదిఫలమును వారివారి స్ఫుటపరిధులచే గుణించి వచ్చిన కలాది లబ్ధమును 360-ట విభజింపగావచ్చు లిప్తాదికము రవి చంద్రులకు గతిఫలమగును. గనుక దానిని వారివారి మందకేంద్రములు కర్క్యాదిలోనుండునపుడు వారివారి మధ్య గతిలో చేర్చగనూ మకరాదిలోనుండునపుడు తీసివేయగనూ రవి చంద్రులకు గతి స్ఫుటములగును. ఈ క్రమములుగనే గణించి తెచ్చిన గతిస్ఫుటములను పదకములుగా వ్రాయబడెను. అందు రవి చంద్రులకు దప్పతక్కిన కుజాదుల గతిస్ఫుటములను సూర్య సిద్ధాంతోక్త క్రమములచే గణింపగా తాత్కాలిక వినాడికయందలి గ్రహసంచార కలా నిర్ణయమును తెలుపును గనుకనది గ్రహతాత్కాలిక క్రమములకు పనికిరాదు అందుచే నాక్రమములనే చూపలేదని తెలిసి దినద్వయ స్ఫుటాంతరముల నెత్తి వచ్చిన దానిని గతిస్ఫుటములుగా నెరుంగవలసినది.

## శీఘ్రఫలానయనోదాహరణము.

ఇందు సూర్యోదయాది 5-48-లకు కుజ స్ఫుటము కావలయుననుకొందము.

దినార్ధలో నిష్టకాలమును తీసివేయగానయిన గత ఘడియలు 10-0 దీనిచే కుజ రవుల మధ్యగతులను వేరువేరుగా గుణించివచ్చిన మొత్తములను వరుసగా నరువదింట భాగించి తెచ్చిన లిప్తాది ఫలములు కుజునికి 5-14 రవికి 9-51 ఈ ఫలములు గతఘడియలచే వచ్చియుండుటవలన నాయా మధ్యాహ్నకాల శుద్ధ మధ్యగ్రహములలో తీసివేయగా నయిన తాత్కాలిక శుద్ధ మధ్యగ్రహములు రవి: 3-10-6-18, కుజ: 1-17-11-35.

ఈ విధముగనే నన్ని మధ్యగ్రహములనూ నిష్టకాలమునకు తాత్కాలించుకొనిన పిమ్మట స్ఫుటీకరించుకొనవలసినది. అందు సూర్యోదయా దీష్టకాలము

దినార్ధాధికముగనుండునపుడు ఇష్టకాలములో దినార్ధమును తీసివేయగా నిలుచునది ఏష్య ఘటికాదియగునని తెలిసి దానికేర్పడు మధ్యగతిఫలములను గ్రహములలో చేర్చుకొనవలసినది.

కుజ శీఘ్రోచ్చమగు మధ్య రవిః 3-10-6-18-లలో మధ్య కుజుడగు 1-17-11-35 లను తీసివేయగా నిలిచిన కుజ ప్రథమ శీఘ్రకేంద్రము 1-23-54-43 ఇదే భుజా. దీనిని మూడురాసులలో శోధింపగా నిలిచినకోటి 1-7-5-17 భుజాకలాది 3174.43 ఈ లిప్తాదికి జీవనియ్యగానైన భుజజ్యా కలాది 2742-24 దీని భాగాది 45-42-24, కోటి లిప్తలు 2225-17 కోటి జ్యా లిప్తాది 2072-54 దీని భాగాది 34-32-54, భుజ జ్యా కలాదిని కుజ శీఘ్రముగ్మ్రజపరిధ్యంతర లిప్తలగు 180-ట గుణింపగా వచ్చిన 493632 లిప్తలను త్రిజ్యచే విభజింపగావచ్చిన లిప్తాదిఫలము 143-35 దీని భాగాది 2-23-35 దీనిని కుజయుగ్మశరధి భాగలగు 235-లలో తీసివేయ నిలిచిన కుజ శీఘ్ర స్ఫుటపరిధి భాగాది 232-36-25 దీనిని భుజ జ్యా భాగాదిచేత గుణింపగా వచ్చిన అంశాది 1033-41-17 దీని కలాది 637901-17 దీనిని 360-ట భాగింపగా వచ్చిన భుజజ్యా ఫలకలాది 1771-57.

అదే విధమున స్ఫుటపరిధిచేత కోటిజ్యా భాగాదిని గుణింపగా వచ్చిన అంశాదిమగు 8036-10-56-లను లిప్తలుజేసినయిన దానిని 360-ట భాగింపగావచ్చిన కోటిజ్యా ఫలకలాది 1339-22 దీనిని కుజ ప్రథమ శీఘ్రకేంద్రము మకరాదిని పొందియుండుటచే త్రిజ్యాప్రమాణ లిప్తలగు 3438-లలో చేర్చగానయిన శుద్ధ కోటి కలాది 4777-22-ను. వర్గింపగానయిన శుద్ధ కోటి కలాదివర్గము 22823282-16 దీనిలో మీదవచ్చియుండు భుజ జ్యా ఫలమును వర్గింపగానయిన, 3139806-48-లను చేర్చినయిన మొత్తమగు 25963039-4 కలాదికి వర్గమూలమెత్తుటకై సవరణింపగా నయిన భాజ్యరాశి 93466940640 దీనిమూలమగ్గోత్తర విలిప్తలు 305724 దీనిని లిప్తాదిగజేయగా నయిన చలకర్ణ కలాది 5095-24 దీనిచే మీదవచ్చియుండు భుజ జ్యా ఫలకలాదియగు. 1771-57-లను త్రిజ్యచే పెంచివచ్చిన లిప్తాదిఫలమగు 6091964-6-లను భాగింపగావచ్చిన శీఘ్రఫల జ్యాకలాది 1195-35 దీనికిధనువివ్వగా నయిన కుజప్రథమ శీఘ్రఫల కలాది 1222-3 దీనిలోసగము 611-2 దీని భాగాది 10-11-2 దీనిని కుజ ప్రథమ శీఘ్రకేంద్రము మేషాదిలోనుండుటచే తాత్కాలిక శుద్ధ మధ్యకుజుడగు 1-17-11-35-లలో చేర్చగానయిన ప్రథమ శీఘ్రకుజుడు 1-27-22-37.



గమనింపు,, ఈ మీద చెప్పియుండు మాంద శీఘ్రఫలానయనోదాహరణ గణిత విధిక్రమములుగనే నాయాగ్రహములకు చెప్పియుండు శీఘ్రపరిధ్యంతరములచే శీఘ్రఫలములనూ మందపరిధ్యంతరములచే మాందఫలములనూ వరుసగా గణించి తెచ్చుకొని మీద జెప్పియుండు ఫలసంస్కారక్రమములచే క్రమముగ స్ఫుటీకరింప వలసినది. (రాహు కేతువులను వెనుకటివలెనే తెచ్చుకొనవలెను.)

## ఇతి స్ఫుటాధికారః.

తా॥ కుజాది తారాగ్రహములలో నెవరుగానీ రవితోగలసియుండునపుడస్తమానమనియూ, చంద్రునితో జేరియుండినపుడు సమాగమమనియూ, రవి చంద్రులే కలసియుండునపుడు యోగమనియూ, కుజాది పంచగ్రహములో నెవరుగాని రెండేసి గ్రహములొకచోట చేరియుండిన యుద్ధమనియూ జెప్పబడును. అందులో వారి స్ఫుటములు రెండునూ లిప్తలతో సైతము నొకటిగనే వచ్చియుండునపుడు స్థిరీకృతాస్తసమాగమాని యుద్ధకాలములగునని తెలియవలెను.

గమనింపు,, కుజాదుల యుద్ధమనుటకు మారుగా నక్షత్ర గ్రహణములని జెప్పబడును. అందూర్ధ్వమండలస్థ గ్రహ బింబము నధోమండలస్థ గ్రహ బింబముచే గప్పబడునని తెలియవలసినది. మఱియూ చంద్రాది గ్రహసంచారకక్ష్యా మండలము లుత్తరోత్తరోన్నోన్నత్యములను బొంది పరస్పర సంబంధము లేకుండినను గ్రహయోగ ఫలాదులను చింతించుటకై గ్రహసమాగమాదులను జెప్పబడియుండు ననుటనుగూర్చి సౌరోపనిషత్, భావాభావయలోకానాం కల్పనీయం ప్రదర్శితా । స్వమార్గగా ప్రయాంత్యేతే దూరమన్యోన్య మాశ్రితాః ॥

గతైష్యజ్ఞానము:—సమీపవర్తులగనుండు రెండు గ్రహములనూ క్రమముగ (దృక్సిద్ధాన్త సంగ్రహమును జూడుము) దృక్సిద్ధ స్ఫుటములను దెచ్చిచూడగా, వారిరువురునూ సవ్యగతిని బొందియుండి అంశాధికగతిగల గ్రహముకంటెను అల్పగతి గల గ్రహముమించియుండునపుడు యోగకాలము ముందురాగలదనియూ, తగ్గియుండునపుడు గతించిపోయినదనియూ తెలియవలసినది. అదే విధమున వారిరువురికినీ వక్రగతిగలిగియుండునపుడు నీ మీద జెప్పబడియుండు గతైష్య నిర్ణయములకు

విపరీతముగా గతైష్యములనూహింపవలసినది. మఱియూ వారిలో నొకగ్రహమునకు సవ్యగతియూ నింకొక గ్రహమునకపసవ్యగతియూ గలిగియుండునపుడు వక్రిగ్రహముకంటెను నవక్రిగ్రహము తగ్గియుండునపుడు యుద్ధకాల మేష్యమనియూ, మించియుండునపుడు గతమనియూ, తెలియవలసినది.

### గతైష్యకాల సాధనము.

తా॥ తరువాత నారెండు గ్రహములునూ ఏకగతిననగా (వక్రావక్రగతులలో నేదైన నొకటే జాతిగల గతిని బొందియుండునపుడు వారల స్ఫుటాంతరమును నారలగత్యంతరముచే భాగింపగనూ, భిన్నగతులను పొందియుండునపుడు వారల స్ఫుటాంతరమును వారిద్దరి స్ఫుటగతి మొత్తముచే విభజింపగనూ, గతైష్యరూపమగు దినాదిఫలమగును. అందు దినములులేక ఘటికాది మాత్రమేవచ్చియుండునపుడు తాత్కాలికమునకు స్ఫుటగ్రహములనే స్ఫుటగతులవలన తాత్కాలించుకొనగా నారెండు గ్రహములునూ సమ కలాత్మకమగును-అట్లు లేకదినములు సైతము వచ్చియుండునపుడు నాకాలమునకు వారివారి మధ్యగతులచే నాయా మధ్యగ్రహములను వరుసగా తాత్కాలియకొని పిమ్మట స్ఫుటీకరించి మీదిక్రమములుగనే మరలగతైష్యములను దెచ్చి స్ఫుటగ్రహతాత్కాలికీకరణ మొనర్చి సమ కలాత్మకమగునట్లు జేయవలసినది.

ఉదా:—మధ్యాహ్నకాల స్ఫుటగ్రహాః * చంద్రః 9-6-24-11 గ 860-3 శనిః 10-1-1-45 వక్రి 4-44, కుజః, 2.14-22-28 గ 29-44, శుక్రః 2-10-28-57 గ 72, ఇందు శని చంద్ర సమాగమకాలమును గని బెట్టుటకు వారినంతర భాగాదులగు 24-37-34-లను వాలొకనికి వక్రగతిగలిగియుండుటచే వారిద్దరి స్ఫుటగతి యోగమగు 864-47-లచే భాగింపగావచ్చిన దినాది 1-42_31, ఇది వక్రగ్రహము మించియుండుటచే నేష్యఫలమగును గనుక దీనిని ఇప్పటి వారాదియగు (ఈ గ్రహములు గురువారము నాటిమధ్యాహ్నకాలీయములగుటచే గురువారము నాటివార సంఖ్య 5 దినార్ధ ఘటికాది 15-48) 5-15-48-లలో చేర్చగా నయిన శని చంద్ర

* ఈ గణిత క్రమములయందు ముందు జూపబోవు దృక్సిద్ధాన్త సంగ్రహోక్త గ్రహ స్ఫుటములే కావలసియుండిననూ గణితోదాహరణార్థమై వెనుకటి గ్రహస్ఫుటములనే నంగీకరింపబడెనని తెలియవలసినది,



సమాగమకాల వారాది 6.58-19, ఇది రేపుదయాది 58-19-లను సూచించును. ఈ క్రమములుగనే శుక్రాంగారకుల యుద్ధకాలమును దెలియుటకు గణింపగా వచ్చిన నేష్యఫలదినాది 7-14_14 దీనిచే వచ్చే గురువారమునాడుదయాది 30-2_లకు శుక్రాంగారకులు సమకలాత్మక మయ్యెదరని తెలిసెను, అయితే నీ రెండుదాహృతములయందలి గతైష్యఫలములలో దినములు సైతము వచ్చియుండుటచే తత్తత్కాలములకు నాయామధ్య గ్రహములను తాత్కాలించుకొని పిమ్మట వానిని క్రమముగ స్ఫుటీకరించుకొని వానిచే మరల గతైష్యఫలములను దెచ్చి స్ఫుటగ్రహ తాత్కాలికముజేసి సమకలాత్మకముగ జేయుట విధియైననూ నిచట ఉదాహరణార్థముగ స్ఫుట గ్రహతాత్కాలికీ కరణమును జూపబడును.

60 ఘడియల ప్రమాణముగల దినమొకటికి 39-44 కలాది వంతున నేష్యఫలదినాదులగు 7-14-14 లకేర్పడిన కుజ స్ఫుటగతి భాగాది 4_47-34 ఈ క్రమముగనే శుక్ర స్ఫుటగతిచేతెచ్చిన ఏష్యఫల దినాదులగు 7-14-14-లకు స్ఫుట చాలితఫలము నెత్తగా వచ్చిన భాగాది 8-41-5 ఈ ఫలముల నాయా స్ఫుట గ్రహములలో చేర్చగా నయిన వచ్చే గురువారము నాడుదయాది 30-2 కాలిక స్ఫుట కుజః 2.19-10-2 స్ఫుట శుక్రః 2-19-10-2,,

గమనింపు:—ఈ మీద జెప్పబడియుండు గ్రహ గణితక్రమములనుపయోగించుకొని సైనును; పనియును,, జైమును; ధూరమును,, అను గణిత శాస్త్రవిధులచే వారివారి నిష్టానుసారముగ గ్రహ గణితక్రమములయందలి విశేషప్రక్రియలనూహింపవచ్చును.

### కుజాది పాత స్ఫుటక్రమము.

తా॥ కుజ గురు శనుల పాతలను స్ఫుటీకరించునపుడు వారివారి సంత్యశీఘ్రకేంద్ర భుజాఫలములను వారివారి మధ్యపాతలను 12 రాసులలో దీసివేయగా నిలుచు శేషములయందు వారివారి సంత్య శీఘ్రకేంద్రములు మేషాదిలోనుండి ధన భుజాఫలముగ వచ్చియుండునపుడు చేర్చగనూ; తులాదిలోనుండి ఋణ భుజాఫలముగ వచ్చియుండునపుడు తీసివేయగనూ-నదేవిధమున బుధ శుక్ర పాత స్ఫుటముల నెత్తవలసినపుడు వారివారి తృతీయ్య సంస్కారమునందలి మంద భుజాఫలమును

వారివారి మధ్య పాతలను 12-రాసులలో తీసివేయగా నిలుచు శేషములయందు వారివారి తృతీయ మాందకేంద్రములు మేషాదిలోనుండునపుడు తీసివేయగనూ, తులాదిలోనుండునపుడు చేర్చగనూ, కుజాదులకు పాత స్ఫుటములగును.

### మధ్యక్రాన్తిసాధనము.

తా॥ రవ్యాది గ్రహ స్ఫుటముల కయనాంశములను కలుపగా సాయన గ్రహములగును. వాటిని కేంద్రములుగ దెలసి భుజను దెచ్చి జ్యా సాధనమును జేయగా భుజజ్యా కలాదులగును. దానిని 1397-చే పెంచివచ్చిన మొత్తమును త్రిజ్యచే భాగించి లిప్తాది ఫలమునెత్తగా క్రాన్తిజ్యా మగును-దానికి ధనువివ్వగా మధ్య క్రాంతి లిప్తలగును. అందు నాయాసాయన గ్రహములు మేషాదిలోనుండునపుడుత్తరా క్రాంతియనియూ ; తులాదిలోనుండునపుడు దక్షిణా క్రాంతియనియూ తెలియవలసినది.

గమనింపు:—ఈ క్రాంతి సాధన గణితక్రమము ననుసరించియే పదక సంగ్రహమునందలి క్రాన్తి పదకముల నెత్తి నను పాతవిధితో వ్రాసియున్నవి గనుక పాతాధ్యాయములో జెప్పియుండు క్రాన్తిసాధన గణితక్రమముల ననుసరించియే నాయాసాయన గ్రహభుజాంశములను బట్టి సులభముతో మధ్యక్రాన్తుల నెత్తవచ్చును.

### విక్షేపధసానం.

తా॥ తాత్కాలికమనగా సమకలాగ్రహములయందలి చంద్ర కుజ గురు శనుల స్ఫుటములయందు వారివారి స్ఫుట పాతలను తీసివేయగనూ, మధ్యాధికారోక్తమగు తాత్కాలిక శుద్ధ బుధ శుక్ర శీఘ్రోచ్చములలో వారివారి స్ఫుటపాతలను తీసివేయగనూ, చంద్రాదులకు పాతోన కేంద్రములగును. దానిని బట్టి వెనుకటి క్రమములుగనే భుజ జ్యా కలాదులను తెచ్చియుంచుకొని చంద్ర భుజ జ్యా కలాదిని మాత్రము 270-ట గుణించివచ్చిన దానిని త్రిజ్యచే విభజింపగా వచ్చు కలాది ఫలమే చంద్ర విక్షేపంబగును. తక్కిన కుజాది పంచగ్రహములకునూ వారివారి పాతోన కేంద్ర భుజ జ్యా కలాదులను కుజునికి 90-చేతనూ బుధ శుక్ర శనులకు 120-చేతనూ గురున కరువదింటనూ క్రమముగ గుణింపగావచ్చు మొత్తములను వరుసగా వారివారి నంత్య శీఘ్రచలకర్ణములచే భాగింపగావచ్చు లిప్తాదిఫలములే నాయా గ్రహములకు



విక్షేపములగును. అందు వారివారి పాతోన కేంద్రములు మేషాదిలో నుండునపుడుత్తర విక్షేపమనియూ తులాదిలోనుండునపుడు దక్షిణ విక్షేపమనియూ తెలియవలసినది.

గమనింపు:— ఈ సూర్య సిద్ధాన్తమునందలి చంద్ర స్ఫుట పాతమనగా రాహువని తెలియవలసినది. అందు సపాత చంద్రుడునూ వి రాహు సోముడునూ సామ్యమని భావము.

### క్రాంతి స్ఫుటము.

తా॥ రవికి విక్షేపములేదుగాన నతనికి మధ్య క్రాంతియే స్ఫుట క్రాంతి యగుననియూ, తక్కిన చంద్రాదిషడ్గ్రహములకునూ పాతాధ్యాయమునందలి చంద్రక్రాంతి స్ఫుటములో జెప్పియుండు వెనుకటి విధములుగనే వారివారి మధ్య క్రాంతి విక్షేపముల దిక్కులనెరిగి క్రాంతి స్ఫుటముల నెత్తవలసినదనియూ తెలియవలయును.

### గ్రహ ద్యుగతఘటికాసాధనము.

తా॥ గ్రహసమకలాకాలమునకు సాయనలగ్నమును దెచ్చి అందలి భుక్తాంశములను బట్టి త్రిప్రశ్నాధ్యాయోక్తములుగ స్వదేశలగ్న ప్రమాణములనుండియూ లగ్నభుక్తకాల వినాడికలను తెచ్చియుంచుకొనవలసినది. తరువాత తాత్కాలిక సమకలా గ్రహముల రెంటిలోనొక దానికి అయనాంశములను చేర్చగానయిన సాయనగ్రహమునకు భోగ్యాంశములను దెచ్చి (సాయనగ్రహమునందలి భాగాదిని 30 భాగలలో తీసివేయగా నిలిచినది) దానిని బట్టి వెనుకటిక్రమములుగనే భోగ్య వినాడికలను తెచ్చియుంచుకొనవలసినది. ఇట్లు దెచ్చిన లగ్నభుక్త వినాడికలునూ సాయనగ్రహభోగ్య వినాడికలునూ చేర్చినయిన దానిలో సాయనగ్రహసాయన లగ్నములనడుమనుండు రాశిప్రమాణ విఘటికలను వరుసగా చేర్చుకొనగానయిన మొత్తమే నా రెండు గ్రహములకునూ ద్యుగత విఘటికలగును. దానిని ఘటికాదిగజేయవలెను.

గమనింపు:—ఈ గణితక్రమమునంతయూ స్ఫుట లగ్నముచే నిష్టకాలమును కనుగొను విధిని తప్పక బోలియుండునని తెలియవలసినది. మఱియూ నీ గ్రహద్యుగతిమును సాధించు విధిక్రమములుగనే నాయాగ్రహోదయకాలములను సూర్యోదయ

యాదిగ లెక్కింపవచ్చునని చెల్లునగా; అస్తకాలమునకు సాయన లగ్నరూపము నాయా సాయనగ్రహముల భుక్తాంశములను బట్టి తెచ్చిన భుక్తకాలమునూ, సాయన గ్రహరూపమగు తాత్కాలిక సాయనార్కుని భోగ్య - భాగాదిని బట్టి తెచ్చిన భోగ్యకాలమునూ చేర్చి అందు సాయనార్క - సాయనగ్రహముల నడుమనుండు రాశిప్రమాణములను వరుసగా చేర్చుకొనగా సూర్యునకునూ నాయా గ్రహములకునూ ప్రాఙ్ముఖముగనుండు నంతరాళమగును (సూర్యోదయాది గ్రహోదయకాలమగును) అదే విధమున పంచాంగానయనాధ్యాయమునందలి నక్షత్రయోగ ధ్రువకములలో నయనాంశములను జేర్చగానగు సాయన నక్షత్ర ధ్రువకములను బట్టి నీ మీదిక్రమములుగనే నక్షత్రోదయములనూ దెలియవచ్చును.

నతసాధనము:—తా॥ ఆయాగ్రహద్యుగత ఘటికాది కమాయాగ్రహదినార్ధములకంటెను తగ్గియుండునపుడెంత తగ్గియుండునో దానిని ప్రాఙ్నతమనియూ మించియుండునపుడెంతమించియుండునో దానిని ప్రత్యఙ్నతమనియూ, చెప్పబడు ననగా గ్రహముఖమధ్యోచ్చకాలమునకు పూర్వాపరదిక్కులయందెంత క్రిందికి తగ్గియుండునోవానికి క్రమముగ ప్రాక్ప్రత్యఙ్నతములనిభావము. ఈ విధిక్రమముల ననుసరించియే రాత్రికాలమున ప్రత్యఙ్నత ప్రాఙ్నతములను వరుసగా సాధించి యుంచుకొనవలసినది. (ఇందునుగూర్చి గ్రంథాంతమున పటముజూపబడును.)

అక్షదృక్కర్మము.

తా॥ ఆయాసమ కలాకాలగ్రహములకు నీ వెనుక సాధించియుండు విక్షేపములను విషువచ్ఛాయచే గుణించి 12-ట భాగింపగావచ్చు కలాది లబ్ధములను పూర్వసాధితములగునత ఘటికాదిచే గుణించివచ్చిన దానిని ముందుపయుక్త విషయములలో జెప్పబోవు నాయాగ్రహ దినార్ధములచే భాగింపగావచ్చు కలాదిఫలములను అక్షదృక్కర్మఫలములని జెప్పబడును. దానిని నాయాసమ కలాగ్రహములయందు ప్రాఙ్నతమునందలి నుత్తర విక్షేపముగవచ్చియుండునపుడు తీసివేయగనూ, దక్షిణ విక్షేపముగవచ్చియుండునపుడు చేర్చగనూ అపరనతమునందలి నుత్తర దక్షిణ విక్షేపములలో నీ మీదిరుణధనక్రమములకు విపరీతముగ సంస్కరింపగనూ అక్ష దృక్కర్మఫల సంస్కృత గ్రహములగును.

అయన దృక్కర్మము:

తా॥ అక్షదృక్కర్మఫల సంస్కృతగ్రహములో నయనాంశములునూ మూడు రాసులునూ చేర్చుకొనగా సత్రిభసాయన గ్రహములగును. దానిని భుజచేసి



ముందుజూపబోవు విధముగ నుత్క్రమజ్యాను సాధింపగానది భుజోత్క్రమజ్యా యగును. దానిని 1397-చే పెంచి త్రిజ్యచే భాగింపగావచ్చు క్రాంతి జ్యా ఫల కలాదికి క్రమధను విచ్చగా సత్రిభక్రాంతియగును దాని భాగాదిచే తత్కాల విక్షేపమును ధనానయన సూత్రములో గుణింపగావచ్చు నంశాదిఫలమే సత్రిభసాయన గ్రహముయొక్క దిశాపదములుగలనయన దృక్కర్మఫల కలాదియగును. దానిని సత్రిభక్రాంతి విక్షేపములు రెండునూ ఏకదిక్కును పొందియుండునపుడు అక్షదృక్కర్మఫల సంస్కృతగ్రహములో దీసివేయగనూ భిన్నదిక్కులను పొంది యుండునపుడు చేర్చగనూ దృక్కర్మద్వయ సంస్కృత స్ఫుటగ్రహమగును. అట్టి గ్రహములను బట్టి మఖిల యుద్ధకాల గతైష్యములను దెచ్చి నచటికిసమ కలాగ్రహములను తాత్కాలించుకొని వానిని బట్టి నీ మీదక్రమములుగనే మరల నక్షాయన దృక్కర్మఫలములను తెచ్చి సంస్కరించి సమకలాత్వమును పొందించుచూ చివరకు అక్షాయన దృక్కర్మద్వయ ఫలసంస్కారములచే క్రమముగ సమకలాత్వమును బొందింపగా నదియే స్థిరీకృతయుద్ధ సూక్ష్మకాలమగును. (మధ్యకాలము.)

గమనింపు:—నీ వెనుకటి రవి చంద్రగ్రహణాధ్యాయోక్త గణితక్రమములలో నెప్పుడైననూ గ్రస్తోదయ గ్రస్తాస్తమాన కాలములు సూర్యోదయ సూర్యాస్తమాన కాలములలో సంధించియుండునపుడీ మీదిక్రమములుగనే నక్షాయన దృక్కర్మములచే స్ఫుటీకరించియుండు గ్రహములచే తిథ్యంతమును దెచ్చివచ్చిన దానిని దృగ్గణిత పర్వాంతముగ తెలిసి గ్రహణ నిర్ణయములను విధింపవలసినది. (అందమావాస్యా పర్వాంతమున సమకలాత్వమును బొందియుండు రవి చంద్రులు పూర్ణిమాపర్వాంతమునకారురాసులు మాత్రము హెచ్చు తగ్గులుగా సమకలాత్మక మయ్యెదరని తెలియవలసినది.)

ఉదా:—భావ సం॥ ఆషాఢ శు 15 గురువారమునాడుదయాది 29-20-లకు తాత్కాలిక సాయన లగ్నము 9-17-57-44 ఇందలి భుక్తాంశములగు 17-57-44లను బట్టి త్రిః ప్రశ్నాధ్యాయోక్తములుగ భుక్త కాలము నెత్తగావచ్చిన మకరలగ్నమునందలి భుక్త ఘటికలు, 188 తాత్కాలిక సాయన చంద్రః 10-1-9-58 భోగ్య భాగాది 28-50-7, దీనిని బట్టి మీదిక్రమములుగనే గణింపగావచ్చిన కుంభలగ్నమునందలి భోగ్యకాలము 266 ఈ భుక్త భోగ్యకాలముల రెంటినీ జేర్చినయిన దానిలో

సాయన గ్రహ సాయన లగ్నములనడుమనుండు మీనాది ధనురంతము వఱలోనగు స్వదేశ రాశిప్రమాణములను వరుసగాచేర్చుకొని మానమెత్తగా నయిన ద్యుగత ఘటికాది 57-43, ఇది చంద్రునియొక్క నపర రాత్రిలో చేరియుండుటచే దీనినతని నహోరాత్రిప్రమాణములో తీసివేయగా నిలిచిన నతని రాత్రి శేషము 4-44 ఇందతని దినార్ధను చేర్చగానయిన ప్రాఙ్నత ఘటికాది * 19-33,, యుగ్మపద దక్షిణ శరము 38-4-లను స్వదేశ విషువచ్ఛాయచే పెంచివచ్చిన 102-8-లను 12-ట భాగింపగావచ్చిన కలాదిఫలము 8-31 దీనిని నతమగు 19-33 చేత గుణింపగావచ్చిన దానిని చంద్రి దినార్ధమగు 14-49-లచే భాగింపగావచ్చిన అక్షదృక్కర్మఫలకలాది 1-14 దీనిని ప్రాఙ్నతమునందలి దక్షిణ విక్షేపమగుటచే తాత్కాలిక చంద్రి స్ఫుటమగు 9-9-38-9-లలో చేర్చగానయిన అక్షదృక్కర్మఫల సంస్కృత చంద్రః 9-9-49-23 (అయన దృక్కర్మము) దీనిలో నయనాంశములునూ 3 రాసులునూ చేర్చుకొనగానయిన సత్రి భస్సాయన చంద్రః 1-1-21-7 ఇదే భుజా, దీనికినుత్క్రమ జీవనియ్యగా నయిన భుజోత్క్రమ జ్యా 632-54 దీనిని పరమాపక్రమ జ్యాయగు 1397-జే పెంచి త్రిజ్యచే భాగింపగావచ్చిన క్రాంతి జ్యా ఫలకలాది 204-20 ఇదే ధనువగును గనుక ఓజపదోత్తర సత్రి భస్సాయన చంద్రిక్రాంతిః 204-20 దీని భాగాదియగు 3-24.20-లచే తత్కాల దక్షిణ విక్షేపభాగాదులగు 0-38,4-లను నవప్రితిగా గుణింపగావచ్చిన నంశాదిరూపమగు అయన దృక్కర్మఫలకలాది 2.10 దీనిని క్రాంతి విక్షేపములు రెండునూ భిన్నదిక్కులుగనుండుటచే అక్షదృక్కర్మఫల సంస్కృత చంద్రిస్ఫుటములో చేర్చగానయిన నయనదృక్కర్మఫల సంస్కృత స్ఫుట చంద్రః 9.9-51-33 ఇందు నారురాసులతో గలసియుండు తాత్కాలిక సూర్య స్ఫుటముకంటెను కలాది 13-24 మించియుండుటచే యోగకాలము గతించెనని తెలసి గతఫలమునెత్తగావచ్చిన 1-0 ఘటికాదిని 29-20-లలో తీసివేయగా నయిన నుదయాది కాలము 28-20 ఈ కాలమునకు మరల రవి చంద్రిస్ఫుటములను తాత్కాలింమకొని మీాక్రిపములుగనే దృక్కర్మద్వయఫలములను దెచ్చి సంస్కరించి సపడ్భాగునితో చంద్రిస్ఫుటమును సరిపోల్చుకొనిన నదియేస్థిరీకృత చంద్రగ్రహణమునకు మధ్యకాలమగునవగా దృక్సిద్ధ పర్వాంతకాలమగును.

---

* గ్రంథాంత చక్రము క్రింది * నోటునుజూడుము.



*N. B.* ఈ గ్రస్తోదయ చంద్ర గ్రహణ మసంధిర్గతమగుటచే నందులను గూర్చి నీ మీాది విశేషక్రమములచే గణితప్రయాసనందవలసినపని నవసరమయి యుండినను గణితోతాహరణార్థముగ గొంతవఱకు నుదహరింపబడియె. అందు చంద్రగ్రహణాధ్యాయోక్త విక్షేపము నే తత్తత్కాలిక విక్షేపములుగనంగీకరించి నుదహరింపబడియుండినను తత్తత్కాలములకు నీ వెనుకటివలెనే క్రమముగ విక్షేపములను తెచ్చికుంమకొనియుండవలసినదని తెలియవలెను. మరియూ సూర్యగ్రహణానయనమందలి తిథ్యంతమును మధ్యలంబన సంస్కారాదులతో కలసి వచ్చు నీ దృగ్గణిత విధులచేతనే సాధింపవచ్చును. అందు మధ్యలంబన సంస్కారమక్కర లేదనియూ, స్ఫుటాధ్యాయోక్త తిథ్యంతమునకునూ నిందుజెప్పబడియుండు దృగ్గణిత తిథ్యంతమునకునూ నడుమనుండునంతరాళమే మధ్యలంబనమగుననియూ నిండానుభవముచే కనుగొనవచ్చును.

## గ్రహాదిగాంతర సాధనము.

తా ॥ అక్షాయన దృక్కర్మములచే సంస్కరింపబడియుండు సమకలా గ్రహముల రెంటికినీ నీ మీాద జెప్పబడియుండు క్రమములుగనే పాతోన కేంద్రములనుండియు విక్షేపలిప్తలను దెచ్చిజూడగా నారెండు విక్షేపములునూ ఏక దిక్కును బొందియుండునపుడధికములో నల్పమును దీసివేసినంతరింపగనూ భిన్న దిక్కులను బొందియుండునపుడవి రెంటినీచేర్చగనూ గ్రహాంతర లిప్తాదియగును మఱియూ నారెండు విక్షేపములునూ భిన్నదిక్కులను పొందియుండునపుడాయా విక్షేపముగల గ్రహమాయా దిక్కుననేనుండుననియూ, ఏక దిక్కును పొంది యుండునపుడంపధిక విక్షేపముగలగ్రహమదే దిక్కుననూ, నల్పవిక్షేపముగల గ్రహమా దిక్కునకెదుటి దిక్కుననూ బొందియుండుననియూ తెలసి గ్రహసమాగమాదు యందలి దిగాంతరములను నిర్ణయింపవలసినది.

## కుజాదులకు బింబ సాధనము.

తా॥ కుజునికి 206280, బుధునికి 309420, గురునకు 360990, శుక్రునకు 412560, శనికి 257850, బింబసాధన ధృవకలిప్తలగును,, కుజాదుల స్ఫుటకర్మము నందలి తృతీయ్య మందకేంద్రమును బట్టి శీఘ్రఫలసాధన క్రమమునందు జెప్పియుండు విధముగనే వరుసగా భుజమీాదకోటిని దెచ్చి వానినుండియూ క్రమముగ

భుజ జ్యా ఫలకోటి జ్యా ఫల శుద్ధకోటి (చల) కర్ణములను మాత్రము తెచ్చినుంచు కొనియుండి తృతీయ్యచతుర్థ చలకర్ణముల మొత్తమును 15-ట గుణింపగావచ్చు లిప్తాదిఫలముచే నీ మీదజూపియుండు నాయాగ్రహ బింబసాధన ధ్రువలిప్తలను భాగింపగావచ్చు కలాదిఫలమే నాయాగ్రహములకు బింబప్రమాణ లిప్తలగును.

*N. B.* యుద్ధ్యగ్రహముల రెంటికినీ నీ మీదజెప్పబడియుండు క్రమములచే గ్రహాంతరమును దెచ్చి దానిని చంద్ర శరముగనూ, వారిరువురి బింబాంతరమును బింబయోగార్ధముగనూ, వారిద్దరునూ ఏకాగ్నిక్రమములలో నేదైననొకజాతిగతిని బొందియుండునపుడు వారి స్ఫుటగత్యంతరమును వ్యర్కేందుగతిగనూ, వారిలోనొకనికి మాత్రము వక్రగతిగలిగియుండునపుడు వారిద్దరిగతి స్ఫుట మొత్తమును రవి చంద్రగత్యంతరముగనూ తెలసి చంద్రఖండ గ్రహణానయమును జేయువెనుకటి క్రమములుగనే కుజాదులకు నక్షత్రగ్రహణములను తెలియవచ్చును. అందు వారిరువురి బింబాంతరార్ధమును బట్టి వెనుకటిక్రమములుగనే గణించి పూర్ణగ్రహణములనైతమనూహించుటయేగాక మధ్య స్థిత్యర్ధాదులనే స్పర్శమోక్ష దళములుగ తెలియవలసినది.

మఱియూ కుజాదిగ్రహణములయందలి యుద్ధ్యగ్రహముల రెంటియందునూ సూర్యుడుజేరకుండునపుడనగా గ్రహసమ సూత్రస్థితసంచార కాలము రాత్రిలోనయిన కనుబడుననియూ పగటిలోనయిన కానరాదనియూ తెలియవలసినది అందు యుద్ధ్యగ్రహములలోనొకటిమార్తాండగ్రహమై గ్రహణయుక్తమయ్యేనేని (గాఢాస్తమానము నందలి సమ సూత్రస్థితసంచార కాలము) పగటిలో సూర్య బింబమునందు నల్లచుక్కగుపడునని కొందరుజెప్పెదరు అట్టివారిమతముగనే సమాగమగ్రహణమునందు సైతము చంద్రబింబమధ్యమునకు సమ సూత్రస్థితసంచారగ్రహము యొక్క ఛాయారూపమగు నల్లచుక్కను చంద్రబింబమునజూడవచ్చునని యోచింపదారిగలిగెను. (ఈ విషయములకునిండా గణితపరిశ్రమముకావలెను.)

## జయాపజయ నిర్ణయము.

తా॥ ఉత్తర దిక్కును బొందియుండినను, లేకనధిక బింబముగలిగియుండినను నాగ్రహమును జయశాలిగనూ దక్షిణ దిక్కును బొందియుండినను, లేకనల్పబింబముగలిగియుండినను, నా గ్రహమును అపజయశాలిగనూ, తెలియవలసినది. అందు వారిరువురికినీ జయాపజయములలో నేదైన నొకటి సామ్యమును బొందియుండునపుడు జయమయిన నిరువురునూ జయించినట్లునూ, అపజయమయిన నిరువురునూ సోలిపోయినట్లునూ తెలియవలెను, కొందరు దీనిని సైతము సమాగమమని వాడెదరు.



గ్రహయుద్ధమనగా,, సౌరోపనిషత్,, అక్షాద్యాశ్చాక్షికర్మా ద్విపహయతదిదం బాణమస్త్రంత్రిభజ్యా। జ్యా ఘ్నోపాకర్ణచాపం ప్రథితగతిరథం బీజసైన్యాధినాథం॥

భాస్వత్వాత ధ్వజాఖ్యం ద్యుగతనభటం బింబ కుంభ ప్రభావం।
యుద్ధంసన్నద్ధకాలే భవతినభసితౌలాగ్రహోగ్రగ్రహాణాం॥ ఇతివర్ణనం॥

# ఇతి సూర్య సిద్ధాన్తసంగ్రహే ఖగోళవైచిత్ర్య విషయే గ్రహయుద్ధ నిర్ణయాధికారః

## అథ దృక్సిద్ధాన్త రత్నాకరసంగ్రహః.

తొలిపలుకు,, సృష్ట్యాదికాలమునుండియు నివతలికి అనేక మహాయుగములే చెల్లిపోయినందున గ్రహ నిర్ణయ స్థానములలోనగునవి గొంతమాత్రము భేదపడి భాగాది వైషమ్యములతో గ్రహదృగ్గోచరములగును గనుకనే సూర్య సిద్ధాన్తాదుల యందు దృక్సంస్కారమును బీజసంస్కారమొకటిని భాష్యకాలరులు వెలిబెట్టిరి. అందదియునూ కాలమునకుదగినట్లు వివిధములతో నొప్పుచుండునసుటకునూ।

ఏవం కియత్యపికాలే జాతేర్వసిష్టాదిభిర్విలోక్యమానేసతి గతేరంతరందృష్టం। ఏవమన్యైరపి ఆర్యభట్ట బ్రహ్మగుప్త భాస్కరాద్యైస్తయోః యుక్త్యాగతయోభిన్నా దృష్టాస్తేభ్యో భగణా అపిసాధితాస్తే యథా-యద్యేకదినే నైతావతీ గతిస్తదాకల్పాదినైకిమితి అనుపాతః। ఏవం సిద్ధాన్తేగ్రహ భగణాః భిన్నాభిన్నాః పాఠపఠితాస్తే తత్కాలమేవ ఘటంతేస్మ। ఇదానీంమహదంతరితా దృశ్యంతేత్యాది కించ, కలికాలబంధప్రకరణే। నళికాద్యంత్రైరేవం బీజంజ్ఞాత్వాసుదైవజ్ఞైః। తత్సం

స్ఫుటగ్రహేభ్యః స్థితినిర్ణయా దేశాః ॥ ఆయుర్దాయః ఖేచరాణాంబలాదిరాజ్ఞాం యాత్రా యుద్ధధర్మాదిచింతాః । ఖేటస్థానాజ్ఞాన సిద్ధ్యర్థభావార్ణజ్ఞాయంతే సూరిభిస్తత్ఫలాని ॥ అన్యచ్చ । వ్యవహారం జ్యోతిషంచ భేషజః కర్మకారకః । ఇత్థం శాస్త్రంవినాకుర్యాత్తమాహుః బ్రహ్మఘాతుకః ॥

ఈలాటి వచనములింకనూగలవు, అందు యుగానాంపరివర్తవకాల భేదోత్ర కేవల,, మనునట్లు ప్రాచీన సిద్ధాన్తమునకు కలుగబోవు న్యూనాతిరిక్తములను సిద్ధాన్తశాస్త్రాధారములనుండియే సరిపఱచుకొని సిద్ధాన్తమును స్థిరీకరించుకొనుటయే (ప్రాచీన సిద్ధాన్తములను సమగ్రముగ గమనించుటయే) దృగ్గణితమనియూ, గ్రహణాది ప్రక్రియలకుపయుక్తమగు ప్రత్యక్ష గణితమనియూ, నీ మొదలుగా తెలియవలసినది. అట్లుకాని చో ప్రత్యక్షమునకగో చరమగు శాస్త్రమునక సిద్ధాన్తమను పేరు దప్పననన్యమగు సిద్ధాన్త,, మను పేరు చెల్లగలదా ; కొంత యోచింపవలెను. సిద్ధాన్తము, ని-సమా సిద్ధాన్తరాద్ధాన్తావిత్యమరః । వ్యా-సిద్ధోరాద్ధః అంతోనిశ్చయో నేనేతి సిద్ధాన్తోరాద్ధాన్తశ్చ ॥ సత్యమగు నిజమొకటి, స్థిరమగునిజమింకొకటి, శాశ్వితమగు నిజము మరియొకటి, నిశ్చయమైన నిజము వేరు అబద్ధములేనిదియవు రూపము, ఈ మొదలుగా భ్రమించుటకంటెను అన్యతమునుండియు శోధింపబడిన శేషమొకటియే నిజమని తెలిసి అందకస్మాత్కలుగబోవు దోషములను శోధించుకొని నిజమొకటినే స్థిరీకరించుకొనుట యుక్తముగనుండదా.

మఱియూ కాలమునిండి చెడిన ఘంటాయంత్ర మొకటిని రిపేరుజేయించి నుపయోగించినంత మాత్రమునకే యంత్ర నిర్మాణకర్తకంటెను రిపేరుకర్తయే శ్లాఘ్యపరుడగునా ; యంత్రోత్పత్తికి పూర్వము రిపేరుకర్త యెందుండెను, అతనికి యంత్ర స్థోపకరణ సామగ్ర్యలయొక్క పొందుబాటు నేర్పినవా రెవరు, లేక రిపేరు కర్తయొక్కనుపదేశమునుండియే నిర్మాణకర్తకు తగిన శక్తి కలిగెనా ; అను వానిని గొంతనాలోచించి చూచిన నెట్టివారికైననూ తెలియకపోదుకదా.

గనుక ప్రాచీన సిద్ధాన్త గణితక్రమములయందు తేలి శాస్త్రముయొక్క వాస్తవ్యతనుగ్రహించి మూలమెరిగి కాలోచితమునకు తగినట్లు అందలిక్రమములనుపయోగించుకొనక , జెట్టెక్కినమీద బుడమ పొర్లించునట్లు మాతృభూతమగు వెనుకటి శాస్త్రములను దూష్కించుటయుక్తముగాదనుతలంపుతో నీ గ్రంథమునంది దివఱకు



జెప్పబడియుండు గ్రహగణితములలోనగు విషయములను సిద్ధాన్త పారిజాత ” మను ప్రాచీన శ్రీతాళపత్రముద్రిత గ్రంథమునుండియు సంగ్రహింపబడియుండుటచే అందలి క్రమములలో మతాంతరాభిః ప్రాయములను జూపక గణిత విధులు జక్కబడి సిద్ధాన్త గణితప్రక్రియలలో దేలునట్లు మూల తాత్పర్యముల నే సవర్ణింపులతో విస్తారముగనుదహరింపబడియె.

అందా గ్రంథారంభమునుండియు నీ గ్రంథారంభమునకనేక సహస్రాబ్దములే గతించి పోయినందున యథా దృక్తుల్యతాం గ్రహాః, అనునట్లు * కలౌపంచసహస్రాబ్దాగత సంస్కార విశేషక్రమములతోనిక్కాలమునకు సరిపచ్చు శ్రీ సూర్య' దేవయజ్వవ్యాఖ్యాన యుక్తంబగు సిద్ధాన్తరత్నాకరోక్త గ్రహతంత్రమును సవర్ణింపులతో శుద్ధముగ నీ క్రిందుదహరింపబడును.

(సి. ర. అ 2-శ్లో 20....25) ఖఖఖేషూనిత కలిగతసంఘాద్దిన గణభక్తం ఫలకలివర్గం । దినగతివర్గాచ్చలహతమూలం గ్రహగతి లిప్తాద్యాభజితఫలితేత్యాది ర్ధళాయుత కలియాతాంతదృక్స్వోత్రోక్త ప్రకారేణ అస్యగ్రంథోత్పత్తి కాలస్యగ్రహ పూర్వధ్రువక రాశ్యాదయః, (39-వ పేజిచూడుము.)

---

*కలౌపాపిని సంప్రాప్తేధర్మహ్రాసోభవిష్యతి । యాతేత్వబ్దసహస్రాణాం పంచకేపాపినోజనాః ॥ చండాలాః ప్రమరం యాంతి యాంతి బ్రహ్మద్విషోబలం బుద్ధిభ్రంశో ద్విజాతీనాం విద్యాకర్మాది సంక్షయః ॥ శాస్త్రన్యాయార్థవాదశ్చశిష్టాచార వినాశనం । దుర్భిక్షమష్యనావృష్టిః బహులోత్పాతదర్శనం ॥ *సూర్యాదిగ్రహగోళానాం గతివైషమ్య సంభవః । గంగామాహాత్మ్యహానిశ్చ శూద్రోపనయనాదికం॥ కుండగోళక సంతానం మద్యమాంస పరిగ్రహః । ఆచార్యగురుధిక్కారః ప్రాణోహిత విసర్జనం ॥ పరనిందా పరస్వత్వం పరదారపరిగ్రహః । స్త్రీణాంపునర్వివాహశ్చ శూద్రసన్యాసలక్షణం ॥ దేవతా మహిమాలోపే వేదాధ్యయన వర్జనం । వ్యర్థతాంమంత్ర తంత్రాణాం మతవాదదురాగ్రహః ॥ సముద్రయానం విప్రాణాం భవిష్యతి కలౌయుగే । ద్వేషంతిపితరంపుత్రా గురు శిష్యాస్తథైవచ ॥ పతించవనితాద్వేష్టి కృష్ణే కృష్ణత్వమాగతే । శూద్రాన్న భోగనిరతా భవిష్యంతి కలౌద్విజాః ॥ బ్రహ్మణాద్యాస్తథావర్ణాస్సంకీర్యంతే పరస్పరం ॥ వ్యాధధర్మరతాస్సర్వే దంభాచారపరాయణాః ॥ అతస్వల్పాయుపాస్సర్వే కలిదోషాద్భవిష్యతి———॥

రవికి, 10-29-2, బుధకేం, 6-15-8, శనికి, 10-4-2,
చంద్రునికి, 10-20-50, గురునకు, 5-23-40, తుంగకు 2-22-20,
కుజునికి 11-7-26, శుక్రకేం, 6-24-48, పాతకు, 2-5-20,

ఈ గ్రంథమునందలి 39-వ పేజీలోగల గ్రహపూర్వ ధృవకములకుమారుగా నీ మీదజూపియుండు ధృవకములనుపయోగించుకొని వెనుకటిక్రమములుగనే స్ఫుటీకరింపగా నిక్కాలమునకు బుధుడుదప్ప తక్కినగ్రహములన్నియునూ దృక్సిద్ధ స్ఫుటములగును-అందు బుధ స్ఫుటము జేయునపుడు మాత్రము రెండు భాగలచే తగ్గింపబడిన మధ్యమరవిని మధ్య బుధునిగ తెలిసి నీ మీదజూపియుండు బుధకేంద్ర ధృవకమునుండియు వెనుకటిక్రమములుగనే స్ఫుటీకరింపగా బుధస్ఫుటము దృక్సామ్యమగును ఈ అర్థమును గూర్చినూ, శీతాంశునూను స్ఫుట వీక్ష్యకాలే భాగద్వయం శోధ్యది వాకరేణ। ద్రాక్కేంద్రసంపాద్యఫలంప్రశస్తంప్రాగుక్తసర్వంరవిమధ్యయేచ॥సి-ర॥

*N. B*:-గ్రహణ గ్రహయుద్ధ సమాగమ తాత్కాలకీకరణ లగ్నస్ఫుటాదులే మొదలయిన వానినంతయూ దెచ్చుకొనుటయందెట్టి భేదములునూ లేవు-గనుకవానినంతయూ నీ మీద జెప్పబడియుండు క్రమములచే సాధింపబడిన దృక్ స్ఫుట గ్రహములనుండియు వెనుకటివలెనే క్రమముగ దెచ్చుకొనవలసినదని తెలియవలెను. అందు సూర్య సిద్ధాన్తోక్తక్రమముగ గ్రహస్ఫుటములనెత్తవలసినపుడు తత్సంప్రదాయికముగ సాధింపబడిన శుద్ధ మధ్య గ్రహాదులయందలి మధ్య రవిలో 5-లిప్తలున్నూ, బుధ శీఘ్రములో 60-లిప్తలున్నూ మధ్య శనిలో 157-లిప్తలున్నూ, పాతలో 11 లిప్తలున్నూ చేర్చి మధ్య చంద్రునిలో 4-లిప్తలున్నూ, మధ్య కుజునిలో రెండు లిప్తలున్నూ, మధ్య గురునిలో 39-లిప్తలున్నూ, శుక్ర శీఘ్రములో 5-లిప్తలున్నూ, తుంగములో 14-లిప్తలున్నూ, తీసివేయగానను పూర్వోక్తమగు రత్నాకరోక్త మధ్య గ్రహాదులనుబట్టి బుధ స్ఫుటమునందు మాత్రము రెండుభాగలచే తగ్గింపబడిన మధ్యమరవిని బుధ మధ్యగ్రహముగ నెరిగి వెనుకటివలెనే జ్యా-ధనుర్గణితాదులచే క్రమముగ స్ఫుటీకరింపగా నిక్కాలమునకు సరియగు దృగ్గణిత గ్రహములను. ఈ గ్రహములనుండియూ నక్షత్ర గ్రహణములు సైతము దృక్సామ్యము వచ్చినది-అందు వైదిక కర్మానుష్ఠానములకుప యుక్తమగు తిథ్యాదులను దృగ్గణిత రవి చంద్రులచే తెచ్చుసాంప్రదాయికము శిష్టాచారవిరుద్ధముగుటవలన వానికి వెనుకటి వలెనే నీ సూర్య చంద్రులు పనికి రారని తెలియవలసినది. మఱియూ నీ వెనుకటి



యధ్యాయములలో తేలినవారికిందుదాహరణములచే కావలసినపనియుండనందున తాత్పర్యముల నేమలకనగా బోధయగునట్లువ్రాసి ఉదాహరణ గణితమును జూపబడదయ్యె.

# ఇతి సిద్ధాన్తరహస్యే దృక్సిద్ధాన్తరత్నాకర తాత్పర్య సంగ్రహః

## అథ ఉపయుక్త విషయాః

రవ్యాది సప్తగ్రహాణాం అహోరాత్రప్రమాణ ఘటికాః,, రవికి=60-10, చంద్రునకు=62-27, కుజునకు=60-7, బుధనకు=60-18, గురునకు=60-0, శుక్రునకు=60-8, శనికి=60-0.

లంకాదినార్ధాః:—రవికి=15-2, చంద్రునకు=15-37, కుజునకు=15-2, బుధునకు=15-5, గురునకు=15-0, శుక్రునకు=15-2, శనికి=15-0.

గమనింపు:—సాయనార్కునిచే రవి దినార్ధములలోనగువానిని గణించి తెచ్చియుండు స్ఫుటాధ్యాయోక్తక్రమములుగనే చంద్రాదిషడ్గ్రహములకునూ సాయాసాయనగ్రహ భుజలనుబట్టి స్వదేశ చరఖండములచే చరార్ధఫలము దెచ్చి వచ్చిన దాని నీ మీద కురుపఱచియుండు వారివారి లంకాదినార్ధములలో సంస్కరించిక్రమముగ నహర్దళములలోనగు వానిని తెచ్చుకొనవలయును.

ఉదా:—సాయన చంద్రః 10-1-9-5-3, తద్భుజా 1-28-50-7, దీనినినిబట్టి స్వదేశ చరఖండములచే సాధింపగా వచ్చిన చరార్ధఫల వినాడికలగు 48-ను లంకా చంద్రదినార్ధలో సంస్కరింపగానయిన చంద్రాహర్దళము 14.49 దీనిని రెట్టింపగా నైననతని అహస్సు 29-38 దీని నతనహోరాత్రములో తీసివేయగా నిలిచిన రాత్రిః 32-49 దీని దళము 16-25 ఇదే చంద్ర రాత్ర్యర్ధమగును, ఈ క్రమములుగనే తక్కిన గ్రహములకునూ తెలియవలసినది. అందు సాయాసాయనగ్రహ భుజాంశములనుబట్టి వెనుకటివలెనే దినగతి పదకములనుండియు చరార్ధలిప్తలను తెచ్చుకొనగా వచియే సాయాగ్రహములకు స్వదేశ చరార్ధఫల వినాడికలగునని తెలియవలసినది.

## ఉత్క్రమజీవలు.

| | | |
|---|---|---|
| 1=7 అ 22 | 9=579 అ 131 | 17=1918 అ 205 |
| 2=29 అ 37 | 10=710 అ 143 | 18=2123 అ 210 |
| 3=66 అ 51 | 11=853 అ 154 | 19=2333 అ 215 |
| 4=117 అ 65 | 12=1007 అ 164 | 20=2548 అ 219 |
| 5=182 అ 79 | 13=1171 అ 174 | 21=2767 అ 222 |
| 6=261 అ 93 | 14=1345 అ 183 | 22=2989 అ 224 |
| 7=354 అ 106 | 15=1528 అ 191 | 23=3213 అ 225 |
| 8=460 అ 119 | 16=1719 అ 199 | 24=3438 అ 0 |

గమనింపు :—క్రమజీవలనిచ్చు విధముగనే నీ వ్యుత్క్రమ జీవలను సైతము సాధింపవలసినది. అందు క్రమజ్యా సాధనములో జీవనియ్యవలసిన లిప్తలు 225-లకు తగ్గియుండునపుడదియే జ్యా యగునని జెప్పబడియున్నది-ఇందు 225 లిప్తలకు తగ్గియుండునపుడా జీవనియ్యవలసిన లిప్తలను 7-ట పెంచి 225-ట భాగింపగావచ్చు లిప్తాదిఫలమే నుత్క్రమజ్యాయగును, ఇదొకటిదప్ప తక్కిన గణిత విధిక్రమములలోనెట్టి భేదమునూ లేదు.

ఉదా :—సత్రిభస్వాయన చంద్ర భుజను లిప్తాదిజేయగానైన 1881-7-లను 225-ట భాగింపగావచ్చిన నుత్క్రమజీవ సంఖ్య 8-ది 460 అ 119 ఈ అంతర లిప్తలచే శేషకలాదియగు 81-7-లను గుణించి 225-ట భాగింపగావచ్చిన జీవాంతర ఫలకలాదియగు 42-54-లను జీవలిప్తలలో చేర్చగానైన భుజోత్క్రమ జ్యా కలాది 502-54.

*N. B:*—గ్రహమంద శీఘ్రఫలానయనములయందుగానీ లేక ధనుర్గణితాదులయందుగానీ నీ నుత్క్రమ జీవలనుపయోగింపగూడదు.

## ధూమాద్యష్టోపగ్రహములు (జాతకాద్యుపయుక్తం.)

తా॥ సూర్య స్ఫుటమునకు 4-13-0-0-లను చేర్చగా ధూమగ్రహమగును ధూమగ్రహమును 12-రాసులలో తీసివేయగా పాతగ్రహమునూ, పాతగ్రములకారురాసులు జేర్చగా(పరిధి)పరివేషగ్రహమునూ, ధూమగ్రహమునకారురాసులు చేర్చి లేక పరివేష



గ్రహమును 12-రాసులలో తీసివేయగా(ధనుః) ఇంద్రచాపగ్రహమునూ, దానిలో 17 భాగలు కలుపగానగ్నియను శిఖిగ్రహమునూ, స్ఫుటరవిని వరుసగా 3 ప్రతులుంచి అందు క్రమముగ 8-1-2-11, 3-1-8-0, 3-4-5-6 రాశ్యాది ధ్రువకములను చేర్చుకొనగా వరుసగా గుళిక, యమకంటక. అర్ధప్రహర, గ్రహస్ఫుటములునూయగునని తెలియవలసినది, ఉదా, స్పష్టం.

## పంచాంగముమీాద గ్రహస్ఫుటములెత్తుట.

సూ॥ ఎపుడే గ్రహస్ఫుటమునెత్తవలయునో నపుడాగ్రహమే నక్షత్రమునందెన్నవ పాదమునందుండునో దానిని మొదటచూచుకొని ఆ గ్రహమానక్షత్రపాదమునకు వచ్చినది మొదలు ముందుపాదమునకు బోవువఱిలోనగు దినాదికాలమును విఘడియలుజేయగావచ్చు హారకముచే జ్ఞాతాజ్ఞానరస భాజ్య సంఖ్యా ధ్రువకమగు 720000 ను భాగింపగావచ్చు లిప్తాదిఫలమే నప్పటికాగ్రహముయొక్క స్ఫుట చారగతి యగును. దానిచే వర్తమానపాదప్రవేశము మొదలు నిష్టకాలమువఱిలోనగు ఘటికాదిని చతుష్షష్టిగా గుణించివచ్చిన మొత్తము నరువదిచే భాగింపగావచ్చు కలాదిఫలము వర్తమాన పాదమునందలి గతలిప్తలగును గనుక దానిని వర్తమాన నక్షత్ర పాదమునకు వెనుకటి పాదాంతమువఱిలో నశ్విన్యాదిగనెన్ని నక్షత్ర పాదములు గతించియున్నవో నా పాదముల సంఖ్యను 200-ట గుణింపగావచ్చు లిప్తలలో చేర్చగా నిష్టకాలమునకు నిష్టగ్రహముయొక్క స్ఫుట లిప్తలగును గనుక దానిని తత్తన్మానములనెత్తి రాశ్యాదిగ జేసుకొనగానదియే స్ఫుటగ్రహమగును.

గమనింపు:—వక్రగతిగల గ్రహమును స్ఫుటీకరించునపుడీ మీాదిక్రమములుగనే గణింపగావచ్చు వర్తమాన పాదమందలి వక్రగతలిప్తలను నశ్విన్యాదిగ వర్తమాన నక్షత్ర పాదాన్తమువఱలో పాదమొకటికి 200-లిప్తలవంతున గణించి తెచ్చియుండు ఫలములో తీసివేసి వెనుకటివలెనే రాశ్యాది స్ఫుటమును తెచ్చుకొనవలసినది. అందు చంద్రునికి మాత్రము-ఇష్టకాలమునకగు వర్తమాన నక్షత్రమునందలి గతఘటికాదిని 13-20-లచే చతుష్షష్టిగా గుణించివచ్చిన మొత్తమును ఆనక్షత్రాద్యంతముచే విభజింపగావచ్చు భాగాదిఫలమును నక్షత్రమొకటికి భాగాది 13-20లవంతున నశ్విన్యాదిగత నక్షత్రముల కేర్పడు భాగాదిఫలములో కలుపగా భాగాదిగ చంద్రస్ఫుటమగును, ఈ క్రమములచే నాయాకాలములకు పంచాంగము మీాద సులభముతో రవ్యాది గ్రహస్ఫుటములనెత్తవచ్చును ఉదా-స్పష్టం.

రాశ్యాది,స్ఫుటమును 60 ఘడియలపరిమాణముగల నక్షత్రాదిగ మార్చుట:- సూ॥ రాశ్యాది స్ఫుటమును భాగాదిగజేసినయిన దానిని 3-ట గుణించి 40-ట భాగింపగావచ్చు భాగాదిఫలమే నక్షత్రాత్మకమగును, అయు నక్షత్రాత్మకమును ఘటికాదిగజేసినయిన దానిని ద్విఘ్నించి ౬-ట విభజింపగా నక్షత్రాత్మకమువిడిచి భాగాది స్ఫుటమేర్పడునని తెలియవలసినది. అందు నక్షత్రమొకటికి 60_ఘడియల పరిమాణమగునని తెలసి ఇష్టమగు స్ఫుటమును మీదిరెండు విధుల చేతనూ గణించి ఫల సామ్యమును పొందించి జూడవలసినది, ఉదా:-స్పష్టం.

మానసిక జీవలు 18.

| | | |
|---|---|---|
| 1=43 అ 42 | 7=279 అ 33 | 13=446 అ 15 |
| 2=85 అ 41 | 8=312 అ 31 | 14=461 అ 12 |
| 3=126 అ 40 | 9=343 అ 30 | 15=473 అ 8 |
| 4=166 అ 39 | 10=373 అ 28 | 16=481 అ 5 |
| 5=205 అ 39 | 11=401 అ 26 | 17=486 అ 2 |
| 6=244 అ 35 | 12=427 అ 19 | 18=488 అ 0 |

జ్యా, సాధనక్రమము:—భుజాకోట్లలో దేనికిగానీ జీవనియ్యవలసినపుడా జీవనియ్యవలసిన దానిని భాగాదిగజేసి భాగస్థాన స్థితసంఖ్యను 5-ట భాగింపగా వచ్చు లబ్ధము జ్యా సంఖ్యయగును. శేషభాగాదిని ఆజీవాంతరముచే హెంచివచ్చిన భాగాదికమును మఱలనయిదింట విభజింపగావచ్చు కలాదిఫలమును జ్యా లిప్తలలో చేర్చుకొనగానది భుజ లేక కోటికి జ్యా లిప్తలగును.

మానసిక సూర్యస్ఫుటము:—చరార్ధఫల సంస్కారమును జేసియుండు స్వదేశీయ్య ప్రాతఃకాలిక మధ్యగ్రహములయందలిమధ్యరవినితని మందోచ్చములో తీసివేసి వెనుకటి క్రమములగనే భుజాకోట్లనుదెచ్చి జ్యాలను సాధింపగానవి భుజజ్యా కోటిజ్యా లిప్తలగును:- అందలి కోటిజ్యా లిప్తలను భాగాదిగజేసి సర్ధింపగానగు ఫలమును రవిమందకేంద్రము కటకాదిలోనుండునపుడతని మధ్యా హారకమగు 224-0 లలో తీసివేయగనూ, మకరాదిలోనుండునపుడు చేర్చగనూ, స్ఫుట హారకమగును. దానిచే మీది భుజజ్యా లిప్తలను విభజింపగావచ్చు భాగాది మందఫలమును మధ్యరవియందు వెనుకటిక్రమములగనే సంస్కరింపగా మంద స్ఫుట రవియగును.



ఉదా :-రవిమందోచ్చ 2-17-20 మధ్యమరవిః 3-10-1-20 మందకేంద్రము 11-7-18-40 భుజా 0-22-41-20 దీని భాగాదిజేయగా 22-41-20 ఇందలి భాగలనయిదింట విభజింపగావచ్చిన మానస జీవ సంఖ్య 4 శేషభాగాది 2-41-20 దీనిని 4-వ జ్యాంతరమగు 39-చే గుణించి 5-ట భాగింపగావచ్చిన కలాదియగు 20-58-లను 4-వ జ్యా లిప్తలలో చేర్చగానైన భుజ జ్యా కలాది 186-58, అదే విధముగ కోటిని భాగాదిజేసి 5-ట భాగింపగావచ్చిన జీవ సంఖ్య 13 శేషభాగాది 2-18-40 దీనిని 13-వ జ్యాంతరమగు 5-ట హెంచి 5-ట భాగింపగావచ్చిన కలాదిఫలమును 13-వ జ్యా లిప్తలలో కలుపగానైన కోటి జ్యా కలాది 452-6 దీని భాగాది 7-32-56 దీని దళము 3-46 దీనిని మకరాది కేంద్రమగుటచే 224-0 లలో జేర్చగానయిన స్ఫుట హారకము 227-46 దీనిచే భుజ జ్యా లిప్తలగు 186.58-లను భాగింపగావచ్చిన రవి మంద భుజాఫల భాగాది 0-49-15 దీనిని మధ్య రవిలో సంస్కరింపగానైన మంద స్ఫుటార్కః, 3-9-12-5,,

చంద్ర స్ఫుటక్రమము :—వెనుకటిక్రమములగనే మధ్య చంద్రునికి రవిభుజా ఫలముయొక్క 27-వ వంతును సంస్కరించి దేశాంతరఫలమును సంస్కరింపగా శుద్ధ మధ్య చంద్రుడగును వానినతని తుంగములో తీసివేయగా నిలుచు మందకేంద్రమునుండియు రవికి జెప్పియుండుక్రమములగనే భుజజ్యా కోటి జ్యాలనుదెచ్చి కోటి జ్యాంశదళమును వెనుకటివలెనే కటకాది మకరాది కేంద్రములనుబట్టి చంద్రమధ్యాహారకమగు 97-0-లలో సంస్కరింపగానది స్ఫుట హారకమగును, దానిచే భుజజ్యా కలలను భాగింపగావచ్చు మందఫల భాగాదికమును వెనుకటిక్రమములగనే మధ్య చంద్రునియందు సంస్కరింపగా మంద స్ఫుట చంద్రుడగును.

ఉదా :—స్వదేశీయప్రాతః కాలికమధ్య చంద్రః 9-3-10-43, దీనిలో వెనుక సూర్య స్ఫుటమునందొచ్చియుండిన ఋణభుజాఫలముయొక్క 27-వ వంతును సంస్కరించి దేశాంతరఫల సంస్కారమును సంస్కరింపగానైన శుద్ధ మధ్య చంద్రుడు 9-3-0-54, తుంగః 3-7-22-50, చంద్రమంద కేంద్రము 6 4-21-56, భుజ జ్యా కలాది 36-41, కోటి జ్యా భాగాది 8-6-15 దీనిలో సగము 4-3 కర్క్యాది కేంద్ర మగుటచే దీనిని 97-0-లలో తీసివేయగానైన చంద్ర స్ఫుట హారకము 92-57 దీనిచే భుజజ్యను భాగింపగావచ్చిన మందఫల భాగాది, 0-23-40 ఫలసంస్కృత మంద స్ఫుట చంద్రః, 9-2-37-14,,

గత్యానయనం :—రవికేంద్రగతి కలాది 59-8, చంద్రకేంద్ర గతికలాది 783-54, వీనిని వారివారి కోటిజ్యా భాగదులచే గుణించివచ్చిన కలాదిఫలమును వారి వారి స్ఫుట హారకములచే భాగింపగావచ్చు లిప్తాదులను వారివారి కేంద్రములనను సరించి, కటకాది ధనము, మకరాది ఋణము, అనువిధిక్రమములచే వారివారి మధ్య గతులలో సంస్కరింపగా మంద స్ఫుటగతులగును.

ఉదా:—59-8 లను సూర్య కోటి జ్యా భాగాదిచే గుణింపగావచ్చిన కలాది ఫలమగు 446-27-లను అతని స్ఫుట హారకముచే భాగింపగావచ్చిన గతిఫలకలాది 1-58 దిని నతనిమంద కేంద్రము మకరాదిలోనుండుటచే మధ్యగతిలో తీసివేయగానైన మంద స్ఫుటగతి కలాది 57-10, ఈ విధముగనే గణింపగా చంద్రునికి 858-58, మంద స్ఫుటగతి కలాదులగును.

చంద్రమసోః పంచసంస్కారవిధిః.

(1) తా॥ సూర్య భుజాఫల విలిప్తలను 520-ట భాగించి తెచ్చిన లిప్తాదిఫలమును రవిభుజాఫలము ధనముగానుండునపుడు మంద స్ఫుట చంద్రునిలో తీసివేయగనూ, ఋణముగానుండునపుడు చేర్చగనూ, ప్రథమ సంస్కార చంద్రుడగును ఈ విరుద్ధఫల సంస్కారఫలమును రవిలో నైతము సంస్కరింపవలసినట్లు వ్యాఖ్యాన కర్తల అభిప్రాయముగలదు.

ఉదా:—రవి ఋణభుజాఫల భాగాది 0-49-15 దీనిని విలిప్తలుజేసి నయిన దానిని 520-ట భాగింపగావచ్చిన కలాదిఫలము 5-41 దీనిని మంద స్ఫుట రవి చంద్రులలో చేర్చగానయిన ప్రథమ సంస్కార రవిః 3-9-17-46, ప్రథమ సంస్కార చంద్రః 9-2-42-55.

(2) తా॥ ప్రథమ సంస్కార చంద్రునియందు పాతను జేర్చగానగు సపాత చంద్రునికి భుజజ్యా కోటిజ్యా భాగాదులనుదెచ్చి వచ్చిన వానిలో నొకదానిని మరి యొకదానిచే (పరస్పరముగ) గుణించి 5-ట భాగింపగావచ్చు కలాదిఫలము సపాత చంద్రుడోజపదములోనుండునపుడు ప్రథమ చంద్రునిలో ఋణమునూ, యుగ్మపద ములోనుండునపుడు ధనమునూ జేసికొనగా ద్వితీయ్య చంద్రుడగును.

ఉదా:—ప్రథమ చంద్రః 9-2-42-55 పాతః 2-12-11-49 సపాత చంద్రః 11-14-54-44, భుజ జ్యా భాగాది 2-6-42 కోటి జ్యాంశాది 7-52-46 అన్యోన్య గుణిత



భాగాది 16-41 దీని నయిదింట భాగింపగావచ్చిన కలాదిఫలమగు 3-20-లను సపాత చంద్రుడు యుగ్మపదమైనందున ప్రథమ చంద్రునిలో చేర్చగానైన ద్వితీయ్య చంద్రః 9-2-46-15,,

(3) తా॥ చంద్రోచ్చమున రవి స్ఫుటమును తీసివేయగా నిలుచు ఇందూచ్చో నార్క కేంద్రమునకు కోటి జ్యా భాగాదులనుదెచ్చి దానిని ద్వితీయ్య చంద్రుని యందు ప్రథమ రవిని తీసివేయగానగువ్యర్కేందువుకు భుజ జ్యాంశములనుదెచ్చి వచ్చిన దానిచే గుణించిన నంశాత్మక లబ్ధమును లిప్తలుజేసి చంద్ర స్ఫుట హారకమును 15-ట పెంచిన మొత్తముచే విభజింపగావచ్చు భాగాదిఫలమును ఇందూ చ్చోనార్క కేంద్రము మకరాదిలోనుండి వ్యర్కేందువు మేషాదిలోనుండునపుడు ద్వితీయ్య చంద్రునిలో ఋణమునూ, తులాదిలోనుండునపుడు ధనమునూ, ఇందూచ్చో నార్క కేంద్రము కటకాదిలోనుండి వ్యర్కేందువు మేషాదిలోనుండునపుడు ధనమునూ, తులాదిలోనుండునపుడు ఋణమునూ జేసికొనగా తృతీయ్య చంద్రుడగును.

ఉదా:—తుంగిలో స్ఫుట రవిని తీసివేయగా నిలిచిన నిందూచ్చోనార్క కేంద్రము, 11-28-5-4, (మకరాది) దీనికోటి జ్యా భాగాది 8-7-14, దీనిని ద్వితీయ్య చంద్రునియందు రవిని తీసివేయగానైన వ్యర్కేందువగు 5-23-28-29-లను బట్టి భుజ జ్యాంశములనెత్తగా వచ్చిన 0-55-49-లచే గుణించివచ్చిన భాగాది 7-34-32 దీని కలాది 454-32 దీనిని చంద్ర స్ఫుట హారకమగు 92-57-లను 15-ట గుణింపగా వచ్చిన మొత్తముచే విభజింపగ వచ్చిన భాగాది 0-19-34, దీనిని నిందూచ్చో నార్క కేంద్రము మకరాదిలోనుండి వ్యర్కేందువు మేషాదియగుటచే ద్వితీయ్య చంద్రునిలో తీసివేయగానైన తృతీయ్య చంద్రః 9-2-26-41.

(4) తా॥ తృతీయ్య చంద్రునిలో ప్రథమ రవిని తీసివేయగానిలుచు వ్యర్కేందువునకు, భుజజ్యా కోటి జ్యాంశములనుదెచ్చి వచ్చినదాని నన్యోన్యముగ గుణింపగా వచ్చు నంశాత్మకమును కలాదిగదెలసి దానిని వ్యర్కేందువు ఓజపదములోనుండు నపుడు తృతీయ్య చంద్రునిలో ధనమునూ, యుగ్మపదములోనుండునపుడు ఋణ మునూ, జేసుకొనగా చతుర్థచంద్రుడగును.

ఉదా:—వ్యర్కేందు రాశ్యాది 5-23-8-55 దీని భుజ జ్యా భాగాది 0-58-33 కోటి జ్యా భాగాది 8-4-9, వీనిరెంటినీ పరస్పరముగ గుణింపగావచ్చిన

సంశాత్మకమగు నర్థోత్తర కలాది 7-56, యుగ్మపదమునందలి వ్యత్యేకుండువగుటచే దీనిని తృతీయ్య చంద్రునిలో తీసివేయగానయిన చతుర్థఫల సంస్కార చంద్రః 9-2-18-45,,

(5) తా॥ సాయనార్కుని భుజజ్య కోటిజ్య భాగాదులను పరస్పరముగ గుణించివచ్చిన దానిని భాగాది 4-4-లచే పెంచివచ్చిన మొత్తమును రవి చంద్ర స్ఫుటగతులచే వేరువేరుగా గుణించివచ్చిన దానిని 21600-చే భాగింపగావచ్చు కలాది ఫలములను సాయనార్కుడోజ పదమునందుండునపుడాయా గ్రహములలో తీసివేయ గనూ, యుగ్మపదమునందుండునపుడు జేర్చగనూ పంచ సంస్కారకృతమగు దృక్సిద్ధ స్ఫుటములగును. (ఈ ఫలసంస్కారమును ప్రథమ రవికినీ చతుర్థ చంద్రునికినీ సంస్కరింపవలసినదని తెలియవలెను.)

ఉదా:—స్ఫుటార్కః 3-9-17-46 అయనాంశయుత సాయనార్కః 4-0-49-30 భుజజ్యా భాగాది 7-2-43 కోటి జ్యా భాగాది 4-9-47 నీ రెంటినీ నర్థోత్తరమతముగ గుణింపగావచ్చిన 29-22-లను 4-45-లచే హెచ్చింపగా 159-30, దీనిని రవి చంద్రగతి స్ఫుటములచే వేరువేరుగా గుణించివచ్చిన దానిని చక్రకలా సంఖ్యచే భాగింపగావచ్చిన లిప్తాదిఫలములు రవికి 0-22, చంద్రునికి 5-33, సాయనార్కుడు యుగ్మపదమునందుండుటచే చతుర్థచంద్రునిలో చంద్రఫలమునూ ప్రథమ రవిలో రవిఫలమునూ, జేర్చగానయిన దృక్ స్ఫుటగ్రహములు రవిః 3-9-18-8, చంద్రః 9-2-24-18.

గమనింపు:—రవి చంద్ర గ్రహణ కాలములయందు ఇట్టి పంచసంస్కార స్ఫుటగ్రహములను బట్టియే లిప్త్యంతమును దెచ్చి గ్రహణానయనమును జేయవలసినదని గ్రంథకర్త భిప్రాయము, అందు దినద్వయ దృక్స్ఫుటాంతరమును గతి స్ఫుటముగ తెలియవలసినది.

గురూదయాబ్దానయనం:—పశ్చిమాస్తమును బొందియుండు గురువు ఏ మాసమునందు దయమగునో ఆ మాసము కార్తికాదిగ నెన్నవదగునో, చైత్రాదిగ నన్నవ మాస నామమే గురూదయాబ్దమగునని తెలియవలసినది.

భావార్హస్పత్యమానాబ్ద నిర్ణయః:—ఈ గ్రంథోక్తాహర్గణ గుణకభాగ సంఖ్యలచే నేర్పడిన భగణాది మధ్యగురువును 164901029-5-28-1 ఈ భగణాది పూర్వ



ధ్రువములో చేర్చి రాసులుగామార్చి యందొకటిగూడి 60-ట భాగింపగా నిలుచు శేషమునుబట్టి విజయాదిగ లెక్కింపగా వింధ్యసోత్తరమునననుష్టించు సంవత్సరము వచ్చును. అందలి శేషభాగాదులనుబట్టి దెచ్చిన భోగ్యాంశములను గురుమధ్యగతిచే భాగించి దినాదిఫలమెత్తగా వర్తమాన సంవత్సరమునకవతలి సంవత్సర ప్రవేశ కాలమగునని తెలియవలసినది. ఈ అర్థమునుగూర్చి, ద్వాదశఘ్నో గురోర్యాత భగణావర్తమానకైః । రాశిభిస్సహితాః శుద్ధాష్షష్ట్యా స్యుర్విజయాదయః ॥ ఉదారేణ ఘూరేనాత్యః నధోవేషకిం,, భగణాది ధ్రువవాక్యం,,

ఉదా:—ధాతు సం॥ చైత్ర శుక్లప్ర॥ మంగళవారంనాటి అహర్గణం 740 దీనికేర్పడిన భగణాది మధ్యగురువు, 0-2-1-29-30, దీనిని మీదిజెప్పియుండు ధ్రువకములోచేర్చి రాశ్యాదిగజేయగానయిన సృష్ట్యాదిగురురాసులు 1978812355-29-30-30 ఈ రాసులయందొకటిచేర్చి 60-ట భాగింపగా నిలిచిన శేషము 56, ఇది విజయాదిగ సర్వధారియగును, గనుక శేషభాగాదులగు 29-30-30-లను 30-భాగలలో తీసివేసి గురుమధ్యగతిచే భాగింపగావచ్చిన దినాదిఫలము 5-54 దీనినిజూచి సప్తమీ భాను వారంనాడు 54 ఘడియలకు వింధ్యసోత్తరేవిరోధివత్సరారంభమగునని తెలిసెను.

నవనాయకాదయః:—చైత్ర శుక్లప్రతిపత్తిథియొక్క వారాధిపతి రాజ గ్రహమగును, అదే విధమున మేషసంక్రమణ వారాధిపతి మంత్రియూ, సింహ సంక్రమణ వారాధిపతిసేనాధిపతియూ, కటకసంక్రమణ వారాధిపతి సస్యాధిపతియూ, ధనుస్సంక్రమణ వారాధిపతి ధాన్యాధిపతియూ, మిథున సంక్రమణ వారాధిపతి అర్ఘాధిపతియూ, రవేరార్ద్రాప్రవేశ వారాధిపతి మేఘాధిపతియూ, తులాసంక్రమణ వారాధిపతి రసాధిపతియూ, మకరసంక్రమణ వారాధిపతి నీరసాధిపతియూ, అయ్యెదరని తెలియవలసినది అందు, ఆయాసంక్రమణ ప్రవేశకాలము లర్ధరాత్రాత్పరములగునపుడు నారెండవవారాధిపతిని సంక్రమణ వారాధిపతిగ లెక్కించుకోనవలసినది. ఈ అర్థములనుగూర్చి రాజా చైత్రాదినాశేశః....త్యుత్తరవారపాః ॥ కించ-భానోర్భామేయమోరాజ్ఞి బలభద్రో బుధేశనా । సోమేశుక్రేగురోర్భూయాద్ద్వో పాలః పశునాయకః ॥ గురోర్కుకేభవేదాద్రిజ్ఞిపమహాధక చతుష్టయం । చంద్రేబుధే పివానహర్మాధకత్రితయంస్మృతం । రవౌభామేధ్వావ్యధకంస్యా దేకమాధం శనైశ్చరే ॥ ఇట్లునవనాయకనర్హములను తెలుసుకోనవలెను.

మేఘనిర్ణయం:—శాలివాహన శకగతాబ్దములయందొకటి చేర్చగావర్తమాన శకయగును, దానిని 9-చే భాగింపగానిలుచు శేషములనుబట్టిక్రమముగా 1=వాయు, 2=వారుణ,, 3=నీల,, 4=కాల,, 5=ద్రోణ,, 6=పుష్కర, 7=సంవర్త,, 8=ఆవర్త,, 0=తమో మేఘములుదయించునని తెలియవలసినది.

కందాయనిర్ణయము:—ఇష్టసంవత్సరమునందలి చైత్ర శుక్లప్రతిపత్తుయొక్క, వారమును భానువారాదిగనూ, నక్షత్రమును అశ్విన్యాదిగనూ, యోగమును విష్కంభాదిగనూ, కరణమును బవాదిగనూ లెక్కించి వాటినంతయూ మొత్తముజేసియందొకటి కూడిన సనిఫలమగుచు, అశ్విన్యాదిగనెన్నవ నక్షత్రమునకు కందాయఫలమెత్తవలయునో నా నక్షత్ర సంఖ్యయందు ఫలమునుజేర్చి అయిన దానిని మూడుప్రతులుంచి 1-వ దానిని 3-ట పెంచి 8-ట భాగించి నిలిచిన శేషమునూ, 2-వ దానిని 3-చే భాగించిన శేషమునూ, 3-వ దానిని 3-ట పెంచి 5-ట భాగించిన శేషమునూ, వరుసగా ప్రథమ ద్వితీయతృతీయ కందాయములగును ఉదా,-స్పష్టం ||

అథ గ్రహాణాం విశేషాధి కారనిర్ణయః:—వాక్యాని-అశ్వాధిపో రాజః, గజాధిప ఆజ్ఞాధిపో మంత్రిః, పశ్చాధిపసైన్యాధిపో వృషభ సం|| వారేశః, ద్విపాధిపయుద్ధాధిపో అర్ఘేశః, పూర్వసస్యాధిపో కటక సం|| వారేశః, రత్నాధిపపశ్వాధిపో సేనేస్య, ఉత్తరాధిపదేవాధిపో కన్యా సం|| వారేశః, మాంగల్యాధిపోరసేశః యుద్ధాధిపసర్పాధిపస్త్రీణాంఽధిపో వృశ్చిక సం|| వారేశః, పశ్చాత్సస్యాధిప వృషభాధిప మృగాధిపో ధను స్సం|| వారేశః, గ్రహాధి పసరాధిప ఐరాధిపో నీరసేశః, వస్త్రాధిపరాష్ట్రాధిపవ్యవహారాధిపో కుంభ సం|| వారేశః, వ్యాపారాధిపధనాధిప తృణాధిపో మీన సం|| వారేశః, వృష్టాధిపో మేఘేశః, పారోహితో గురురాశిచలనవారేశః, తా|| స్పష్టం.

## ఆదాయవ్యయాదులను గణించుట.

తా|| రవికి=6, చంద్రునకు=2, కుజునకు=8, బుధునకు=17, గురువునకు=19, శుక్రునకు=21 శనికి=10, ధ్రువకములగును=ఏరాశికి ఆదాయము తెలియవలయునో నారాశీశునికి చెప్పియుండు ధ్రువకములో రాజగ్రహముయొక్క ధ్రువకమునుచేర్చినయిన మొత్తమును 3-ట పెంచి 5-చేర్చి 15 ట భాగింపగానిలుచు శేషము ఆదాయ



మగును దానిలబ్ధమును మరల 3-చే పెంచి 5-చేర్చి 15-ట భాగింపగా నిలుచు శేషము వ్యయమగును, ఆదాయగణితము నేజేసి అంత్యమున 5-చేర్చి 15-ట భాగించుటకు మారుగా 3-చేర్చి 7-ట భాగింపగా శేషమారోగ్యమగును, తల్లబ్ధము ను 3-ట గుణించి 3-చేర్చి 7 ట భాగింపగా నిలుచు శేషమనారోగ్యమగును, దాని లబ్ధమును 3-ట గుణించి 3-చేర్చి 7-ట భాగింపగా నిలుచు శేషము రాజపూజితమగును, తల్లబ్ధమునుబట్టి మఱలనదేక్రమముగ గణింపగా శేషము రాజకోపమగును, అందొచ్చియుండిన లబ్ధమునుబట్టి వెనుకటివలెనే త్రిఘ్నత్రియుతాశ్వాప్తక్రమములచే శేషము సుఖమగును తల్లబ్ధమునుండియున దేవిధమున దుఃఖమెత్తవలసినది. ఈ అర్థమునుగూర్చి, పటూసర్యేదద్వయశ్చంద్రః అష్టసంఖ్యాధరాసుతః । బుధస్సప్తదశశ్చైవగురురేకోనవింశతిః || ఏకవింశతి శుక్రశ్చ శనిర్దశమ సంఖ్యయా । రాశీశోన్నృప తేరైక్యం త్రిగుణ్యాం శరసంయుతం । పంచాదశహరే ర్భాగం శేషమాదాయ నిశ్చితం । తల్లబ్ధంత్రిగుణీకృత్య బాణసంఖ్యాచ సంయుతం । పంచాదశహరే ర్భాగం శేషం తువ్యయమాది శేదిత్యాది ||

రాజగ్రహములనుజూచి వర్షవాయువులను విభజించుట:—రవికి వాన 2 భా, గాలి 4, భా,, చంద్రః వాన 3 భా గాలి 2 భా, కుజః, వాన 2 భా గాలి 3 భా బుధః వాన 3 గాలి 4 గురుః వాన 4 గాలి 1 శుక్ర వాన 4 గాలి 3 శనికి వాన 1 భాగము, గాలి 2 భాగములు,,

## వర్షధాన్యాదయః.

వర్తమానశకాబ్దములను 3-ట పెంచి 7-ట భాగించిన శేషమును ద్విఘ్నించి 5-కలుపగా వర్షఫలమగును, తల్లబ్ధమును 3-ట పెంచి 7-ట భాగించిన శేషమును రెట్టించి 5-చేర్చగా ధాన్యఫలమగును అందలి లబ్ధమునుబట్టి నదేవిధమున గణింపగా శీతం, తాపం, ఉష్ణం, మారుతం, ప్రజావృద్ధి, తన్నాశః రాజవిద్వేషం, రాజక్రోధం పుణ్యం, పాపం. ఈ 12 ఫలములునూ వరుసగావచ్చును, ఈ 12-ఫలములయందునూ రెండురెండును తీసివేయగా నిలుచునవి క్రమముగ వ్యాధి,తచ్ఛాంతి, ఆచారం అనాచారం; జననం, మరణం, దేశోపప్లవం, దేశసుఖం, చోరభయం, తచ్ఛాంతి, అగ్నిభయం, తచ్ఛాన్తి, ఫలములగును-శకాబ్దములను 4-చే పెంచి 7-చే భాగించిన శేషమును ద్విగుణించి 8-చేర్చి, వరుసగా వెనుకటివలెనే గణింపగా, ఆకలి, దప్పి, నిద్ర,

ప్లోంబేరి, శాంతం, క్రోధం, డంభం, మిత్రం, మిత్రభేదం, రసనిష్పత్తిః ఫలనిష్పత్తిః ఉత్సాహ ఫలములగును-శకను రెట్టించినారుచే భాగించి నదేవిధముగ గణింపగా వృష్టిక, శిలాపాత, దుష్టనిగ్రహ, శిష్టపాలన, సుఖ, దుఃఖ్క మహోత్పాతముల గును. శకను 8-ట భాగించిన శేషము విద్యుత్ఫలమునూ, 7-చే భాగించిన శేషము శిలాపాతమునూ, నారుచే హరించిన శేషం మేఘ ఘర్జితమునూయగును-వ్యాఘ్రాది ఫలములలో వరుసగా రెండు రెండును తీసివేయగా మృగభాద, తచ్ఛాంతి, అతి వృష్టి, అనావృష్టి, ఎలుకలు, చిలుకలు, మిడతలు, కుక్కలు, నక్కలు, వచ్చును. ఈ ఫలములయందు వరుసగానొక్కొక్కటి చేర్చుకొనగా క్రమముగ ధాతువర్గము లగును-వర్షాదిఫలములే క్రమముగ నవరత్న భేదములునూ, నవధాన్య భేదములునూ, యగునని తెలియవలసినది. ఆకోదప్పి మొదలగుఫలములలో వరుసగానొక్కొక్కటి తీసివేయగా సత్యాసత్య, కరుణాకరుణ, విశ్వాసావిశ్వాస, న్యాయాన్యాయ కపటా కపట ఫలములగును-అదే విధమున వృష్టికశిలాపాతాదిఫలములయందొక్కొక్కటి చేర్చుకొనగా సస్యవృద్ధిః, తన్నాశః, పయవృద్ధిః, తన్నాశః, ఈ ఫలములగును-ఈ నాలుగు ఫలములయందునూ క్రమముగ 2-డు 2-డుచు తీసివేయగా అశ్వవృద్ధిః, తన్నాశః, గజవృద్ధిః, తన్నాశః, ఈ ఫలములగునని తెలియవలసినది.

వర్షధాన్యములు వరుసగా స్త్రీపుం జన్మసంజలగును. వర్ష సంఖ్యను ధాన్య సంఖ్యచే గుణించి మూలమెత్తగా ఫలవీసములగునని వ్యాఖ్యానమునగలదు. మకర సంక్రమణకాలమందలి కరణమునుండియు నీక్రింది విధముగ సంక్రాంతి పురుష నిర్ణయము చేయవలసినది.

బవ=శంఖోదకస్నానం, శ్వేతవస్త్రం, విద్రుమభూషణం, కస్తూరి గంధం, పున్నాగపుష్పం స్వర్ణపాత్రం, అన్నాహారం, నారికేళఫలం, ముసండి ఆయుధం, సింహ్మవాహనం, శ్వేతచ్ఛత్రం,, బాలవ=నింబోదకస్నా, రక్తవ, మౌక్తికభూ, చందనగం, జాజీపు, రజితపా, పాయస ఆహారం, కదళీఫ, భిండి ఆ, వ్యాఘ్రవా, రక్తచ్ఛత్రం,, కౌల=అగరోదకస్నా, చిత్రవ, రజితభూ, కుంకుమగం, వకుళపు, తాంబ్రపా, భక్ష్యా, చూతఫ, అసిఆ, వరాహవా, పీతచ్ఛత్రం, తైతుల=చందనగం, పీతవ, వజ్రభూ, గోరో, మల్లి ఆయుః, అపూప, జంబూఫ, దండా, గార్ధభవా, నీలచ్ఛత్రం,,



గరజ=నిర్మలోద, నీల, గోమేధి, లాక్షాగం, జపాపు, సీసపా, క్షీర, బదరీఫ, ధనురాయు, గజవా, హేమచ్ఛత్రం, వణిక్కు=బిల్వోద, కంబళ, విద్రుమభూ, వసాగం, నీలోత్ప, త్రపుపా, దధి, తాళఫ, తోమరా, మహిషవా, మయూరచ్ఛత్రం, భద్రవ=కావేరీజ, చర్మం, పుష్యరాగ, హరిద్రగం, మాధవి, కాంస్యపా, చిత్రాన్నం, మధూతఫ, తుంతాయు, శ్వానవా, జీర్ణచ్ఛ,,

శకుని=కావేరి, కంథా, స్వర్ణ, కర్పూర, చంపక, శిలా, గుడ, మధూత, పాశాయుధం, అశ్వవా, జీర్ణచ్ఛత్రం, చతుష్పాత్=అగరోదకం, అజినం హేమ, కృష్ణాగరు, పాటల, దారు, మధు, తింత్రిణి అంకుశాయు, అజవా, పాలాశచ్ఛత్రం, నాగవం=అగరో, వల్కల, స్ఫటిక, రక్త, కేతకీ, మృత్, ఆజ్యం, తింత్రిణి, అస్త్ర, వృషభ, పాలాశ, కింస్తుఘ్నం=అగరోద, కంచుక, వైడూర్య, శ్రీగంధ, కుంద, వేణుపా, శర్కర, తింత్రిణి, బాణం, కుక్కుట, పాలాశచ్ఛ,,

ఇట్లు వరుసగా, స్నాన, వస్త్ర, భూషణ, గంధ, పుష్ప, పాత్ర, ఆహార, ఫల, ఆయుధ, వాహన, ఛత్రములను నిర్ణయించుకొని పిమ్మట నీరసాధిపతినిజూచి సంక్రాంతి పురుషుణియొక్క నామధేయాదుల నీక్రింది విధముగ నిర్ణయింపవలసినది, రవికి=ఘోరనామధేయం, పూర్వదిగ్గమనం, తిలధాన్యం, పిశాచిజాతి, మద్దళవాద్యం చంద్రః=ధ్వాంక్షునామ, పశ్చిమది, మాషధా, పితృదే, తాళవాద్యం, కుజః=మహోదరీ, దక్షిణ, కుళిత్థ, వనరాక్షస, డమరుగవాద్యం, బుధః=మంద, దక్షిణ, గోధూమ శూద్ర, దుందుభి, గురోః=మందాకినీ, ఉత్తర, శాలీ, వైశ్య, రుద్రవీణా,

శుక్రః=మిశ్రనా, పూర్వాది, తండుల, క్షత్రియ, వేణువా, శనేః=రాక్షస నామధేయః, పశ్చిమదిగ్యానం, ప్రియంగుధాన్యం, బ్రహ్మజాతి మహాభేరివాద్యం ఇట్లు దెలియవలసినది.

*N. B*:—దివారాత్రులయందలి పూర్వార్ధములు రెండునూ ప్రాక్సంజ్ఞలుగనూ నుత్తరార్ధములు రెండునూ నపరసంజ్ఞలుగనూ యుండుటచే నహోరాత్రాజయుగ్మ పదభేదములనుబట్టి పూర్వరాత్రిలో ప్రాగ్జ్నతాదులునూ నపరరాత్రిలో పశ్చాన్నతాదులునూ జనియించునని భాష్యకారులే కొంధరభిఃప్రాయముల నిచ్చియుండెదరు, అందలి మూలతాత్పర్యములను జూడగ నా విధిక్రమముల నథోలోకస్థులకనగా మనలకు గ్రస్తోదయగ్రస్తాస్తమానములగునపుడందులకు విపరీతమున

గ్రస్తాస్తగ్రస్తోదయములను బొందియుండు దేశస్థులుపయోగింపవలసినదియే దప్ప మనలకుకాదు, భూమధ్యరేఖకు సమసూత్రస్థ నథోముఖమునుబట్టి సూర్యసిద్ధాన్తోక్త కర్ణగతిననుసరించి నీ భూమిమీద గణితముజేయువారలకు తదనుసారక్రమములుగనే సౌరోపనిషదాహర్గణ ప్రవేశకాలమునుండియు కర్కాద్యాది మకరాది భేదములచే పూర్వరాత్రి నపర భాగముగనూ, నపర రాత్రిని పూర్వ భాగముగనూ లెక్కించుకొనవలసినది, మఱియూ ఘటికా సాధనమునందలి నతోన్నతనాడికాస్వరూపములో నతోన్నతలయోగము దినార్ధ సమమని జెప్పియుండిననూ ఉదయాత్పూర్వాపస్తాత్పరములయందు పరమఫలమునుండియూ విపరీతముగ ఛాయాశూన్యమగుటచేతనూ అందు సూర్యోదయాదికాలమునే లెక్కించుటచేతనూ నా విధినందు దప్పమరియెందునూ సరిబడదు, ఇందునుగూర్చి సూర్యదేవయజ్వవ్యా * సర్వదా నతకాలం త్రింశతోవిశోధ్య శేషమున్నతాఖ్యఃకాలః ॥

---

*ఈ అర్థము జాతకాదులయందుదప్ప మరియెందునూ పనికిరాదని కొంధరందురు, వారిమతమున కపాలముభిన్నించి పగటివలెనే రాత్రికాలమున నతోన్నతల యోగము రాత్ర్యర్థమగును (పూర్వరాత్రిలో నస్తాదీష్టకాలమునూ, నపరరాత్రిలో రాత్రి శేషమునూ, క్రమముగ పూర్వాపరయున్నతములగును, వానిని రాత్ర్యర్థములో తగ్గింపగా నతములగును) ఈ విధిఃథోలోకస్థులకని తెలియక పగటియందు గాళ్ళలో నడిచి రాత్రియందు తలలోనడుచునట్లు గ్రస్తోదయస్యగ్రహణే తుపశ్చాత్కపాలవత్పూర్వగ్రహేన్యథాస్తే ॥ అనువాక్యములను జెప్పిననెవరేమిజేయగలరు.

ఉదా:—దినమానము 29.30, పర్వాంతము 29-28, మధ్యలంబనము 3-2 అయిన లంబన సంస్కృతపర్వము 32-30 వచ్చునుగదా, పర్వాంతము 29-32 వచ్చియుండిన లంబన సంస్కృత తిథ్యంతమునగు 26-30, 32_34, వీనిలోనేదిసాధువు-దినార్ధము 15-30, ఇష్టకాలము 30-59, అయిన నతము 15-29 వచ్చునుగదా, ఇష్టకాలము 31-1 అయియుండిన నతములగు 14-29, 15-31 వీనిలోనేది సాధువు, ఎట్టి గణితములయందైననూ పరమఫలమునుండియు క్రమముగ తగ్గునేగానీ విపరీతముగా జాలదను గణిత సూత్రములచే మూలతాత్పర్యములను సరిపోల్చుకొనక మూలతాత్పర్యములనే పాడుజేయుట సాధుసాంప్రదాయికముగ కనుబడదు.



ఈ వాక్యార్థముల ననుసరించియే నీ గ్రంథమునందలి తాత్పర్యోదాహృతములన చటచటనే సవర్ణింపులతోవ్రాయబడియె, ఇందులనుగూర్చి సూక్ష్మాగ్రమతులకు గ్రస్తోదయగ్రస్తాస్తగ్రహణములు రెండునూ సాక్షులిచ్చును.

ఘటీయంత్రము - కర్షేణాభ్యధికైష్షడ్భిః లైఃస్తామ్రస్యభాజనం। త్రింశదంగుళవిస్తారముచ్ఛ్రితం చతురంగుళం॥ స్వర్ణమాషేన కృత్వావై చతురంగుళ కాష్టికాం మధ్యభాగేతుయావిద్ధా నాడికా ఘటికాస్మృతా॥ తద్రంధ్రేణాంభసాపాత్రం యావత్కాలేన పూరితం। సకాలో నాడికాతస్యా షష్టిభాగోవినాడికా ॥ తా-స్పష్టమ్.

వినంతి:—ఓపండితోత్తములారా! నేనొక గొప్ప విద్యావంతుడను గర్వముచే నీ గ్రంథమునువ్రాయలేదు గనుక ఇందలి దోషములను లెక్కగొనక, హంసైరివ బుధైస్సరైర్వరస ఏవాత్ర దుగ్ధవత్ ॥ అనునట్లు క్షమింపప్రార్థించెదను. (గ్రంథకర్త)

# ఇతి శ్రీసిద్ధాన్త చిన్తామణి గ్రన్థే సిద్ధాన్తరహస్యోనామ ప్రథమ భాగస్సమాప్తః

శ్రీ ఛాయాసంజ్ఞాసమేత శ్రీ సూర్యనారాయణస్వామి పాదారవిందార్పణమస్తు హరిః ఓం తత్సత్.



# పదక సంగ్రహము.

## రవ్యాది గ్రహ దినమధ్యగతి యుతపదకాని.

### రవి దినమధ్యగతి యుత పదకములు.

1 ఏ 0-0-59-810
2 ఏ 0-1-58-16 20
3 ఏ 0-2-57-24-31
4 ఏ 0-3-56-32-41
5 ఏ 0-4-55-40-51
6 ఏ 0-5-54-49-1
7 ఏ 0-6-53-57-11
8 ఏ 0-7-53-5-21
9 ఏ 0-8 52-13-32
1 ద 0-9-51-21-42
2 ద 0-19-42-43-23
3 ద 0-29-34-5-5
4 ద 1-9-25-26-47
5 ద 1-19-16-48-29
6 ద 1 29-8-10-11
7 ద 2-8-59-31-53
8 ద 2-18-50-53-35
9 ద 2-28-42-15-17
1 శ 3-8-33-36-58
2 శ 6-17-7-13-56
3 శ 9-25-40-50-54
4 శ 1-4-14-27-52
5 శ 4-12-48-4-50
6 శ 7-21-21-41-48
7 శ 10-29-55-18-46
8 శ 2-8-28-55-44
9 శ 5-17-2-32-42
1 స 8-25-36-9-40
2 స 5-21-12-19-20
3 స 2-16-48-29-0
4 స 11-12-24-38-40
5 స 8-8-0-48-20
6 స 5-3-36-58-0
7 స 1-29-13-7-40
8 స 10-24-49-17-20
9 స 7-10-26-27-0
1 దస 4-16-1-36-40
2 దస 9-2-3-13-20
3 దస 1-18-4-50-0
4 దస 6-4-6-26-40
5 దస 10-20-8-3-20
6 దస 3-6-9-40-0
7 దస 7-22-11-16-40
8 దస 0-8-12-53-20
9 దస 4-24-14-30-0
1 ల 9-10-16-6-40
2 ల 6-20-32-13-20
3 ల 4-0-48-20-0
4 ల 1-11-4-26-40
5 ల 10-21-20-33-20
6 ల 8-1-36-40-0
7 ల 5-11-52-46-40
8 ల 2-22-8-53-20
9 ల 0-2-25-0-0
1 దల 9-12-41-6-40

---

### చంద్ర దినమధ్యగతి యుతపదకములు.

1 ఏ 0-13-10-34-52
2 ఏ 0.26-21-9-44
3 ఏ 1-9-31-44-36
4 ఏ 1-22-42-19-28
5 ఏ 2-5-52,54-20
6 ఏ 2-19 3-29-12
7 ఏ 3-2-14-4-4
8 ఏ 3-15-24-38-56
9 ఏ 3-28-35-18.49
1 ద 4.11-45-48-41
2 ద 8-23-31-37-22
3 ద 1-5-17-26-3
4 ద 5-17-3-14-44
5 ద 9-28.49-3.24
6 ద 2-10-34-52-5
7 ద 6-22-20-40-45
8 ద 11-4-6-29.26
9 ద 3-15-52-18-5
1 శ 7-27-38-6-46
2 శ 3-25-16-13-33
3 శ 11-22-54-20-19
4 శ 7-20-32-27.5
5 శ 3-18.10-33-51
6 శ 11-15-48-40-38
7 శ 7-13-26-47-25
8 శ 3-11.4-54-11
9 శ 11-8-43-0-57



1 స 7-6.21-7-44
2 స 2-12-42-15-28
3 స 9-19-3-23-12
4 స 4-25-24.30-56
5 స 0-1-45-38-40
6 స 7-8-6.46-24
7 స 2-14-27.54-8
8 స 9-20-49-1-50
9 స 4-27-10-9-34
1 దస 0-3-31-17-17
2 దస 0-7-2-34-34
3 దస 0-10-33-51-51
4 దస 0-14-5-9-8
5 దస 0-17-36-26-25
6 దస 0-21-7-43-42
7 దస 0-24-39-0-59
8 దస 0-28-10-18-16
9 దస 1-1-41-35-33
1 ల 1-5-12-52-50
2 ల 2-10-25-45-40
3 ల 3-15-38-38-30
4 ల 4-20-51-31 20
5 ల 5-26-4-24-10
6 ల 7-1-17-17-0
7 ల 8-6-30-9-50
8 ల 9-11-43-2-40
9 ల 10-16-55-55-30
1 దల 11-22-8-48-20

### కుజ దినమధ్యగతి యుతపదకములు.

1 ఏ 0-0-31-26-28
2 ఏ 0-1-2-52-56
3 ఏ 0-1-34-19-25
4 ఏ 0-2-5-45-53
5 ఏ 0-2-37-12-21
6 ఏ 0-3-8-38-49
7 ఏ 0-3-40-5-17
8 ఏ 0-4-11-31-45
9 ఏ 0-4-42-58-14
1 ద 0-5-14-24.42
2 ద 0-10-28.49-24
3 ద 0-15-43-14-6
4 ద 0-20-57-38-49
5 ద 0-26-12-3-29
6 ద 1-1-26-28-11
7 ద 1-6-40-52-53
8 ద 1-11-55-17-35
9 ద 1-17-9-42-17
1 శ 1-22-24-6-59
2 శ 3-14-48-13-55
3 శ 5-7-12-20-55
4 శ 6-29-36-27-54
5 శ 8-22-0-34-53
6 శ 10-14-24-41-51
7 శ 0-6-48-48-50
8 శ 1-29-12-55-49
9 శ 3-21-37-2-47
1 స 5-14-1-9-46
2 స 10-28-2-19-32
3 స 4 12-3-29-18
4 స 9-26-4-39-4
5 స 3-10-5-48-50
6 స 8-24 6-58-36
7 స 2-8-8-8-21
8 స 7-22-9-18-7
9 స 1-6-10-27-52
1 దస 6-20-11-37-38
2 దస 1-10-23-15-16
3 దస 8-0-34-52-54
4 దస 2-20-46-30-32
5 దస 9-10-58-8-11
6 దస 4-1-9-45-49
7 దస 10-21-21-23-27
8 దస 5-11-33-1-5
9 దస 0-1-44-38-40
1 ల 6-21.56-16-22
2 ల 1-13-52-32-43
3 ల 8-5-48-49-5
4 ల 2-27-45.5-27
5 ల 9-19-41-21-49
6 ల 4-11-37-38-11
7 ల 11-3-33-54-32
8 ల 5-25-30-10-54
9 ల 0-17-26-27-16
1 దల 7-9-22-43-38

---

### బుధ కేంద్ర దినమధ్యగతియుత పదకములు.

1 ఏ 0-3-6-24-11
2 ఏ 0-6-12-48-22
3 ఏ 0-9-19-12-32
4 ఏ 0-12-25-36-43
5 ఏ 0-15-32-0-53
6 ఏ 0-18-38-25-3
7 ఏ 0-21-44-49-14
8 ఏ 0-24-51.13-25
9 ఏ 0-27-57-37-34
1 ద 1.1-4-1-45
2 ద 2-2-8.3-31
3 ద 3-3-12-5-16

